శ్రీరామ.

# పీ ఠి క.

కథాసరిత్సాగరస్థ మైనయొక కథ నాధారము చేసికొని, యందలి పెక్కునామములును ముఖ్యవిషయమును దీసికొని, కొంతకథను గల్పించియుఁ బెంచియు మార్చియు నే నీనాటకమును వ్రాసినాను.

"నానాటకము లన్నిటికి మీరు నాందీప్రస్తావనలు వ్రాసితిరి; ఒక్కనాటకము వ్రాసి నాకు నట్టియానంద మొసఁగరా?" యని తనసహజచతురోక్తులతో నన్నుఁ బ్రోత్సాహపెట్టి, దయతో నీనాటకమునకు నాందీప్రస్తావనలు వ్రాసిననాప్రియమిత్రు లగు మ. రా. శ్రీ. పానుగంటి లక్ష్మీనరసింహారావుపంతులుగారికి నాయనేక కృతజ్ఞతాభివందనములు.

కాని, యధికస్నేహాభిమానబలముచే ఆయనప్రస్తావనలోఁ జేసిన ప్రశంసకు మాత్రము నే ననర్హుఁడను.

నాటకరచన కిదియే ప్రథమప్రయత్న మగుటచే, నిందనేక లోపము లుండవచ్చును, గనుక గుణగ్రహణపారీణు లగువిద్వచ్ఛిరోమణులు వాని మన్నింపఁ బ్రార్థితులు.

పీఠాపురము.

8—6—1917.

కూచి నరసింహము.

శ్రీరామ.

# నాటకమున వచ్చుపాత్రములు.

## పురుషపాత్రములు.

1. పృథ్వీరూపుఁడు—దక్షిణాపురాధీశ్వరుఁడు
2. సుమంత్రుఁడు—పృథ్వీరూపునిమంత్రి
3. దూరదర్శి—సుమంత్రునికొడుకు—పృథ్వీరూపునిమిత్రుఁడు
4. రూపధరుఁడు—కర్పూరద్వీపరాజు
5. మతిమంతుఁడు—రూపధరునిమంత్రి
6. రామానందుఁడు—రూపధరునిపుత్రికకును, మతిమంతునికూఁతునకును మఱి కొందఱకును గురువు
7. శివశర్మ—రామానందునిశిష్యులలో నొకఁడు
8. పౌండ్రకుఁడు—భిల్లదేశరాజు
9. ధర్మాచార్యుఁడు—పౌండ్రకునిమిత్రుఁడు
10. చంద్రమౌళి—పౌండ్రకునిమంత్రి
11. భానువర్మ—పురుషవేషముధరించిన రూపలత
12. సోమవర్మ—పురుషవేషముధరించిన కాత్యాయని
13. శూరసేనుఁడు } పౌండ్రకునిసేనాధిపతులు
14. వీరసేనుఁడు } పౌండ్రకునిసేనాధిపతులు
15. దౌవారికుఁడు
16. సేవకులు

## స్త్రీపాత్రములు.

17. హేమలత—రూపధరునిభార్య
18. రూపలత—కథానాయిక, రూపధరునికూఁతురు
19. కాత్యాయని—మతిమంతునికూఁతురు—రూపలతస్నేహితురాలు

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# రూపలత.



## నాంది.



చ. స్థితిగతులందు, రూపముల, • శేముషిలోన, గుణాళియందు, వి
స్తృతతమభేదములఁ గల కు•శీలవకోటి సృజించి, గాఢసం
స్మృతి బహుచిత్రరంగమునఁ • జేరిచి, యాడఁగఁజేసి, తచ్ఛుభ
త్కృతిఁ గనుసృష్టిసూత్రధరు • దివ్యవిలాసము ప్రోచు మిమ్ములన్.

సూత్రి—పారిపార్శ్వకా! ఇదివఱకే యాలస్యమయినది. శీఘ్రముగా నిటు రమ్ము.

(పారిపార్శ్వకుఁడు ప్రవేశించును)

పారి—బావా! వచ్చితిని. ఏమిసెలవు?

సూత్ర—రసికశిఖామణు లగునీపరిషన్మహాజనులయెదుట,

ఉ. రూపలతాభిధానమునఁ • గ్రొత్తగఁ బుట్టినరూపకంబు; బా
వా! పరిపుష్టముఖ్యరస• పాత్రము, కంజమరందమంజులా
లాపకలాప, మార్యనుత•లాలితనీతియుతంబు, నవ్యగా
థాపటిమాభిరామము, ప్ర•దర్శన మిప్పుడె చేయఁగావలెన్.

పారి—క్రొత్తగఁ బుట్టినరూపక మనుచున్నారు. అన్నవరసత్యనారాయణమూర్తి వలె నదికూడ స్వయంభు వనియే మీయభిప్రాయమా?

సూత్ర—కవి యెవ్వరో చెప్పెదను విను.

సీ. ఆంగ్లేయభాషయం • దసమానలసమాన
సాహితీసంపత్తి • సంయుతుండు,

పారి—ఆంధ్రభాషాపాండిత్యముమాట ముందుగాఁ జెప్పక, యాంగ్లేయభాషాపాండిత్యమునుగూర్చి చెప్పెదవేల? ఆంధ్రగ్రంథరచన కది యున్నఁగాని పనికిరాదా యేమి?

సూత్రి— తేనె నై పన్నీటి సోన నై తనరారు
తెలుఁగు బాసను నాటి తేటజేసెనతఁడు,

పారి—ఆలాగంటివి. బాగుగా నున్నది.

సూత్రి— ప్రఖ్యాతపీఠికా పట్టనోన్నత రాజ
పాఠశాలాంధ్ర సత్ప్రథమగురుఁడు,
రామకృష్ణాఖ్యప రమహంసగౌరాంగ
చరితాదిరచనావి శారదుండు,

పారి—ఆయన యింతకుముందు రెండు గ్రంథములు వ్రాసి యుండిరా? ఇఁకసందే
హమేల! ఆయనయీనాటకము జనాదరణపాత్రమై యుండకపోదు.

సూత్రి— గీ. ప్రథమశాఖాద్విజుఁడు, రామ భక్తవరుఁడు
శాంతమూర్తి, పురాతనా చారవర్తి,
వినయసంస్ఫూర్తి, వైనకృష్ణా చి నరసింహ
కవివరుఁ డొనర్చె నీనాట కమును బావ!

పారి—బుద్ధియొక్కటి యున్నయెడల, నెన్నిగ్రంథములైన వ్రాయవచ్చును. ఎన్ని
గ్రంథములైన పల్లింపవచ్చును. అది యొక బ్రహ్మాండముకాదు. అట్టిబుద్ధి
నాకుఁ బూజ్య మగుటచేతనే కాదా మొదట రామానందపాత్రమును దీసి
కొని పద్యములువల్లింపలేక, తుదకుఁ బారిపార్శ్వకపాత్రములోనికి, భావపా
త్రములోనికి బదలాయించుకొనవలసివచ్చినది?

సూత్ర—మనకవిని శ్లాఘాపాత్రుని జేసినది కేవలము బుద్ధియేకాదు, దానిని మించిన
యోగ్యతకూడను. చూడు! రామానందపాత్రమున కున్నపద్యములలో నొ
క్కటియైనజ్ఞప్తిలేదా? రామానందుఁడు తనవర్తనమునుగూర్చి చెప్పుకొనినప
ద్యమున్నదే, అది యొక్కసారి జ్ఞప్తి నున్నఁ జదువుము.

పారి—మొద్దునటకుని మొదలు బృహస్పతియంతనటకునివఱకు మొద లందీయకుండఁ
జదువఁగలవాఁడు లేఁ డనునాటకరహస్యము నీవెఱుఁగనిదా, బావా!

సూత్ర—ఆపద్యము మొద లేదియో చెప్పెదను, ఉండు. "నలుగురకు నగుసౌఖ్య మే—

పారి—ఆ !

నలుగురకు నగుసౌఖ్యమే ♦ నాకు సుఖము,
నలుగురకు నగువంతయే ♦ నాకు వంత,
వలయువారికి నాకుల♦బ్ధ మయినట్టి
విద్య నేర్పుటయే నాకు ♦ వేడ్క రాజ !

సూత్ర—సరిగా నీమాటలే కూచినరసింహకవికిఁ జెల్లును.

పారి—అయ్యా ! కూచి యనఁగా నేకూచి ?

సూత్రి—ఏకూచి యేమి ? నీ మొగము !

పారి—కోపపడకుము. ఎలకూచియేమో యనుకొనుచున్నానయ్యా ! వీరు బాలసరస్వతి బంధువులా యేమి ?

సూత్రి—బాలసరస్వతిబంధువులు కారు. ప్రౌఢసరస్వతిబంధువులు. బావా లేనిపోనిప్రసంగమువలనఁ గాలము వ్యర్థసేయకుము. శీఘ్రముగాఁ బ్రదర్శన మారంభింపుఁడని నటకులతోఁ జెప్పియుంటి నని యెఱుఁగవా ?

పారి—నాయాలస్య మెంతమాత్రమును లేదు. నీవు పిలుచుటచే నేనిప్పటికి వచ్చితినిగదా ! నేనేమిచేయవలయునో నాకుఁ జెప్పకుండునప్పు డాలస్యము మీదియా నాదియా ?

సూత్ర—బావా ! అదియే చూచుచున్నాను. ఏదైనఋతువునుగూర్చి పాడుటకు నిన్నుఁ బిలిచితిని. కాని, నాటకము శృంగారరసమంచితమని వసంతఋతువును గూర్చి పాడుమందునా ? ప్రబలయుద్ధముఁగూడ దీనిలో వర్ణింపఁబడియుండుటచేత శరదృతువునుగూర్చి పాడు మందునా? యని యోజించుచున్నాను.

పారి—బావా ! విశేషయోజన మక్కఱలేదు. ఈకాలమున ఋతుక్రమము సరిగా లేదు. అదిగాక, యిట్టిఋతుసంధి కలిగినప్పుడు ఋతువర్ణనము మానివేయుటయే మంచిది. అదియుఁగాక యవసరమునుబట్టి నాందీప్రస్తావనలు సమూలముగా నెగురఁగొట్టి నాటకము లాడుచున్నమనకు ఋతువర్ణన మానివేయుటయొక పెద్దలోపమా ?

సూత్రి—అట్లనెదవేమి ?

(నేపథ్యమున)

అట్లనెదవేమి ? మంత్రివర్యా !

సూత్రి—అదిగో ! వింటివా ? అప్పుడే పృథ్వీరాపుఁడు మంత్రి యగునుమంత్రినితో మాటలాడుచున్నాఁడు.

పారి—ఔను. పరిదర్శన మారంభించినతరువాతనైనఁ బ్రస్తావన మానఁదగదా ! రా శీఘ్రముగా లోనికిఁ బోవుదము.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

పానుగంటి లక్ష్మీనరసింహారావు.

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# రూపలత:

## ప్రథమాంకము.

ప్రదేశము—దక్షిణాపథములోని ప్రతిష్ఠానపురము, రాజమందిరము.

ప్రవేశము—పృథ్వీరూపుఁడు, సుమంత్రుఁడు.

పృ—అట్లనెద వేమి? మంత్రివర్యా! తాతగారినాఁటినుండి యసమానప్రజ్ఞతో రాజకార్యములు నిర్వహించుచుంటివి. నేను రాజ్యమునకు వచ్చి పట్టుమని పదివర్షము లైనఁ గా లేదు కద! అప్పుడే విశ్రాంతి కావలయునా?

సు—శాంతచిత్తమునకు విశ్రాంతి కాక మఱి యేమి కావలయును?

తే. గీ. మూఁడుతరములు చూచిన ♦ ముసలివాఁడఁ;
బూర్ణరాజభక్తిని రాష్ట్ర ♦ మును నడపితిఁ;
గరుణ నీఁకనైన ముందుమా ♦ ర్గంబుఁ జూచి
కొనఁగనీయవె భూపాల ♦ కులవతంస?

పృ—నాముందుమార్గముమాట యేమి చెప్పెదవు?

సు—అది యొకఁడు చెప్పనక్కఱ లేకుండఁగనే మీరు చూచుకొనుచున్నారు. మీ వలెనే నన్నుఁ బోనిం డని నాప్రార్థన.

పృ—(స్వ) నాశపథమునకు దెప్పుళ్లు కావుగద? (ప్ర) కాని, చిన్నప్పుడు నాకును నీకొమారుఁడు దూరదర్శికిని రాజనీతి యుపదేశించునప్పుడు సదుద్యోగులం గూర్చి యేమేమో చెప్పితివే.

ఆ. ఇచట నచట మేలు ♦ నెనయఁగోరెడువారి
కీనుఁడె దేవుఁ డంటి; ♦ వినుని మెప్పె
మోక్షమంటి; భిన్న ♦ ముఖకార్యకరణమే
తెలిపి యంటి; మఱచి ♦ తే యమాత్య?

సు—కృతజ్ఞత, ప్రోత్సాహము, హెచ్చరిక యున్నప్పు డన్నియు నున్నవి. కాని యవి యేవి? మఱచితి నే యనుకొనుఁడు. ముదిమిచేఁ గలిగినయమాత్యుని మఱపు క్షంతవ్యము గాని, పూర్ణయౌవనుఁడై, సమస్తవిద్యాపారంగతుఁడై దృఢమనస్కుఁడైననృపాలశేఖరునిసత్త్వావిస్మృతిమాట యేమనెదరు?

వృ—సుమంత్రీ! ఊరక యేల నామీఁద లేనినేరములు మోపెదవు. నే నెవఁడ నైనఁ గావచ్చును గాని కృతఘ్నుఁడనుమాత్రము గాను. ధనము లోపము చేసితినా? గౌరవము లోపము చేసితినా? గురుపదముగఁ జూచుకొనుచుంటిని. పూజ్యు లగుమాతండ్రిగా రాయనయవసానసమయమున నన్ను నీకుఁ జేతిలోఁ జేయిపెట్టి యప్పగించుటచేఁ బితృసమునిగ నెంచి తలమీఁదఁ బెట్టుకొని పూజించుచుంటిని. నీవుమాత్ర మెఱుఁగవా?

సు—ఎఱుఁగుదును. అన్ని యున్నవి. అంచునకుఁ దొగరు లే దన్నట్లున్నది. ధనగౌరవము కావలసినంత, కాని వాక్యగౌరవము లేదు. చిత్తగౌరవ మంతకంటె లేదు.

వృ—నా కేమియు బోధ పడ కున్నది.

సు—ఆత్మదోష మెఱుఁగుట యతికష్టము గాదా!

వృ—అద్దమువలె నీవెదుట నుండఁగనే!

సు—అందుచేతనే తమలోపములు నాలోపములుగ గోచరించుచున్నవి.

వృ—రాజ్యతంత్ర మంతయు నీచేతిలోఁ బెట్టుట లోపమా? నీవు చెప్పినట్లే చేయుదుననుట దోషమా? నీతికోవిదుఁడ వయ్యు నిట్లూహించుట కడుఁజిత్రముగ నున్నది.

సు—అనుట దోషము గాదు. అన్నట్లు చేయకుండుట. మొన్న గురువారము రాత్రి మనయిద్దఱకు జరిగినసంభాషణము జ్ఞప్తిలో లేదా?

వృ—ఓహో! నన్నుఁగూర్చి నేఁ జేసికొనినప్రతినకును రాజ్యపరిపాలనకు నేమి సంబంధమున్నది?

సు—రాజునకును రాజ్యమునకును సంబంధమే లేదా?

గీ. పడవ రాష్ట్రంబు, చుక్కాను ♦ ప్రభువరుండు;
వరము జనతతి, ముత్యాలఁ ♦ జక్కఁ గలియఁ
గట్టుసూత్రము ప్రాజ్ఞుఁడౌ ♦ భూమివిభుండు;
రాజుజీవంబె చెడ, నింక ♦ రాజ్య మేది?

పృ—నా ప్రతిజ్ఞాభంగము చేయుట నీవంటివానికిఁ దగునా ?

సు—అసత్యప్రతిజ్ఞ చేయుట తమవంటివారికిఁ దగు నని తోఁచెనా ?

పృ—ప్రభునకు స్వాతంత్ర్యమే లేదా? స్వవిషయములలోఁగూడ నేఁడు మంత్రి చేతికీలుబొమ్మయే కావలెనా ?

ఆ. పన్ను గొనుటయందుఁ • బన్ను మానుటయందుఁ
బ్రజకు సుఖముఁ గూర్చు • పట్టులందు
శత్రుజయమునందు • సరె మంత్రిమంతనం ;
బగునె పానభోజ • నాదులందు ?

సు—ఆ పేయాభక్ష్యరతులు గానియెడల నట్లే.

పృ—వైద్యునిపనియుఁ బాచకునిపనియుఁ గూడ మంత్రియే నెత్తిమీఁద వేసికొన వలెనా ?

సు— ఆ. ప్రభువు బాగుకొఱకుఁ • బ్రాణంబు లిడుమంత్రి
బానసీఁడు, వెజ్జు, బానిసీఁడు,
బట్టు, దూఱువాఁడు, • పరమశత్రు వొకట్టు,
పేరు లేవి యైనఁ • బెట్టవచ్చు.

పృ—అట్లయిన రాజు కూడఁ గావచ్చును. నీటిపై నయస్కాంతశకల మెట్లు త్రిప్పిన నట్లు తిరుగు నినుపబొతువలె నస్వతంత్రుఁడైన రా జుండిన నేమి లేకుండిన నేమి ?

సు—మహారాజా ! నేను మీకెంతపార్శ్వశూలముగఁ బ్రాణసంకటముగ నుంటిఁ; గనుక నే యీపాటి సెల వొసఁగుఁడని ప్రార్థించితిని.

పృ—నేను వివాహ మాడకుండిన నీకింతవిచార మేమి ?

సు—నా కొక్కనికే కాదు. రాజ్య మంతకును,

గీ. పూలుఁ గాయలు లేనట్టి • పొదుగుచెట్టు
నొప్పునా రామ మెట్లుప • యోగపడునొ
స్వామి, కానూడిక్క నుపయోగ • పడును బ్రకృతి
జనమునకు రాణిలేనట్టి • యుర్విభుండు.

పృ—అదిమాత్రము చల్లనినీడ నిచ్చి తాప మాఱుచుట లేదా ?

సు—ఆ! జీవించియున్నంతవఱకు.

పృ—పిమ్మటనైనఁ గావలసినన్ని యింధనముల నిచ్చునే.

సు—ఔను! స్వపరదహనార్థము.

పృ—కామాగ్ని యింధనాగ్నికంటె వేఁడి గాదా?

సు—దీనికిఁ బ్రత్యుత్తర మిచ్చుటకు మీరు నేనుఁగూడఁ దగము. మీ.కది యనుభూతము, నాకు స్మృతిమాత్రావశేషము. కాని,

క. భూపా! రెండుఁదెఱంగుల
తాపములం గనును బ్రాణి ♦ తతి; వెనుకటిదొం
డోపు సుఖ మీయు, రెండవ
తాపముమాత్రంబు సర్వ ♦ దా దుఃఖదమౌ.

నీవంటివానికిఁ గామాగ్ని మొదటితాపమువంటిది. రాష్ట్రము చేసికొన్న ప్రారబ్ధముచే నిన్నది యింకను జెనకకున్నది.

పృ—(స్వ) చెనక కుండ లేదు. చెనకఁబోయి చల్లారినది—(ప్ర) మంత్రీ! నీ కన్నులముందఱఁ బుట్టితిని. నిన్నఁగాక మొన్నఁ బట్టాభిషిక్తుఁడ నైతిని. ఉద్వాహకార్యమున కప్పుడే త్వరపడెద వేల?

సు—జాంబవంతునినాఁటి మంత్రియెదుట జిత్తులుపన్నెదవా బాలభూపాలా? ఇప్పటి కింకను బెండ్లివయసు రాలేదేమి? మున్నెప్పుడైన మఱల నడిగినఁ, బెండ్లీవయసు దాఁటినది యింకఁ బెండ్లి యెందుల కనుటకే కాదా!

పృ—అబ్బబ్బా! ఈబలాత్కార మేల? ఈయొక్కవిషయమునందుఁ దక్క మిగిలినవానిలో నీ వేమిచేయుమన్నఁ జేతులు గట్టుకొని చేసెదను. ఇందులో నాయిష్టానుసారముగఁ బోనిమ్ము.

సు—ఇది యొక్కటి దక్క మి మ్మొకటి చేయుఁ డని నే నింక బలవంతపెట్టను. నామనవి యాలకించి నన్ను మన్నించి నేను జెప్పినట్లు చేసి నన్నును సర్వ రాష్ట్రజనులను జరితార్థులఁ జేయుఁడు.

పృ—తక్కినయన్నిటిలో నీవాక్యోల్లంఘనము చేయుట కియ్యకొందువా?

సు—ఆ!

పృ—రాజ్యము పాడుకాదా! యింతకాలమునుండి నీవు శ్రమపడి యార్జించిన యశస్సు బుగ్గిపాలు గాదా!

సు—కాదు.

పృ—ఎందుచేత?

సు—మీ రెప్పు డట్లు చేయరు గనుక.

గీ. భానుఁ డుదయింపవచ్చును ♦ బశ్చిమమున;
నిందు తారలు వ్యత్యాస ♦ మందవచ్చు;
నరవితతి తలక్రిందుగా ♦ నడువవచ్చుఁ;
గాని మీరొనరింపరు ♦ కానిపనులు

ఇట్టి సుగుణరాశివలన నట్టిబాధ లెన్నఁడుఁ గలుగవు. కాని మాయభాగ్యదేవత ప్రేరణమున మీ రీయొక్కపట్టుమాత్రము పట్టితిరి. ఆపట్టువిడువుఁడని వీఁడు చెయిపట్టి ప్రార్థించుచున్నాఁడు.

గీ. నేను మీతాతనాఁటినుం ♦ డియును జేసి
నట్టియుపకృతులను జూడుఁ; ♦ డఱిగి ముడిఁగి
శల్యమాత్రావశిష్ట మై ♦ చావ నున్న
తనువు, డెబ్బదియేండ్ల యీ ♦ తనువుఁ గనుఁడు.

క. కలుగకకలుగక కలిగిన
తొలితుదిమూలైన నాసు ♦ తుని జూడుఁ; డిఁకీ
వల మాకెట్టులు నీళ్లని
తలపోయుచు నేడ్చుమాపి ♦ తరులను గనుఁడీ.

పృ—నీమాట లత్యాశ్చర్యకరములుగ నున్నవి. అయ్యయ్యో! వాయవివాహితత్వము నీపితృదేవతల నె ట్లేడ్పించునయ్యా!

సు—అయ్యా! వయసులో, బుద్ధులలో, మాట వినకపోవుటలో, దూరదర్శిభయు మీయంతవాఁ డైనాఁడు. తండ్రిమాట వలదఁట. పెండ్లి వలదఁట. వానితో నిఁక మావంశము సరి.

గీ. దూరదర్శికిఁ దరువాత ♦ వారివోయు
వాడు లే కుంట, నాలోటుఁ ♦ దీఱుదాటకే

యతనితల్లియు నేను న ♦ హర్నిశంబు
వగుచుచున్నాము బాష్పని ♦ వాపవారి.

పృ—మంత్రీ! సర్వప్రపంచదుఃఖమునకు నేను గారణ మగుట నాదురదృష్టము గాక మతి యేమి?

చ. ధనబలశాలి యంచుఁ, బ్రభు♦తాగరిమోజ్జ్వలుఁ డంచు, భోగభా
జనపదసంస్థితుం డనుచు ♦ సంస్తుతి సేయుదు రెంతవెఱ్ఱులో
జనులు నృపాలుఁ; గాని యని♦శం బురుబాధల మున్గునస్వతం
త్రినరుఁ డశాంతిసంకులమ♦నస్కుఁ డతం డని యెంచ రక్కటా!

మ—అట్టిచింతలను సాధ్యమైనంతవఱకుఁ దొలఁగింపఁ బ్రియత్నించుచుండినను దృణీకృతుఁ డగుమంత్రియొక్క దురదృష్ట మంతకంటె నెక్కువగాదా?

పృ—అలాగుననా?

ఉ. భార మిఁకొక్కభారమునఁ ♦ బాసిన, వేఁడిమి వేఁడిచేతఁ జ
ల్లారిన, సీతు శీతలప♦దార్థసమాకృతిచేఁ దొలంగినన్,
బోరుటచేతఁ బోరితము ♦ వోయిన, నప్పుడు మంత్రివర్య! సం
సారదురంతదుఃఖము ని♦జంబుగఁ బోవును బెండ్లి యాడినన్!

మ—వివాహసుఖ మంతశశవిషాణతుల్యమా మహారాజా! నీవు చెప్పినవైనఁ గొన్నిపట్ల నసంభవములుగాఁ జూపట్టవే!

సీ. భారంబుచేతను ♦ భారంబు తగ్గుట
కానడికుండలఁ ♦ గనినఁ దెలియు,
వేఁడి వేఁడిని గొట్టి♦వేయుట కామినీ
కాముకాశ్లేష సౌ♦ఖ్యములఁ దెలియుఁ,
సీతుచే సీతు న♦శించుట చల్లని
పసుపు సున్నముఁ గూర్పఁ ♦ బయలుపడును,
బోరులచేఁ బోరు ♦ పోకాడుట తదంత
దేశమైత్రిని శాంతిఁ ♦ దెలియవచ్చు,

గీ. నివ్వి యన్నియు నిజ మైనఁ, ♦ బువ్వుఁబోఁడి
వలచి వలపించి యాడును ♦ ద్వాహమున, న
పారదుర్భర ఘోరసం ♦ సార బాధ
సన్నగిల్లుటమాత్ర మా ♦ శ్చర్య మయ్యా ?

పృ—వాదిబల మగపడుచున్నది గాని వాదబల మంత లేదు. వివాహ మయినపిదప నది సౌఖ్యదాయకము గానియెడల ?

సు—అనుకూలదాంపత్యము కా దన్నమాట.

పృ—దాంపత్యప్రాతికూల్యము కలుగ కుండఁ గాచుకొనుమార్గ మేది ?

సు—తొలుత వరించుటలో వధూవరు లనువయోరూపవంశస్వభావులుగను, నవ్యాజానురాగులుగను, నున్నారో లేరో చూచుకొనుటయే.

పృ—పిదప నవి మాఱఁగూడదా ?

సు—మొదటివి మాఱును గాని తక్కిన వెట్లుమాఱును ? అవ్వియైన నుభయులకుఁ గూడ మాఱును గాన వా రెప్పుడు సవయోరూపులుగనే యుందురు. చివరది యంతకంతకు హెచ్చి యాకొఱంత దీర్చును.

శా. తారుణ్యంబున మంజులాకృతిని జి ♦ త్తంబందుఁ బ్రేమామృతం
బూరు న్దోల్తను బ్రేయసీప్రియుల; కా ♦ యొప్పారుపూర్వంపుటా
కారంబు న్వయ సోసరిల్లుకొలఁదిన్ ♦ గల్యానురాగంబు వి
స్తారంబౌ, సతతోపయుక్త మగునా ♦ తం బుట్టునీరంబటుల్.

పృ—ఆయనురాగము ప్రజలమీఁదఁ బెట్టిన రాజ్యమునకు లాభము కాదా ?

సు—అది యిదివఱకే యున్నది. ఆవిషయమున నాయుపదేశ మనావశ్యకము.

పృ—ఈమాటలు మీదూరదర్శికి నచ్చఁజెప్పితివా ?

సు—చుక్కానుద్రిప్పక పడవెట్లు తిరుగును ?

పృ—ఒకటి యిటు త్రిప్పిన రెండవది యటు తిరుగు నేమో సుమా ?

సు—ఓడపైభాగ మొక్కచోటను నధోభాగ మొక్కచోటను నుండవు.

పృ—(స్వ)గీ. చాలఁ జిత్రంబుగద ప్రపం ♦ చంబు చూడ;
బ్రహ్మచర్యంబు ప్రాంచిత ♦ వ్రత మటంచుఁ
జేసికొంటిని; దాని కీ ♦ చిక్కు వచ్చెఁ;

పృథివి విఘ్నంబు లన్నియు ♦ శ్రేయములకె.

గీ. కోరి యొకకాంత నేఁగట్టు ♦ కొనినఁ గాని
దూరదర్శియు నిలబ్రహ్మ ♦ చారిగానె
యుండు నని యెంచి యితఁడు నా ♦ పెండిలికయి
స్వార్థపరుఁ డయి తహతహ ♦ నందువాఁడె;

క. ఏమెయి వదలకుఁ డెపు డని
ప్రేమను మాతండ్రి, తాత, ♦ మృతిసమయములన్
దామాత్మజులకుఁ దెల్పిన
యీమాన్యుఁడు స్వార్థపరని♦కృష్టుం డగునే?

గీ. ప్రేమ స్వజనుల బాధలఁ ♦ బెట్టుటరయ
గట్టికౌఁగిళ్ల బిగియించి ♦ గిట్టఁజేసి
నట్టు, లింపగు తేనియ ♦ తెట్టియలను
గ్రుక్కి నోటను మరణంబుఁ ♦ గూర్చినట్లు.

ఆ. పట్టువట్టి పెండ్లి♦బాధ నేఁ దప్పించు
కొన్న నితరబాధ ♦ లెన్నియుండుఁ
గష్టపుష్టమైన ♦ ఘోత్రతలంబునఁ? బెండ్లి
మానినంత నవ్వి ♦ మాను టెట్లు?

ఆ. ప్రతిన వమ్ము నేను ♦ బరిగణించినఁ, బితృ
వాక్యపాలనంబు ♦ వమ్ముగాదె?
యింక నాకుఁ దప్ప ♦ దిట ధర్మభంగంబు;
దానివలన నైన ♦ దీన నైన.

(ప్ర) సుమంత్రా! విశ్వామిత్రుఁడు నీముందఱ నెందునకుఁ బనికిరాఁడు సుమా!

సు—మూర్ఖపుఁబట్టుదలలోనా?

ప్ర—ఒక్కదానిలోనే కాదు. సత్యభంగసత్కార్యకరణధురంధరతలోఁ గూడను.

సు — సత్యమూర్తి యగుహరిశ్చంద్రునిసత్కీర్తి యెంత హెచ్చుచేసెను గాని దా
నిని మాపలేదే యతఁడు.

వృ — చిక్కులు పెట్టిపెట్టి తుదకు.

సు - పరమపురుషులసుగుణములు పత్రములనుగంధమట్లునలిపినఁగాని బయలుపడవు.

వృ — సత్యాసక్తుఁ డగునామహాత్మునకుఁ గష్టములు సుఖాంతములయ్యెను గాని నా
యట్టివాని కెట్లగును?

సు — అందుచేతనే మీరును శీఘ్రముగ సత్యాసక్తులు గావలయును.

వృ — న న్నేమి చేయుమనెదవు?

సు — చేయఁదగినదియే. చేయక తప్పనిదియే.

వృ — (స్వ) ఆ. సర్వశాసకుండు ♦ శాసితుం డయి, యిట్లు
సేయుమన్న నట్లె ♦ చేతు లొగ్గి
చేయవలసివచ్చె ♦ మాయావియౌ కర్మ
మెట్లు త్రిప్పుచున్న ♦ దెల్లసృష్టి?

గీ. అన్నియును నేనె యొనరించు ♦ చున్నవాఁడ
ననుచు మూఢుండు విఱ్ఱవీఁ ♦ గును, ధరిత్రి
నేగు నొకబండిపై బ్రాలి ♦ యీఁగ నేనె
యంతధూళి రేఁపుచునుంటి ♦ నన్నయట్లు,

ఆ. ఎల్లదేహధారు, ♦ లింటింటికిం బోయి
బిచ్చమెత్తి బ్రదుకు ♦ పేదఁ దొట్టి
రాజ్యమేలునట్టి ♦ రాజువఱకుఁ, గర్మ
వశులు నస్వతంత్ర ♦ వర్తనులును.

(ప్ర) సుమంత్రా! నీయిష్టమువచ్చినట్లే చేసెదను. కాని వధూనిర్ణయమ్మై
నను నాకు వదలిపెట్టవలయును.

సు — అనఁగా రూపలావణ్యకులీనతాదిసకలసద్గుణవతి యగుకన్యను వివాహ మాడె
దరన్నమాట. అంతేకాదా?

వృ — అదంతయు నెందులకు? నాకు నచ్చినకన్యను గాని పెండ్లియాడను. అంత
వృద్ధిగ నట్టికన్యకై వెదకుచుందును,లభించినతోడనే నీయభీష్టము నెఱవేర్తును.

సాధుసంతాపభీతిచే, మిత్రుఁడగుదూరదర్శిప్రీతికొఱ, కాత్మప్రతిజ్ఞాభంగము నకైన నొప్పుకొని యింతమట్టునకు దిగినప్రభువు నిఁకఁ జిక్కులుపెట్టకుము.

సు—శుభమస్తు. (దౌవారికుఁడు—మహాప్రభూ! దూరదర్శిగారును మఱియొక రివ్వరో క్రొత్తవారును సెలవుకై నిరీక్షించుచున్నారు.) నే నిఁక సెలవు దీసికొనియెదను. పడుచువారిప్రసంగమునకు ముసలివారిసంపర్క మనావశ్యకము. (నిష్క్రమించును.)

ప్ర—రావచ్చునని చెప్పు.

దౌ—చిత్తము.

(దూరదర్శియు నొకసాధువును బ్రవేశింతురు.)

దూ—జయము జయము మహారాజా! ఈయన బహుపుణ్యక్షేత్రముల సేవించి యాగంతువుగ మనపట్టనమునకు వేంచేసినయొకసాధువు.

ప్ర—(లేచి) పుణ్యపురుషా! అనేకసాష్టాంగనమస్కారములు. ఈయాసనమును బవిత్రము చేయుఁడు. దూరదర్శీ! నాకీమహానుభావుదర్శనముఁ గావించి మహోపకారము చేసితివి. కూరుచుండుము.

సా—కల్యాణమస్తు. (అని కూరుచుండును.)

(అందఱుఁ గూరుచుందురు.)

ప్ర—మహాత్మా! నేఁడు మీదర్శనలాభమువలన నాకెంతో సుదినము.

సా—నే ననవలసినమాట మీ రనుచున్నారు.

ప్ర—మహానుభావా! అది యెట్లు?

సీ. మనసువచ్చినయట్లు • చని సర్వదేవాల
యములు సేవించుపు • ణ్యాత్మునకును,
వర్జితసంసృతి • వ్యాపారుఁడై పోయి
సృష్టిచిత్రముల వీ • క్షించుసుఖికి,
దొరకినదానితోఁ • దుష్టి నొంది భుజించి
నేలపైఁ బవళించు • నిస్పృహునకు,
నంచితశ్రీహరి • ధ్యానధారామగ్నుఁ
డై భక్తిసుధఁ గ్రోలు • నమలమతికిఁ,

సీ. గష్టములకొంప, చింతల • కడలి, బంధ
సంతతులపుట్టినిల్లు, సేవ • చ్చాళిటపికి
వేరుపు, ర్వట్టియీరాజ్య • భారమును వ
హించుననుఁ జూడఁగా శుభ • మెట్టు లౌదవు ?

సా—మహారాజా ! ఇతరులు సమస్తైహికభోగపరాయణు లై యుండుస్థానమునం దు, వయసునం దుండి, రాజ్యభారమును గుఱుతెఱిఁగియుండుటే మీయోగ్యతను బ్రకటించుచున్నది. దానివినికియే నన్నుఁ దమ్ము దర్శించుటకు లాగుకొనివచ్చినది. తమరుచేసినప్రశంసకు నే నర్హుఁడను గాను. ఈసంగతి వీరి కెరిఁగవలెనే విశదమై యున్నది.

పృ—దూరదర్శీ ! వీరు నీకుఁ గృతపరిచయులా ?

దూ—నిన్నటిరాత్రినుండియును.

పృ—నీవు సాధువని చెప్పితివి. ఆయన కానసుచున్నాఁడే? ఆత్మస్తుతిభీతిచేతనా?

దూ—అట్లే యనుకొనుచున్నాను.

సా—ఏమయ్యా ! నేను విరాగిని గానని మీతో మనవిచేయలేదా ?

దూ—చెప్పినారు. నిజమైనవిరాగి నేను విరాగి నని యెప్పుడైనఁ జెప్పుకొనునా? మహారాజా ! నాతోఁజెప్పినమాటలఁబట్టి యీయనను గృహస్థయత్యాశ్రమమధ్యస్థునిగా గ్రహించినాను. ప్రసంగమునుబట్టియు సాత్వికవర్చస్సంపదఁబట్టియుఁ గపటకాషాయదండధారులకంటె నెన్నోమడుఁగులు హెచ్చుగాఁ, గనఁబడినాఁడు. బహుతీర్థగమనపరిపాకచిత్తుఁడు. తమవంటివారు చూచుటకును బ్రసంగించుటకును దగినవాఁడు.

పృ—సాధువర్యా ! దూరదర్శికి దయచేసినప్రసంగానంద మించుక నాకుఁగూ నీయవేఁడుకొనుచున్నాను. తమనామధేయము ?

సా—రామానందుఁడు.

పృ—తమరు దర్శించినదివ్యస్థలములలో నుత్తమమైనదానియొక్క విశేషములు కొన్ని వినఁగోరుచున్నాను.

దూ—మహాత్మా ! నాకుఁ జెప్పిన బదరీమహిమములు ప్రభువునకు మిక్కిలిరుచించు నని నే ననుకొనెదను.

శా— గీ. వృషమి గోతతి, నిది యొద్దు ♦ పొడుగు, నిద్ది
పొట్టి, యిది వెల్ల, యిది నల్ల, ♦ పుల్ల యిద్ది
యంచు భేదింతు; మైన శ్వే ♦ తాభతోడ
నొప్పుచుండును బాలన్ని ♦ యొక్కరీతి.

గీ. దేశభేదంబువలన వి ♦ స్తృతివిభేద
మునను వేఱైనఁ బుణ్యభూ ♦ ములు, పవిత్ర
తాగరిమమందు నిది పెద్ద ♦ తక్కువ యిది
యనుట కవనీశ ! నాల్కనా ♦ కాడ దయ్య !

కూ—మహాత్మా ! ఈకపిలగోవుపాలంతతియ్యగా నాయావుపా లుండవనుటమాత్ర మప్పుడప్పుడు వినుచున్నాము.

శా—రుచిభేదము జిహ్వా ననుసరించి యుండుననుట సత్యమే. మీ రింత బదరికాశ్రిమమహాత్మ్యశ్రవణకుతూహలులై యుండఁగా నే నీమాటలతోను ఆ మాటలతోను గాలక్షేపము చేయుట తగదు.

కృ-దూ—సావధానచిత్తులమై యున్నాము.

శా—విశాలబదరీ ! విశాలబదరీ ! విశాలబదరీ !

దూ—ఎవరినిఁ బిలుచుచున్నారు ?

శా—ఎవరిని బిలుచుట లేదు. బదరీసందర్శనము లేనివా రట్లు తలపోసికొనినయెడల గొప్పపుణ్యము నార్జించుకొనఁగలరని యాతీర్థమాహాత్మ్యములోఁ జెప్పఁబడియున్నది.

కృ—కూపస్థమండూకములవలె నున్న మావంటివారి కది తరణోపాయము గాని, మీ కేమిలాభము ?

శా—ఇట్టి పావనబదరి మీ కెంతదూరమున నున్నదో నాకును నంతదూరమున నే యున్నదికదా ! మహారాజా ! పుణ్యనామ మందఱకును శ్రేయస్కర మేః అవధరింపుఁడు:

కృ-దూ—విశాలబదరీ ! విశాలబదరీ !

శా— గీ. అనులమౌ హిమవత్పర్వ ♦ తములగడచి సు
దీర్ఘ బహుయోజనములవి ♦ స్తృతిని మించి

సకలపుణ్యాగతీర్థవి • శైలబదరి
చక్షురానందకరణప్ర • శస్తి వెలయు.

కృ—రామానందా ! మిక్కిలి చల్లనిప్రదేశము కాఁబోలునది ?

రా—ఔను. ఆచల్లనలో నొకవిశేషము గలదు.

గీ. దానిశైత్యము మనదేహ • తాపములనె
కాక, యంతకంటెనుబాధ • కంబులైన
కామకోపమోహాదివి • కారరూప
చిత్తతాపాళిఁ జల్లార్చుఁ • జిటికలోన.

క. ఎంతోచిత్రము ! బదరీ
ప్రాంతమునకుఁ బోవుకొలఁది • స్వాంతవసద్దు
శ్చింతలు తుపాకిధ్వనుల, శ
కుంతముల బెదరి పాఱు • గువ్వన భూపా !

సూ—అట్టి ప్రశాంతికరపవిత్రదేశమును గన్నులారఁ గాంచిన నీ వెంతటిమహాభాగుఁడవయ్యా ! రాజచంద్రమా ! ఆయాశ్రమాధిష్ఠాతలు జగత్పితలగులక్ష్మీనారాయణులు.

కృ—మార్గదర్శీ ! వినికిచేతనే చరితార్థుల మగుచున్నాము. కనిన నెంతటిధన్యుల మగుదుమో కదా ?

రా—శివకేశవులకు భేదము లేదని చాటించునట్లు అనతిదూరములో నంబాకేదారేశ్వరులుగూడ నున్నారు.

క. ఏరూపున నేపేరిట
నారాధితుఁ డౌనో దేవుఁ • డాతండ్రే, కృపా
పారీణుఁ డామె భక్తుల
నారూపునఁ బేర నంచు • నందురు ప్రాజ్ఞుల్.

సూ—నిజము, పృథ్వీవర్యా ! ఈమహానుభావుఁడు చెప్పినకొలఁది నాకు వినుటకౌత్సుక్యము హెచ్చుచున్నది.

కృ—దేవునియెదుటఁ బ్రభువెవఁడు, బానిసీఁ డెవఁడు ? అందఱు మతనిబిడ్డలము ;

కనుక దూరదర్శీ ! కేవల మిత్రభావముననే నన్ను సంబోధింపుము.

దూ—చిత్తము—వాసనాత్మయ మింతనంతలో నగునా ?—రామానందా ! బదరీ ప్రభావము లింకను వినఁగోరుచున్నాము.

రా—మీకు వినుట కెంతసంతోషముగ నున్నదో చెప్పుటకు నాకును నంతసంతోషముగా నున్నది.

గీ. పున్నెముల నన్నిటిని గూర్చి • ముద్దచేసి
పెట్టినట్టులు బదరిలో • వెలయుచుండు
వివిధకుండంబులును దీర్థ • విసరములును
బుణ్యగిరులును దాపస • భూము లెన్నొ.

పృ—అట్లు సమష్టిగా నిదివఱకే సెలవిచ్చినారు. వానిలోఁ గొన్ని వివరింపఁ బ్రార్థించుచున్నాను.

రా—మహారాజా ! పితృదేవతాప్రియ మగుబ్రహ్మకపాల మక్కడ నున్నది. పరమ పావనమైన నందాలకనందాసంగమ మచ్చటిది. మణిభద్రసరస్సు, ప్రీహికా, విరహవతీ, మహాభద్రా, గరుడగంగా, ఋషిగంగాదినదులు, మాచికుందపాండవాదితీర్థములు, నారాయణశివబ్రహ్మసూర్యదుర్గాప్రహ్లాదాదితప్తశీతలకుండములు, మేషాద్రి, గారుడశిల మొదలగుపావనగిరు లచ్చట నున్నవి.

పృ—గారుడశిల యనఁగా గారుడమణులు దొరకు చోటా ?

రా—కాదు.

గీ. సకలసచరాచరప్రపం • చములభార
మనిశమును దాల్చునట్టి మ • హాత్ము విష్ణు
మోయఁ గలశక్తి గడియింపఁ • బూర్ణభక్తిఁ
దార్క్ష్యుఁడు తపంబు చేసిన • స్థాన మద్ది.

లోకవంద్యు లగునరనారాయణులు తపస్సుచేసిన నరనారాయణాశ్రమము కూడ నాచెంతనే యున్నది.

పృ—అలాగుననా ? అంతపుణ్యభూమి గనుకనే మీవంటిమహానుభావులకు దర్శనీయమైనది.

రా—నేనన నెంతవాఁడను, రాజా !

ఆ. బదరికాశ్రమమున ♦ వ్యాసుండు శ్రీమహా
భారతంబుఁ గరుణ ♦ వ్రాసి ప్రజకు
జ్ఞానభక్త్యమృతర ♦ సనమేత మైనట్టి
విందు శాశ్వతముగఁ ♦ బెట్టినాఁడు.

గీ. శంకరుండును బదరికా ♦ శ్రమమునందు
జ్ఞానపేటిక లౌభాష్య ♦ సంతతులను
వ్రాసి యచటనె తుదకు ని ♦ ర్యాణ మందె,
నట్టియిట్టిదె బదరీమ ♦ హాత్మ్య మనఘ !

దూ — మహాత్మా ! బదరీనాథునిఁగూర్చి యింకను జెప్పలేదు.

రా — వాఙ్మనసాతీతుఁ డగు ఆతండ్రిఁగూర్చి నే నేమి చెప్పుదును? చూచితీరవలెఁ గాని చెప్పుట కలవిగాదు. విశాలబదరీ ! విశాలబదరీ !

సీ. సురఁటి గైకొని లక్ష్మి ♦ నరుఁడును నారాయ
ణుఁడు వామపార్శ్వమం ♦ దునఁ జెలంగఁ
గుడిప్రక్క ధనదుండు ♦ మృడనందనుఁడుఁ గేలు
మోడ్చినగరుఁడుండు ♦ మొనసికొలువ
ముకుళితహస్తుఁ డై ♦ మోప్రల నుద్ధవభక్త
సింహుండు సన్నమ♦స్కృతులు సలుప
నాతని కవ్వల ♦ నతిభక్తి వీణవా
యించుచు నారద ♦ ఋషి వెలుంగఁ

గీ. బైని ముత్యాలగొడుగు ప ♦ ల్వన్నె లీన
నడుమఁ దేజరిల్లుబదరీ ♦ నాథుచిత్త
రువు నిదే ! చూడుఁ డీవు భూ ♦ ధవుఁడు, మీకుఁ
గన్నులిడుమోద మిడలేవు ♦ కర్ణము లిట.

(అని యొకపటము భూపతుల కిచ్చెను.)

వృ— గీ. సకలకల్యాణగుణధామ ! ♦ సకలభూత
కరణపాలనహరణద ♦ హా ! మహాత్మ !
చిత్రిమద్భేదబహురూప ♦ సృష్టిమర్మ !
వందనశతంబు లివె ! నీకు ♦ బదరినాథ !

దూ—మాంపాహి ! బదరీనాథ ! లక్ష్మీసనాథ ! విశాలబదరీ ! విశాలబదరీ !

వృ—ఇదేమి, రామానందా ? ఈవిగ్రహ మెచ్చటిది?

రా—(ఆశ్చర్య మభినయించుచు) అహా ! మహారాజా ! అది యొక స్త్రీరూపము. పొరపాటున మొదటిదానితో వచ్చినది.

దూ—స్త్రీరూప మని యొకరు చెప్పవలెనయ్యా ?

రా—ప్రభువువారు శుకమహర్షు లని జగత్ప్రఖ్యాతి నొందినవారు గనుక నట్లు మనవిచేసితిని.

వృ—పొరపాటున వచ్చినట్లు కనఁబడదు. సజాతీయబలముననే వచ్చినది. ఈమె యే దేవాలయములోనిది ?

రా—దేవాలయములోనిది కాదు. రాజా ! ఈమె దేవతాస్త్రీ కాదు, మానవ లోకమందలిదే.

దూ—ఊర్వశి మొదలగు దేవకన్య లేదోకారణమున నీలోకమునకు వచ్చి యుందుఁ గొంతకాలము గడపి తిరుగఁ దమలోకమునకుఁ బోయినట్లు వినుచున్నాము గాదా ?

వృ—చక్కఁగాఁ గనిపట్టినావు. నాకు నట్లే స్ఫురించినది. నీవు నిజముగా దూరదర్శివే.

రా—కనుకనే సమీపవస్తువులను సరిగాఁ గనిపట్ట లేకున్నాఁడను.

గీ. సత్యమును వీడి నీతోన ♦ సత్యమాడ
నేమిలాభంబు గల్గు నా ♦ కిచట ? అప్ప
హాల్ప కీ విట్లుగనుచుండు ♦ వనితప్రతిమ,
కా దమరసుందరిది ! కాదు ! ♦ కాదు ! కాదు !

దూ—సాధువు చెప్పినమాట యెన్నఁటికి నవిశ్వసనీయము కాదు మహారాజా !

వృ—మఱి మహారాజా యందు వేమి ?

దూ—వెనుకటియాజ్ఞ పూర్తదేవాలయప్రసంగములలో వర్తించును గాని, యిప్పుడు కూడనా ?

పృ—ఇప్పుడుమాత్రము కాకేమి ?

ఉ. ఈలలితాంగి దేవతల ♦ కీ డగు ; నీ డన నేల ? దేవతా
బాలలయం దొక ; ర్తునికి ♦ పట్టొక యల్పకుటీకమైన, దే
వాలయసుప్రశస్తిఁ బడ ♦ యం దగు ; నీసుకుమారతామహా
శ్రీలకు మానవాంగనశ ♦ రీరము దావల మౌనె మిత్రమా ?

రా—మహారాజా ! మీచిత్తమే ప్రమాణ మైనయెడల దేవత యన నేల దేవతాతీతయనియే సెలవీయవచ్చును.

గీ. దేవతలు ఱెప్పలార్ప ; రం ♦ తియ విశేష ;
మీకుసుమగాత్రి మీకును ♦ నిచ్చుచున్న
దనిమిషత యిప్డు, డందుచే ♦ నధిప, కాంత
యమరతరుణుల దాఁటిన ♦ దనఁగ రాదె ?

పృ—అనినను దప్పులేదు.

దూ—(స్వ) ఈతనిధైర్యము సన్నగిల్లు చున్నట్లున్నది. ‘ అధిపకాంత ’ యను నది యుపశ్రుతివలె నున్నది.

పృ—దేవతాప్రతిమ గాదనుచుంటివి. మర్త్యకాంతలచిత్తరువులు నీయొద్ద నేల యుండవలసివచ్చెను ?

రా—నేనును మర్త్యుఁడనే కనుక. వీఁడు సర్వసంగపరిత్యాగి యని యనుకొన్నచో నది మీలోపము గాని నాలోపము గాదు. ఆసంగతి యిదివఱకే మనవిచేసికొన్నాను.

దూ—రామానందా ! ఈరామప్రతిమ నీ కెట్లు లభించినది ?

పృ—(స్వ) సెబాసు ! దూరదర్శీ ! నే నడుగఁదలఁచుకొన్నప్రశ్న నీవేయడిగితివి.

రా—ఆమె నాకుఁ గొన్నాళ్లు శిష్యురాలు.

పృ—నీవిద్యార్థినియే ? ఈప్రతిమామూలము నరలోకములోనిదే ? ప్రస్తుతకాలములోనిదే ? వేశాకోళము కాదుగద ?

దూ—ప్రభువర్యా ! అట్లు ప్రశ్నింతురేమి ? లేమరు కొంచెమునే పూరకుంచుఁడు.

రామానందా! ఆమె నీయొద్ద నేయేవిద్యలు నేర్చినది?

రా—ఇట్లు గ్రుచ్చిగ్రుచ్చి యడుగుటలో మీయభిప్రాయ మే మైనను, మీపశ్నో కుత్తర మీయకుండుట యుక్తము కాదు గనుక నిచ్చుచున్నాను.

గీ. శాస్త్రములకుఁ దగు పెక్కుశా ♦ స్త్రములు వేద
శిఖలతో భాష్యములతోడ ♦ శిల్పగాన
కళలతోడను నాయొద్దఁ ♦ గన్యనేర్చెఁ
బృథ్విఁ దియ్యనీళ్ళకుఁ జేప ♦ యెక్కినట్లు.

పృ—సర్వవిద్యాసంయుత మైనసౌందర్యము సౌరభ్యసమేత మైనశాతకుంభము కదా! రామానందా! ఆమె నీశిష్యురాలుగా నున్నప్పుడే కన్యయా యిప్పుడుఁగూడనా?

రా—ఇప్పుడును గన్యగనే యున్నది. అనఁగా నేనాముక్తిపురమును వదలి వచ్చినప్పుడు.

దూ—ఈచిత్తరు వెవరు వ్రాసినారు?

పృ—మీ రాపట్టనము వదలి యెన్నాళ్ళయినది?

రా—ఉభయుల కొక్కసారి ప్రత్యుత్తర మిచ్చుట సాధ్యము గాదు కనుకఁ దార తమ్యము ననుసరించి మనవిచేసెదను. నాలుగునెలలు. ఆమె సహపాఠిని యైన మంత్రికోమరిత.

పృ—ఏమిశిల్పకళానైపుణ్యము! కేవలనైపుణ్యమా, యథార్థరూపసందర్శనమా?

రా—రెండిటి కర్థ మొక్కటేయని నాయభిప్రాయము. యథార్థరూపదర్శనా శక్తి కౌశల్యహీనతాసూచకము గాదా?

పృ—శిల్పిని యామెసహపాఠిని యగుమంత్రికూఁతురా, సహపాఠిని యగునామె మంత్రికూఁతురా?

దూ—చిత్రాధార మైనకన్య రాజకన్యయే కదా యని యడుగుచున్నారు.

రా—తెలిసినది. మంత్రికూఁతురు వచ్చి చదువుటకుఁ దగినయామె రాజకన్య గాక మ రెవ్వరుందురు?

పృ—గోత్రనామములు?

రా—నామము రూపలత. పుట్టినింటిగోత్రము భారద్వాజసగోత్రము.

పృ—ఆమె యవివాహిత యని చెప్పితిరి కాదా?

రా—నాలుగుమాసములకుఁ బూర్వ మని విన్నవించితిని.

పృ—అయ్యో!

దూ—(స్వ) ఈతనిగాంభీర్య మంతయు సడలుచున్నది. ఇఁక నూరకున్న నవశతావాక్యములు బయలుదేఱును. (ప్ర) సాధువర్యా! మిమ్ముఁ బ్రశ్నలతోఁ జాల శ్రమపెట్టితిమి. క్షమియింపుఁడు.

రా—(స్వ) ఈనమ్రవాక్యము లేఁక నడువుఁడని చెప్పుమృదువాక్యములు. సుమంత్రా! నీకోరిక సిద్ధించినది. రూపలతారూపమా! నీవు బాగుగాఁ బని చేసితివి. రాజునకు వెఱ్ఱి చక్కఁగా నెక్కించితివి. బదరీనారాయణపటమా! మాకు రాజునకుఁ గూడ సద్యఃఫలదాయక మైతివి.

గీ. కేవలాత్మసుఖార్థదృ ♦ ష్టి యతి ముక్కు
మూసికొని గుహ నుండు స ♦ న్యాసికంటెఁ
బృథులలోకోపకారపరి ♦ వృత్తి మనసు
తోడఁ దిరిగెడునావంటి ♦ వాఁడె ఘనుఁడు.

(ప్ర) రాజచంద్రమా! దూరదర్శీ! అనుష్ఠానసమయము సమీపించుచున్నది. నేను సెలవుదీసికొనెదను.

పృ—నమస్కారము! నే నీరూపలతావిగ్రహము నుంచుకొనవచ్చునా?

రా—(స్వ) అటు కాదు. భగవత్కృపచే నామె నుద్వాహ మాడవచ్చును. (ప్ర) కల్యాణమస్తు. బదరీనాథప్రతిమఁ బట్టుకొని వెళ్లుమని సెలవా?

దూ—అయ్యయ్యో! రెండును దయచేయుఁ డనియే ప్రభువువారియభిప్రాయము. రెండును గలిపి యొకటిగా మొదటఁ జేతఁ బెట్టినారు కనుక నొకటియడి? రెండవది కూడ నడిగినట్లే తలఁపవలయును. నమస్కారము.

రా—కల్యాణమస్తు. (నిష్క్రమించును.)

దూ—మిత్రుఁడా! ఏమి యింత బేల వై మాటలాడితివి? నీబ్రహ్మచర్యవ్రత మే మయినది? నాది యేమైనది? అయ్యయ్యో! ఒక్కబొమ్మ చూచినంతనే యెట్టివాఁడ వెట్టివాఁడ వై పోయితివి!

పృ—ఏమి చేయుమనెదవు! నాచిత్తస్వాస్థ్య మంతయుఁ బోయినది. నీతండ్రిగారు నావ్రతభంగము చేసినారు. దానితో నీవ్రతోద్యాపనమును జరిగినదనుకొనవలెను. నేఁడు నేను లేచినవేళ యట్టిది. మంచిదందునా? చెడ్డదందునా?

ఏమియుఁ దోఁపకున్నది.

చ. వలవలమేడ్వనా వ్రతము ♦ వమ్మయి పోయె నటంచుఁ? ప్రీతితోఁ
గలకలనవ్వనా బదరి ♦ కాపతిఁ గాంచితి నంచుఁ? గన్యకా
తిలకము చిత్రము న్గనుము ♦ దీనిఁ జనియించు వ్యథాత్మకంబులౌ
వలపులు మున్గనా సఖి! యిత్తు ♦ పానునఁ జిక్కినయోడ కైవడిన్?

దూ—సఖీ! ఇంతయాందోళ మేల? నీ ప్రస్తుతావస్థకుఁ దగినప్రయత్నమే చేయవచ్చును. ఇది నాకున్నుగూడ లాభమే! పిత్రవిధేయుఁ డనుపేరు పోయి సత్పుత్రుఁడను పేరు వచ్చును. మీయొద్దనుండి పోవుచుండఁగా మాతండ్రిగారి మొగము చూచితిని. పూర్వమున్న చిటుకుఁజూపులు లేవు. ముఖఫలకము ముడుతలువిప్పి పఱచినవస్త్రమువలెఁ బ్రసన్నమై యున్నది. దానికిఁ గారణ మిప్పుడు తెలిసినది.

రూ— గీ. ముసలివాఁ డెంతపనిఁ జేసి ♦ పోయెఁగాఁడు
బదరికానాథుఁ డైన నా ♦ పాలివాఁడు
గాక, నా కెంతవలవంతఁ ♦ గలుగఁజేసె,
నోయి! యేమని చెప్పుదు ♦ నాయవస్థ.

దూ—మీమాటలు కడువిచిత్రములుగ నున్నవి. బాధ గలిగించినప్రతిమ బాగుగనే యున్నది. పరమచంచలమై పారదప్రాయ మైనమీమనస్సును సమీచీనముగనే యున్నది. తిట్టుదినువారు మూలనున్న ముసలివాఁడును బదరిలో నున్న పరమాత్ముఁడునా? ఏమియు నాదావస్థ తటస్థించినది?

రూ—నాప్రస్తుతస్థితికిని మీతండ్రికిని సంబంధమే లేదందువా?

దూ—లే దనను. ఆసాధువును మాతండ్రియును గలిసియే యీపనిఁ గావించినా రని నాదృఢనిశ్చయము.

రూ—అంతనిశ్చయమునకుఁ దగినహేతు వేమున్నది.

దూ— గీ. ఒకరిపై నొకరుంచిన ♦ యోరచూపు
లరసి యనుమాన మందితి ♦ నయ్యయప్పుడె;
భావములపెట్టె యైనట్టి ♦ స్వాంత మిట్టి
దృష్టితాళపుఁ జెవిఁబెట్టి ♦ తెఱవవచ్చు.

ఆయనుమానము మీమాటలతో స్థిరపడినది.

పృ—న న్నిట్టిబాధ పెట్టుటకు నేను వారికిఁ జేసినయపకారమేమి ?

దూ—బాధపెట్టుటకుఁ గాదు, సుఖపెట్టుటకే చేయుచున్నా రనుకొనుఁడు. ఉభయులుఁగూడ నుత్తమ[illegible] [illegible] లోపలికిఁబోయి యించుక విశ్రాంతి గొనుఁడు. నేనును [illegible].

పృ—'విశ్రాంతి' పూర్వకముగనే మీతండ్రి యీచిత్రవధనుబ్రారంభించినాఁడు.

దూ—వధను గాదు, కథను—ముక్తిమార్గము వదలి ముక్తిపురమార్గముఁ బట్టవలసి వచ్చినది.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)



శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# రూపలత

(మూడవ కూర్పు)

## ద్వితీయాంకము.

ప్రదేశము—కర్పూరద్వీపములోని ముక్తిపురము, రాజభవనము.

ప్రవేశము—రూపధరుఁడు, మతిమంతుఁడు.

రూ— ఆ. నాకు నేఁబదేండ్లు ♦ నీకు నేఁబదియేండ్లు
నాకొకర్తె పుత్రి ♦ నీకు నొకతె
యామె కెంతచదువొ ♦ యీమెకు నంతియ
మంత్రి! బ్రహ్మ యెట్లు ♦ మనలఁ గూర్చె?

మ—అన్నిటిలోను సమానుల మెట్లగుదుము మహారాజా!

గీ. మీరు మూర్ధాభిషిక్తు లే ♦ మీకడ నొక
మంత్రిమాత్రుండ, సంసార ♦ తంత్రమునకు
నచటఁ దోడున్న డిచ్చట ♦ నదియు సున్న,
యట్టిచో మీకు నాకు సా ♦ మ్య మెటు లగును?

రూ—అయ్యో! మతిమంతా! కళత్రవియోగమున కంతగా దుఃఖింపకుము. ఈఁ:
హేమలత యేమిచేయుచున్నది?

చ. నిలువున లేఁతపచ్చికను ♦ నిండినభూమిని నూర్ధ్వవక్త్రయై
కొలుకుల నీళ్ళుగార్చు, చతి ♦ కుంఠితచిత్తత నుండుధేనువ
ట్లలమరుచున్న హేమలత ♦ నారసి, నీవనితాలలామ యీ
యలమట లేనిధన్య యని ♦ యాత్మను సంతస మందఁగూడదే!

మతిమంతా! అట్టివంతకుఁ గారణము నీవే యెఱుఁగుదువు కాదా?

మ—నిత్యము. ఉభయులదుఃఖము నామీఁదనే పడి దుర్భర మాచున్నదని విచా
రించుచున్నాను.

రూ — అయ్యయ్యో! యీదుఃఖస్వభావ మట్టిది కాదని స్వానుభవమునఁ జెప్పఁ గలను. అది యక్షయతూణీరమువలె నెందఱు పంచుకొని భరించుచున్నను దఱుఁగున ట్లగపడదు.

మ — కవలసంకటమువలె నిద్దఱకు నొకబుద్ధియే పుట్టవలెనా?

రూ — అట్లుగాక మ రెట్లగును?

ఆ. చదువుచదువు లొకటి ♦ చరితంబు లొక్కటి,
దుస్తు లొకటి, తొడుగు ♦ తొడవు లొకటి,
యునికి యొకటి, పడిన ♦ యుపదేశ మొక్కటి,
మనసుమాత్ర మెట్లు ♦ మాఱుపడును?

వయసు దాఁటినబ్రాహ్మణుఁడు, సచ్ఛీలుఁడు, సమస్తశాస్త్రపారంగతుఁ డని రామానందుని గురువుగా నేర్పఱచినందులకు నీకును నాకును గూడఁ దగిన శాస్తి చేసినాఁడు.

మ — అయ్యయ్యో! ఆయనను నిందింతురేల? మనప్రారబ్ధమున కాయనకర్తయా? ఆయనవంటిపుణ్యాత్ముఁడును, విద్వాంసుఁడును, లోకజ్ఞానసంపన్నుఁడును మఱియొకఁడు లేఁడని ప్రజ లేకగ్రీవముగఁ జెప్పుదురే! అదియుఁగాక మన దుఃఖము, శక్తివంచన లేకుండ, నివారింతు నని చెప్పియే వెళ్లెనుగాదా?

రూ — ఇం కేమినివారణము? పోయి యాఱుమాసము లైనది. వచ్చుజాడ యొక్కడను లేదు.

మ — తొందరపడిన లాభ మేమి?

రూ — తొందర యందువా మతిమంతా? కొడుకులేఁడు. పుట్టకపుట్టక యొక్క కూఁతురుపుట్టెను. దానినే తనయునిగా భావించుకొని యల్లారుముద్దుగాఁ బెంచుకొని తగినవరునికిచ్చి పెండ్లిచేసి రాజ్యభార మల్లునిమీఁదను గూఁతుమీఁదను నైచి రామా! కృష్ణా! యనుకొనుచు శేషకాలముఁ గడప నువ్విళ్లూరుచున్న మాకు — తలిదండ్రులకు — రూపలత యెట్టిచిక్కులు తెచ్చిపెట్టుచున్నది? రామానందుఁ డెంతకొయ్యమనను చేసినాఁడు! నీమన సెట్లున్నదో తెలియదు.

మ — 'కొడుకు లేఁడు' మొదలుకొని 'కొయ్యమనను చేసినాఁడు' వఱకు నామనఃకుడ్యము మీమాటలకుఁ బ్రతిధ్వానము చేయుచున్నది, కాని యక్కడక్కడఁ గొన్నిమార్పులుమాత్ర మున్నవి.

రూ — అవియేవి?

మ—మీకు రూపలత—నాకుఁ గాత్యాయని, మీకు రాజ్యభారము—నాకు గృహభారము, మీరు రామానందుఁ డన్నారు—నేను బ్రహ్మ యనుచున్నాను. (నిట్టూర్పుతో) మీకు మాకు-తలిదండ్రులకు-అంటిరి. నేను అభాగ్యుఁడైనతండ్రికి—అనెదను. రామానందుని నెపపెట్టుట న్యాయము గాదు.

రూ—అన్నిశాస్త్రములు నేర్పి సరస్వతీవిగ్రహములఁ జేసినవాఁడు మతులుమాత్రము త్రిప్పలేకపోయినాఁడా ?

మ—మహారాజా !

ఆ. గురువు క్రొత్తశక్తిఁ ♦ గూర్పఁగలేఁ డెప్డు ;
డున్న గుణవితతికె ♦ వన్నె వెట్టు
విద్య మెఱుఁగుటేసుక ♦ విధమునఁ బనిసేయు ;
సహజగుణము మార్పఁ ♦ జాల దయ్య.

ఆ. ఉంచుదీప మొక్క ♦ యోజదీపమె యైన,
నుంచువాఁడుగూడ ♦ నొక్కఁడైన,
గాజురంగుఁబట్టి ♦ కాంతి విజృంభించు,
నిలను విద్యతీరు ♦ నీవిధంబె !

రూ—బీజమునుబట్టి మొక్కయుండును గాని, క్షేత్రమునుబట్టి యుండునా ?

మ—ఫలప్రాశస్త్యముమాత్రము క్షేత్రమునుబట్టియే యుండును.

రూ—నీకూఁతునకునాకూఁతునకుఁగూడవిద్యాపరిణతియొక్క రీతిగనేయుండవలెనా!

మ—ఇద్దఱమనస్సులు నొక్కరంగుగాజుకుప్పెలే యైనవి కాఁబోలు. పాపము! రామానందుఁ డేమిచేయును ?

రూ—మంత్రీ ! కావ్యాలంకారములు నేర్పినాఁడు సరే ! నీతిశాస్త్రము సరే, ప్రకృతిశాస్త్రములును సరే, శిల్పసంగీతభరతశాస్త్రములును సరే —కాని—

సీ. పెండ్లాడుకొని కని ♦ పెంచుకన్నియలకు
సన్యాసివేదాంత ♦ శాస్త్రమేల ?
చెప్పుచేఁతల నుండు ♦ చిఱుతపాపలకు ము
ష్కరపుఁగర్కశతర్క ♦ శాస్త్రమేల ?

శుద్ధాంతముల మెట్టు ♦ సురుచిరాంగులకు భీ
కరతురగారోహ ♦ కర్మమేల ?
పూబంతు లాడెడు ♦ పూఁబోండ్లకుఁ దుటారి
విల్లమ్ములుఁ గటార్లు ♦ విసరు టేల ?
గీ. యక్కటకట ! రామానందుఁ ♦ డాఁడువాంధ్ర
పోఁడి యంతయుఁ బోకార్చి ♦ పుత్రికలకుఁ
బృథ్విఁ బురుషార్హములెయైన ♦ యేవ లెట్లు
తెచ్చి, తా, మనకొంపలు ♦ దీసినాఁడు !

మ—ఇన్ని యేవలు నున్న పురుషులకుమాత్ర మట్టిపన స్థైర్య ముదయించెనా? వెనుక సమస్త విద్యలు నేర్పు మనిచెప్పి మీరిప్పుడు దూఱుట కర్తవ్యము గాదు.

రూ—సమస్త విద్యలనఁగా సమంజసము లైన వన్నమాట.

మ—ప్రతిదినమును స్వల్పకాలమేకద రూపలత రామానందుని శిక్షలో నుండుట. శేషకాలమంతయు మీయొద్దనే కడపుచుండును. అశనశయనాసనవిహారములయం దొక్కయెడనే యామెతో నుండుతల్లియుఁ దండ్రియుఁ గూఁతు మన సేల త్రిప్పఁగూడదు ?

రూ—కూడ కేమి ? త్రిప్ప లేకున్నాము.

శా. ఏండ్ల జిన్నది యైన, హేమలతయో, ♦ యేనో, యెదో సందునన్
బెండ్లింగూర్చి వచింప, రూపలత దు♦ర్భేదంబులౌ యుక్తులన్
ముండ్లం బాన్పుగఁ జేసికొంచుఁ, జెలి యే♦ పోల్కి న్సుఖంబందునో
పెండ్లామె సుఖయించునట్లె యని కా♦వించు న్నృసంగంబులన్.

ఆ. పెండ్లి చేసికొనుట ♦ విధి గాదటంచును
బెండ్లి చేసికొనెడు ♦ వెఱ్ఱి వెలఁది
తనువు మనము నొకని ♦ ధన మౌను, స్వేచ్ఛ న
శించు నంచుఁ బలుకు ♦ సిగ్గు ! సిగ్గు !

ఏమి చెప్పుదును, మతిమంతా ? ఏమియుఁ దోఁపదు.

మ— గీ. మీదురక్తము, మీమేను ♦ మీదుమనసు
నైన దుహితను దిద్ద లే ♦ రైతి; రింక
నది యిదియుఁ గలిపి యవిధే♦యతను దెచ్చె
దేశిపుం డని యతని నిం ♦ దించు టేల?

రూ—శరీరము మాదేకాని మనసు మాది కాదు.

మ—రామానందుని దంతకంటెఁ గాదు.

రూ—దుఃఖోద్రేకముచే మాట లిట్లు వచ్చుచున్నవి. నీవు చెప్పినట్లు రామానందు నిలోప మేమియు లేకపోవచ్చును. జీతము పుచ్చుకొనఁడు. బత్తె మైనను బ్రాణత్రాణమాత్రమునకైన యల్పాహారము. తఱచు క్షీరముతోను ఫలములతోనె క్షున్నివారణము చేసికొనును. అట్టివాఁడు నాకుఁ గీడు తలఁచు నని తలఁచుట దోషమే.

మ—హేమలతాదేవిగారి కన్నీళ్లైన నామె హృదయముఁ గరఁగింపవా?

రూ—ఏమి కరఁగించుట? తల్లిదుఃఖము మొన్న నెక్కువకాఁగా, నేకళ నున్నది కాని "అమ్మా! నాకుఁ దగినవరుఁడు లభించినప్పుడు నేను వల దనినఁ గదా నీవు దుఃఖపడవలసినది. అందాఁక నీవు శాంతిల్లు" మని యన్నది. అంతమాత్రమునకే యాయమాయకురాలు కొంతంత సంతోషము నొందినది.

మ—సంతోషమునకుఁ దగినకారణ మున్నది. అదినాకును సంతోషకారణమే.

క. ఏకరణిఁ బరిణయంబున
మీకన్నియ చనునొ దాని ♦ మీయలక వశిఁ దా
నాకరణిం జేయుదు నని
మాకాత్యాయనియు నాకు ♦ మాటయొసంగెన్.

మీరు సంపాదించినరాజయువకులపటములఁ జూపించుటకిదియేమంచిసమయము.

రూ—అయ్యో! వెఱ్ఱిమతిమంతా! కనఁబఱుచుటయునైనది! కట్టగట్టి మూలఁ బెట్టుటయు నైనది.

గీ. అంగరాజున కక్షిద్వ ♦ యంబు చిన్న,
వంగదేశాధిపతి పండ్లు ♦ పాలపండ్లు,
వలుఁదకాయంబు పాంచాల ♦ పతికిఁ, బొట్ట
పొడవులు కళింగసింహభూ ♦ విభుల కకట!

రూ— బాలిక మెచ్చుటను గనలేదు, వినలేదు.

మ—ఆమె యిట్లు వచ్చుచున్నట్లున్నది.

(రూ-ల ప్రవేశించును.)

రూ-ల—నాయనగారూ! నమస్కారము, మంత్రిశేఖరా! నమస్కారము. కాత్యాయని యింకను రాలేదేమి?

రూ—తల్లీ! కూరుచుండుము. (అట్లుచేయును.)

మ—అమ్మా! నానీడ యేదియని యడిగిన నే నేమి చెప్పుదును?

రూ-ల—తండ్రిచాయపిల్ల యాతనినీడయే యగును.

మ—ఆకారములోఁ గాదు. అనుసరణములో.

రూ-ల—నాకుఁ గాత్యాయని లేనిగడియ కల్పముగాఁ గనఁబడునుగాన నట్లడిగితిని. కోపపడకుఁడు.

రూ—తల్లీ! నీవిచటి కేల వచ్చితివి?

రూ-ల—అమ్మగారు పంపినారు. మీ కేదో యుత్తరము వచ్చినదఁట, అదియేదో కనుఁగొని రమ్మన్నారు.

రూ—మనకుటుంబములోనివాని యట్టివాఁడే యైనమతిమంతుఁడు దక్క మఱియొకరు లేరు. కనుక నిక్కడకే రమ్మని చెప్పి తీసికొనిరా.

(రూ-ల లోనికి వెళ్లును.)

మ—రాజేంద్రా! అదియేదో రహస్యమైనయెడల నేను సెలవు దీసికొందును.

రూ—రహస్యమైనయెడల దేవిని నీ వుండఁగానే, రమ్మని వార్త యెట్లుపంపుదును? అది నీకుఁగూడఁ గొంతవఱకు సంబంధించినదే. పాపము! హేమలతకుఁ బగలు రాత్రియుఁ గూడ నొకటేకలవరింత.

(హేమలతారూపలతలు ప్రవేశింతురు.)

రూ—దేవీ! నీ వట్లు కుంది కృశించుట తగదు. ధైర్యముఁ దెచ్చుకొనవలెను.

హే—నాథా! చెప్పుట సులభము గాని చేయుట కష్టము. కానిచో నేఁబదేండ్లె వారెనుబదేండ్లవారుగా నెట్లు చూపట్టుదురు?

మ—అమ్మా! నన్నుండుమని సెలవైన నే యుండెదను.

హే—ఉండుట కేమియు నభ్యంతరము లేదు. మనమందఱ మేకచింతాగ్రస్తులమే కద. అన్యోన్యాశ్వాసములచేఁ గష్టములు సహనీయము లగును.

రూ-ల—(స్వ)సుఖస్థితిలోఁ బడు[illegible]కష్టములు నిజమైనకష్టములకంటె నెక్కుఁడు బాధకరములు.

హే—నాథా ! ఈరోజున వచ్చినలేఖ యెవరియొద్దనుండి వచ్చినది ? ఏవిషయమై వచ్చినది ?

రూ—రూపలతకుఁ గోపము రాకుండినఁ జెప్పెదను.

రూ-ల—నాయనగారూ ! నడుమ నాకెందులకుఁ గోపము ? పుత్రిక కోపపడు నని తండ్రిగారనుచో నది యాయన కోపమునే సూచించును.

భూ—అమ్మా ! నీతో వాదమునకు దిగి పరాజితుఁడనగుట కిదియే తొలిసారి గాదు. సంతతిపలని పరాజయము జనకులకు దిగ్విజయము. కాని రూపలతా !

గీ. నేను మీతల్లి ని న్వ్రిత ♦ నియమములను
గష్టపడి కన్నదంతయుఁ ♦ గడుగట్టి
కోపమును జూపి సహజ మౌ ♦ కూర్మివీడి
యడుమలను బెట్టుటకె యని ♦ యెంతువమ్మ ?

గీ. కడుసడలి యున్న మీయమ్మ ♦ కంకణములుఁ
బ్రిదిలి వ్రేలాడు నీ పెద్ద ♦ వదులుటంగి
యడుకునీనాల్గుకన్నీళ్ళ ♦ యుప్పుటేళ్ళు
నాదఁ దెల్పును గోపంబుఁ ♦ గాదు తల్లి !

హే—అమ్మా ! మీనాయనగారు చెప్పుమాట వాస్తవము. ఇదిగో యిప్పుడు క్రొత్తగా నుబుకుచు నిన్ను బాగుగాఁ జూడనీకుండు నాబాష్పపూరములు దానికి బలవత్తరసాక్షులు.

భూ—అమ్మా ! కోపచిహ్నము లురుము మెఱుఁగులవలె భయంకరములై యుండును. దానికివి దుఃఖచిహ్నములకు నెంతో భేదమున్నది.

రూ-ల—కాలభేదమువూత్రము. ఉరుము మెఱపులు వర్షములోఁ బరిసమాప్తినొందుట యందఱకుఁ బ్రత్యక్షమే! అమ్మా! మీ కింతదుఃఖము తెచ్చిపెట్టినదియెవరు?

హే—ఎవరా ? నీవే, రూపలతా ! నీపుట్టుకయే యింతమట్టునకుఁ దెచ్చినది.

రూ-ల—నీపుట్టినింటనే నీవుండి, మా నాయనగారింటనుండిన నాజన్మ మెట్లు సాధ్యమగును ?

మ—అప్పుడు మీనాయనగా రెట్లగుదురు ?

రూ-ల—అసాధ్య మన నదే యర్థము.

రూ—ఔను. మా వివాహమే నీజన్మమునకుఁ గారణము. అయిన నేమి ?

రూ-ల—కనుక నదే యిప్పటిమీదుఃఖమునకును గారణము.

రూ—ఇట్టి శిలాహృదయము నీలోనే కాని మఱియెక్కడను లేదు.

హే—తల్లీ ! రూపలతా ! భగవంతుఁడు నాపాలివాఁడై నిన్నుఁ బెండ్లాడించి, నీ కొక నీవంటిపుత్రికారత్నమునే ప్రసాదించి యింతదుఃఖమును గలిగించిన యెడల నాకసి దీఱునమ్మా !

రూ-ల—మతిమంతా ! యిది కోపమా? దుఃఖమా? నీయుఱుము మెఱుములకును దీనికిని దారతమ్య మేమి ? ఉఱుము మెఱపులతరువాత వానయు, వానతరువాత నవియును. క్రోధసంతాపము లన్నదమ్ములు. ఎవఁ డన్నయో యెవఁడు తమ్ముఁడో మాత్రము చెప్పలేము.

మ—వృద్ధతర్కము బాలతర్కమున కాఁగదు. (స్వ) విగతకళత్రుఁడనైతినని వెత్త విచార మేల? జీవించియున్నా నా మెకునుమా కాత్యాయనివలననీ పాళ్లేవచ్చును.

హే—ప్రాణనాథా ! ఈలేనిపోనిచర్చలతోఁ బ్రయోజనము లేదు. జాబునుగూర్చి సెలవిండు. ప్రస్తుతాంశ మది.

రూ—ఇదిగో జాబు ; మనపొరుగుననే యుండుపౌండ్రకునియొద్దనుండి వచ్చినది.

రూ-ల—పాణిగ్రహణమహోత్సవమునకు ద్వితీయప్రియత్నము కాఁబోలు.

రూ—కొనసాగినను సాగకున్నను ఇరుగుపొరుగువా రుత్తరములువ్రాయుట కభ్యంతర మేమి ?

రూ-ల—“ ఇరుగుపొరుగుపో ర దింతంతగాదయా
విశ్వదాభిరామ వినురవేమ. ”

మ—అమ్మా ! పొరపాటుగాఁ జదివినావు.
“ ఇంటిలోనిపో రదింతంతగాదయా
విశ్వదాభిరామ వినుర వేమ. ”

హే—రూపలతా ! పౌండ్రకుఁడు వెనుకఁ దనప్రతిమ యొకయుత్తరముతోఁ బంపినాఁడు. దానికిఁ బ్రత్యుత్తరము లేదని మఱల వ్రాసినాఁడు కాఁబోలు. పోనిమ్ము.

మ—ఆప్రతిమ, రూపలత, చూచినదా ?

రూ—చూచినది. ఫలమేమి ?

మ—ఏమన్నది ?

హే—తనఁగూడనిమాటయే యన్నది.

రూ—ఆఖ్యాయిక యెంతశ్రావ్యముగ నున్నదో యాకార మంతమనోజ్ఞముగా నున్నది. ఈవనము న్నఘునివిపులాలింగనములకు విపినమహిషి తగును గాని వేఱొకరు తగరు. అని—

మ—అహో ! యెంతమాట యంటివి వత్సా !

రూ-ల—మతిమంతా! సత్యవాక్యములుతఱచుగాఁ జెవులకువెగటుగానేయుండును.

మ—మహారాజా ! మీ రప్పుడేమి చేసితిరి ?

రూ—నీవు నాస్థితిలో నున్న నేమి చేయుదువో యదే చేసితిని. మూఁకత్వము వహించి ప్రత్యుత్తరము వ్రాయకుంటిని.

హే—ఇప్పటియుత్తర మేదియో వినఁ గోరుచున్నాను.

రూ—(చదువును) మహారాజశ్రీ కర్పూరద్వీపాధిపతు లగురూపధర మహారాజుగారికి భిల్లదేశాధీశుఁ డగుపౌండ్రికమహారా జనేకనమస్కారములు.

రూ-ల—(స్వ) ఇప్పటికిఁ బ్రవరాభివాదనము లైనవి.

రూ—(చదువును) నేను దమకు నాచిత్రఫలకముతో నొకయుత్తరమువ్రాసి పంపుకొని చాలఁగాలము కావచ్చినది. ప్రత్యుత్తరము దయచేయకపోవుటకుఁ గారణము తెలియదు.

రూ-ల—(స్వ) కాలము కావచ్చినవానికిఁ బ్రత్యుత్తరము వ్రాసిన ఫలము లేదు.

రూ—(చదువును.)

గీ. భిల్లదేశము లోఁజిక్కెఁ దేఁడు ♦ ద్వీపమునకు
నీవు గాదని యనఁజాలు ♦ వాఁడు లేఁడు;
పౌండ్రకుని శౌర్యధైర్యము ♦ ల్బాహుబలము
నెఱుఁగనియతండు చండాంశు ♦ నెఱుఁగనతఁడె.

రూ-ల—చిన్నద్వీపమే చేయెత్తు వృషభమును జీల్చుచున్నది.

హే—వివాహవిషయములో వివాదవాక్యములు వ్రాయుచున్నాఁడేమి ?

మ—మహారాజా! యిట్టిమూర్ఖుని నిరాకరించుటలో రూపలత తప్పేమియు లేదు.

రూ-ల—(స్వ) ఇక్కనే నాచర్యలన్నియు గ్రహింతురుగాక !

హే—నాథా! అట్టివాక్యము చదువుకొనియు నింతనే యూరకుంటి రేల? ఇంత శాంతమనస్కులై యున్నారేల?

మ—దేవిగారూ! ప్రభువుగారు కార్యశూరులు గాని వాక్శూరులు గారు.

రూ—ప్రాణేశ్వరీ! ముసలివాఁడనైనను వేయిపౌండ్రకకీటకములకు లక్ష్యపెట్టువాఁడను గాను. కాని, మతిమంతుఁడన్నట్లు, లింటిపోరే గెలువ లేకున్నాను. అన్యథా చలింపనిమనసు దుఃఖముచే మాత్రము తాలు మాఱుచున్నది.

రూ-ల—ఏమి నాయనగారు! ఈయపాత్రీకృతవిగ్రహుఁడగు పౌండ్రికు చెట్టఁబట్టి మీపైఁ గత్తి గట్టుమని సెలవా?

రూ—తండ్రితో నిష్ఠురవాక్యము లేలమ్మా. అనేక భూపతులచిత్రము లున్నవి. వారిలో నొకరి వరింపఁగూడదమ్మా?

రూ-ల—నాయనా! వరణ మవ్యాజప్రేమపూర్వకమై యుండవలెనని కాదా పెద్దలు చెప్పుదురు.

హే—పౌండ్రక సందేశముయొక్క శేషభాగముగూడఁ వినిపింపుఁడు.

రూ—(చదువును)

గీ. పొరుగురాజుల కెప్పుడుఁ ♦ బోరు తగదు;
మీరు, మాతండ్రి, బావల ♦ తీరుగానె
తొల్లియుంటి, రిప్పుడును మా ♦ తులసమాను
లుగనె యుండి సఖ్యమాచుట ♦ తగును మీకు.

ఆ. వేయి వ్రాయ నేల? ♦ సోయగ మపురూప
ముగను గల్గునట్టి ♦ ముద్దుగుమ్మ
శూరనృపవతంసు ♦ సొమ్మని నమ్మి, మీ
రూపలతకు నాదు ♦ ప్రాపు నిమ్ము!

విధేయుఁడు,
పౌండ్రకమహారాజు,
పుండ్రపురము.

హే—ఏమిబీరములు ? ఏమి బెదరింపులు ?
రూ-ల—మాతులకన్యాపరిగ్రహ మొకమహర్షివంశమువారికి మహాదోషమే ?
రూ—అధర్మచర్యాపరాయణులపట్టున ధర్మశాస్త్రపారాయణ మేలమ్మా !
హే—అమ్మా ! ఆఋషి యెవరు ?
రూ-ల—కాత్యాయనీకాంతుఁడగు యాజ్ఞవల్క్యమహర్షి. (కాత్యాయనిప్రవేశించును.) ఇదిగో కాత్యాయని. చెలీ ! నీకు నూఱేండ్లు.
కా—రూపలతాసాంగత్యముతో—కాని యాయసంగతప్రసంగ మేమి ?
రూ-ల—కూరుచుండుము. ప్రపంచములో నీవొక్కతెవే కాత్యాయనివి గావు. అట్టి వారనేకులున్నారు.
రూ—రూపలతా ! దీని కేమిజవా బిమ్మని నీయభిప్రాయము ?
రూ-ల—నాయనగారూ ! కాత్యాయని కడుబుద్ధిమంతురాలు. ఉత్తర మా మెకుఁ జూపింపుఁడు.
రూ—(కాత్యాయని కుత్తర మిచ్చును.)
మ—మహారాజా ! కనుఁగందుల నడిగియా ప్రత్యుత్తర మిచ్చుట ?
హే—మారూపలత నిన్నుఁ బెండ్లాడుట కియ్యకొన లేదని వ్రాసినఁ దప్పేమి ?
రూ-ల—తప్పు లేదు, గాని యమ్మా ! యింకొకరిని బెండ్లాడుట కియ్యకొంటినా ?
హే—ఆగొడవ యతని కెందులకు ?
కా—మాతండ్రిగారు సమ్మతించినయెడల నేనును రూపలతయు నాలోచించి జవాబువ్రాసి యిచ్చెదము. మర్యాద చూడక వ్రాసిన మదాంధునకుఁ గనుఁగందుల జవాబే కావలసినది.
మ—అట్లే కానిమ్ము తల్లీ !
రూ—మంచిది కాత్యాయనీ !
రూ-ల—కా(ఆలోచించి వ్రాసి రూపధరునిచేతి కిత్తురు.)
రూ—(చూచి సంతోషముతో) దేవీ! మతిమంతా; ఇదియే తగినజవాబు—వినుఁడు (చదువును.)

క. వనచరుని కబ్ధికన్యకుఁ
జన దెప్పుడుఁ బెండ్లిపొత్తు; చాలుదు వేనిన్
గొని చనుము రూపలత నీ
ఘనశౌర్యము చూసి పౌండ్రకా! భిల్లపతీ!

కా—ఆయన గొంతపద్యరూపముగా వ్రాసినాఁడు గనుక మహారాజా! మే మంత యుఁ బద్యముగానే వ్రాసినాము.

మ—ఇంతే జవాబు?

కా—అంతకంటె వ్రాయుట యనావశ్యకము నాయనగారు!

రూ—మతిమంతా! నీకూఁతురు మతిమంతురాలు. గరళము రక్తమం దెక్కిన చో నెంతో కావలెనా? వెంటనే యీప్రత్యుత్తర మాప్రమత్తునకంపుము.

మ—చిత్తము.

రూ— గీ. చిన్నిసుకుమారకాయ లౌ • కన్నెలార!
పెండ్లి వలదనుముగ్ధ లౌ • బిడ్డలార!
పెద్దలును జేయ జంకెడు • వీరవచన
రచన యిపు డెట్లు వచ్చె మీ • వ్రాఁతలోన?

కా—రాజచంద్రిమా! సద్గురుకటాక్షమున.

(రామానందుఁడు ప్రవేశించును.)

రూ-ల, కా—(లేచి చేతులుజోడించి) ఆచార్యవర్యా! కృతానేకనమస్కారములు.

రా—కల్యాణమస్తు. బిడ్డలారా! మీకుఁ గుశలమా?

రూ-ల—తమ యాశీర్వాదబలమున క్షేమముగా నున్నాము.

కా—గురుశేఖరా! తమ రిచ్చట లేనియీయాఱుమాసములు నాఱుయుగములుగాఁ దోఁచినవి. తమరాకకై నేనును రూపలతయు స్వాతివానకై ముత్తెపుఁ జిప్ప లున్నట్లున్నాము.

మ—అన్యఫలాపేక్షుల మై నేనును రాజుగారును దేవిగారును నట్లె యున్నాము.

రూ—రామానందా! ఇంతయాలస్యము చేసితి వేమి?

రా—వెళ్లినపని చేసికొనుట కెంతయాలస్యమావశ్యకమో యంతయాలస్యమే చేసితిని.

హే—నీయుద్యమము సఫలమా విఫలమా?

రా—విఫల మైనయెడల వీఁ డిక్కడకుఁ దిరుగ వచ్చు టెట్లగును?

రూ-ల(—అప-కా)మన మే యీసంభాషణమునకు విషయములమనితోఁచుచున్నది.

కా—(అప-రూ-ల)మన మనెడవేల? నీవే. నేను పట్టిపులగము మీఁదిపప్పువంటి దాన నేకాదా?

రూ-ల—(అప-కా) పుట్టినవర్ణమునకును దెచ్చినయుపమానమునకును సరిపోయినది.

పప్పేకదా యన్నమునకు రుచియు భోగ్యతయుఁ దెచ్చునది !

కా—(అప-రూ-ల) ఏమైనను ప్రధానపదార్థ మన్నమే !

రూ—(అప-కా) నీవును ప్రధాన పదార్థమవే.

మ—రామానందా ! విఫలముగానిచో, మాజన్మములతోఁ గూడ నీయుద్యమము సఫలమైన దన్నమాటయే ?

రూ—పలుకవేమి ; రామానందా ?

రా—నిదానించి చెప్పవలసి యున్నది.

మ—జరిగిన దేదో చెప్పుటకు నిదాన మెందులకు ?

రా—జరిగినచోట లేనివారు యథార్థ మన్యథా గ్రహించుకొనకుండునట్లు చెప్పుటకాలోచన కావలెను. అసత్యకల్పితవచనములకే తడుముకొనుటయక్కఱలేనిది.

రూ— క. మేమును మతిమంతుఁడుఁ గ
న్యామణులంగూర్చి తహతహం జెందుచు ను
న్నా ; మది నీకుం దెలియును ;
రామలగతి యేమొ చెప్పు రామానందా !

రా—మహారాజా! పెక్కుచోట్లకుఁబోయిపోయి చివరకుఁ బ్రతిష్ఠానపురము చేరితిని.

హే—అక్కడనుండి మాత్రము నాథా ! మీరు ప్రతిమఁ దెప్పింపలేదు.

రూ—ఆరాజునకుఁగూడఁ బరిణయమన్నఁ బరమాసహ్య మని విని యట్లుచేయలేదు,

రా—అది సత్యమే మహారాజా !

రూ-ల-(అప-కా)కాత్యాయనీ! మనవంటివారుప్రపంచములోనొక్కరైనను న్నారు.

కా—(అప-రూల) కొంచెమునే పూరకుండుము. అట్టివారైన గురువుగారు ప్రతిష్ఠానపురమును జివరఁబెట్టరు.

హే—సత్యమైనయెడల మా యభీష్టసిద్ధికి భంగమును సత్యమే.

మ—నాకు నట్లే తోఁచుచున్నది.

రా—దానిప్రభువు, పృథ్వీరూపుఁడు.

ఉ. యోగ్యత నట్టిభూరమణుఁ డుర్విని లేఁడు ; దిగంత యాతప
వ్యగ్యశుఁ ; డాత్త రూపవనుఁ; డౌహార్యమహత్త్వ రథైర్యుఁ; డర్థసౌ
భాగ్యవిశాలుఁ; డందమున భావజుఁ; డంబుధివిద్యుఁ; గానివై
రాగ్యము ముమ్మరం బగుట రామలకున్దులు గర్హవేషముల్.

రూ—చివరమాట వింటిమి కాని తక్కినసద్గుణములవృత్తాంతము వినలేదు.
హే—మన కుపయోగింపనిగుణసంపద యేమిప్రయోజనము నాథా!
మ—అమ్మా! రామానందుఁడు చెప్పఁదలఁచుకొన్నదంతయుఁ జెప్పనిండు.
రూ-ల—(అప-కా) నే ననుకొన్నట్టివాఁడుగనే యున్నాఁడు. కాని, మన మెఱుఁగనప్పుడు 'దిగంతయాతసమ్యగ్యశుఁ' డన్న మాటమాత్రము పొసఁగదు.
కా—(అప-రూల) సాంతముగా విని మఱి చెప్పుము. తప్పులెంచుటకు నీవంటి వారు లేరు. పురుషవైరిణుల మగుమనలఁ దప్పించుకొని యాశాంతములకుఁ బోయిన దాయనయశ స్సనుకొనుము.
రా—మూఁడుతరములనుండి వచ్చుచున్న సుమంత్రుఁడనునాతనిమంత్రినిజూచితిని.
మ—చూచి?
రా—ఆతనివలనఁ బృథ్వీరూపునిచర్య లన్నియు సమగ్రముగా వింటిని, నే మన సిచ్చి మాటాడుటకుఁ దగినవాఁడుగాఁ గనఁబడినందున నావృత్తాంత మంతయుఁగూడ వినిపించితిని. మే మిద్దఱముఁ గలిసి యాలోచించుకొనినపిదపఁ, దనకొడుకైన దూరదర్శికిని నాకును బరిచయము చేసినాఁడు. ఆదూరదర్శియే నాకు రాజదర్శనము గావించినాఁడు.
హే—తరువాత.
రా— గీ. ఎట్టిమృగమున కేయెర ♦ యిష్టమౌనొ
యట్టి మచ్చిడి బంధించు ♦ వ్యాఘుపగిది
హృద్యవిషయంబుతో రాజు ♦ హృదయకంజ
మును సమాకర్షణము సేయఁ ♦ బూనుకొంటి.
రూ—అవిషయ మేమి?
రా—బదరీనాథప్రతిమ.
హే—బదరీనాథవిగ్రహముతో బ్రహ్మచర్యవ్రతభంగ మెట్లగును?
రా—దానితో మనరూపలతచిత్రముఁగూడఁ బొరపాటునవలె జోడించితిని.
హే—తరువాత; తరువాత; నాన్చి నాన్చి చెప్పకుము.
కా—(అప-రూల—) నే ననుకొన్నట్టి వాఁడుగానే యున్నాఁడంటివిగదా! అట్టివాఁడా? అన్యుఁడా యిప్పుడు?
రూ-ల—(అప—కా) అన్యుఁ డని యె ట్లందువు?

కా—(అప-రూల) నే ననను. రామానందుఁడుగారే యందురులే. అన్యుఁడు గానిచో స్వజనుఁడు కాఁబోలు.

రూ-ల—(అప-కా) వృథాప్రసంగములు కట్టిపెట్టుము.

రా—మొట్టమొదట భక్త్యావేశగీతము లైనవి.

మ—పిమ్మట ?

రా—కన్యకారూపమును జూచుట కామతాపమునఁ బడుట.

కా—(అప-రూల) భక్తి బ్రహ్మచర్యవ్రతముతోఁ బద డైనదని వేఱే చెప్పనక్కఱలేదు.

రూ-ల—(అప-కా) అయినయెడలఁ గారణము నేను గాదు, బ్రహ్మవ్రాఁత.

కా—(అప-రూల) బ్రహ్మవ్రాఁత గాదు, నావ్రాఁతయే !

రూ—మతిమంతా ! మనము సంకల్పసిద్ధులమైతిమి.

మ—నన్నుఁగూడఁ గలుపుటకుఁదగినయాధారమింకను రామానందుఁడగపఱుపలేదు.

రా—వచ్చునెడల, శుభములు, తోడుగాఁ గాని రావు.

గీ. స్ఫారబాహావకనక కే ♦ యూరశోభ
ముఖవికాసముతో వచ్చు ♦ పోల్కి, రాజ
మౌళి కెపుడేనిఁ బొడమునే ♦ మంగళంబు
వెంట నీకును శుభ మగు ♦ విప్రమంత్రి !

హే—'వచ్చునెడల' 'పొడమునే' అనుచున్నావు, రామానందా! ఇంకను సందిగ్ధమేనా ?

రా—అమ్మా ! వీరాంగీకారము నిశ్చయ మని చెప్పఁగలను గాని, వధువుమాట యిప్పుడే యేమి చెప్పఁగలను ?

ఆ. వరవిటపము నొకటి ♦ యరసి వచ్చితి వంచి,
యింక నొక్కకొమ్మ ♦ నెంచి వంచి
కలిపి యంటు గట్ట ♦ వలె; నది సాధ్యమో
కాదో యెట్లు చెప్పఁ ♦ గలను దేవి ?

రూ—(అప-రా) ఎంచుట యెందులకు? ఆకొమ్మ యిక్కడనే యున్నది, వంచి చూడరాదా ?

రా—(అప-రూ) ఒకప్పుడు వంగునది మఱియొకప్పుడు వంగకపోవచ్చును.

రూ—(అప-రా) కనుకఁ గర్తవ్య మేమి ?

రా—(అప-రూ) నన్నును బిడ్డలను గొంచెము సే పిచ్చుట వదలిపెట్టి మీరుమ్మగా రును దూరముగా నుండుట.

రూ—(అప-రా) పర్యవసానము నా కెట్లు తెలియఁగలదు?

రా—(అప-రూ) మహారాజా ! ప్రతిష్ఠానపురవార్త విన్నవించినవాఁడు ప్రభుభ వనమున జరిగినది విన్నవింపఁడా?

రూ—(అప-రా) అదికాదయ్యా ! కాయమో పండో నీ వెఱఁగినతక్షణమే నా కుఁ దెలియుట యెట్లని, నేను గాదు—ఈతటతటకొట్టుకొనెడుమనసిసుం డె యడుగుచున్నది.

రా—(చుట్టు పరికించి రూ-తో) రాజా ! నెన్నినయెడల నీగంట మ్రోఁగించెదను. అదే జయఘంటానాద మని గ్రహించుకొనవలెను.

రూ—(అప-రా)ఇట్టివాఁడవని తెలియక ని న్నెన్నోతూలుమాటలాడితినిజామా ?

రా—(అప-రూ) నేను వినలేదే ?

రూ—(అప-రా) నీవు రాకముందు, మంత్రియెదుట ; ఇక్కడనే.

రా—(అప-రూ) పోనిండు. మీరు దూఱినది మీ రనుకొన్నయప్పటిరామా నందునిఁ గాని, నిజమైన యిప్పటి రామానందునిఁ గాదుకదా. ఆరామానం దుఁడు నిందార్హుఁడే కావచ్చును. వానినింద వీనికి స్తుతి.

రూ—దేవీ ! మతిమంతా ! మన మింక నావలికి వెళ్లుదము రండు.

(నిష్క్రమింతురు.)

రూ-ల—కాత్యాయనీ!మనమునుబూజ్యులగుగురువుగారునుగూడఁబోవుదమురండు.

కా—గురువుగారి నిట్లు చేయుఁడని విధించుట శిష్యురాలికిఁ దగదు.

రూ-ల—విధించుటలేదు. విన్నవించుకొనుచున్నాను.

రా—అమ్మా ! ఆఱునెలలతరువాత వచ్చిననేను, మీతో బిడ్డలతో నొంటరిగాఁ ఇ ష్టసుఖములు మాటలాడుకొనఁ దలఁచుకొన్నాను.

రూ-ల—వారి నేల పంపివేసితిరి?

కా—పిచ్చిదానవా, రూపలతా ! ఒంటరిగా ననఁగా నర్థమేమి ?

రూ-ల—(అప-కా) అదేమో, కాత్యాయనీ ! కాయము కంపించుచున్నది.

కా—(అప-రూల) అసహజము లైనపురుషచిహ్నములు పోయి సహజములైన స్త్రీ
లక్షణము లంకురించుచున్నవి. వాని కేమిలే.

రా—నాకు వేసినప్రశ్నకుఁ గాత్యాయని జవాబిచ్చినది కావునఁ బునరుక్తిగా
నేను జెప్పనక్కఱలేదు. అమ్మా! నీ కేమైన నస్వస్థతగా నున్నదా?

రూ-ల—గురువర్యా లేదు. స్వస్థనైయే యున్నాను. పథిశ్రమ పడి వచ్చినతమ
కుఁ దన్నివారణార్థము వెళ్లి యేమైనఁ బండ్లును బాలును దెత్తునా!

రా—(నవ్వుచు) అమ్మా! నీ వేమియు శ్రమపడనక్కఱలేదు. చిరకాలప్రయా
ణమునుండి వచ్చినగురునకుఁ బ్రియచ్ఛాత్రావలోకనసంభాషణములకంటెఁ
బండ్లును, బాలును నెక్కువశ్రమాపనయనములు గావు.

కా—(అప-రూల) సమస్తలోకస్వభావజ్ఞు లగుగురువుగారు మాత్రపుమాటలతో
మోసపోదురమ్మా!

రూ-ల—(అప-కా) నీవూరకుండుము. నీవేళాకోళములు నన్ను మఱింత కళ
వళ పెట్టుచున్నవి.

శా—బిడ్డలారా! ఇదివఱకు మనసిచ్చి నాతో బాహాటముగా మాటలాడువారికి
ప్పుడీగుసగుసలేమి? అవి నాతోఁ జెప్పఁగూడని వైన మి మ్మిక్కడనుండుఁ
డని బలవంతపెట్టను. నన్నుఁ బొమ్మన్నను బోయెదను.

రూ-ల—గుసగుస లేమియును లేవు గురువర్యా!

శా—అమ్మా! తలుపు గ్రుద్దుచున్నవారి నెవరు వారని యడిగినప్పుడు—ఎవరును లే
రు తలుపు దీయుమన్నట్లున్నది.

కా—రూపలతా! దేశికునియెదుట రహస్యము దాఁపఁ దలఁచుట దేవునియెదుట
దాఁపఁబూనుకొనునట్లే. మహాత్మా! యెందుచేతనో యీమెశరీరము కంప
మెత్తుచున్నదఁట.

శా—తల్లీ! రూపలతా! కంపకారణములు ప్రపంచములో మూఁడు కనఁబడుచు
న్నవి. ఒకటి శరీరబాధ.

కా—స్వస్థనై యున్నానని యిప్పుడే చెప్పినది.

రా—రెండవది భయము.

కా—గురువులయెడల మాకు భక్తి గాని భయమెన్నఁడును లేదు. ఇన్నాళ్లును లేని
భయ మిప్పు డెట్లు వచ్చును?

రా—మిగిలిన మూఁడవది లజ్జ. దాని కిచటఁ గారణమేమి?

కా—అది రూపలతయే చెప్పవలెను.

రూ-ల—చేయఁగూడనిపని చేయుట లజ్జాకారణమగును. అట్టిది నేను జేసినట్లు జ్ఞప్తిలో లేదు, గురువర్యా!

రా—అమ్మా! చేయవలసినపని చేయకుండుటయు లజ్జాజనకమే.

కా—ఇష్టకార్య మితరుల కెఱుకపడుననియు నొకప్పుడు సిగ్గు వచ్చునుగాదా?

రా—బిడ్డలారా! అది మీజాతివారును మీవయస్సువారును జెప్పవలెఁ గాని నే నెట్లు చెప్పఁగలను?

రూ-ల—గురువర్యా! కాత్యాయనిని గూఁకలు వేయవలెను.

రా—ఎందులకు?

రూ-ల—ఇట్టి యడ్డిదిడ్డిమాట లాడకుండ.

కా—ఉన్నమా టాడిన నింత యుడుకేల రూపలతా?

రూ-ల—ఉన్నదో, లేనిదో నీ కెట్లు తెలియును? గురువర్యా! చేయవలసినదియు నేఁ జేయకున్నదియు నగుపని యేది?

రా—చెప్పనా తల్లీ! పెండ్లి కంగీకరించుట.

రూ-ల—ఎల్లరకు వివాహ మవశ్యకర్తవ్యమా?

రా—అందఱజోలి యిప్పు డెందులకు? నీకవశ్యకర్తవ్యమనియే నాయభిప్రాయము.

రూ-ల—పకారణముగ సెలవిచ్చుట మంచిదని మనవిచేసికొనుచున్నాను.

రా—వాదప్రతివాదములకు దిగుచున్నావు గనుకఁ జెప్పెదను, వివాహము నీకనా వశ్యకమని రుజువుపఱచుపూచి నీది.

రూ-ల—బాధ్యత నాదియేయని నిర్ధారణచేయుటకు హేతువునాకుఁదోఁచుటలేదు.

రా—అలాగుననా! ఇట్టి విషయములలో బాధ్యత యెవరిదని శాస్త్రములు చెప్పు చున్నవో కాత్యాయని నడుగుదము.

కా—స్వామీ! రూపలతకుమాత్రము తెలియదా? అయినను సెలవైనది గనుకఁ జెప్పెదను. వివాహము ప్రసిద్ధాచారము. వివాహానావశ్యకత యప్రసిద్ధ ము. అప్రసిద్ధపక్షమును దీసికొనినవారే, వారివాదమును మొదట యుక్తిప్ర మాణములచేత స్థిరపఱచుకొనవలెను.

రూ-ల—(స్వ) నేఁ డేమోకాని యన్నిటిలోను కాత్యాయని నా కెదురు తిరుగు చున్నది. (ప్ర) గురువర్యా! బాధ్యత నాదని సిద్ధాంతపడినది కావున ఋనవిచేసికొనెదను.

రా—చెప్పు మమ్మా.

రూ-ల—వివాహము మనశ్శరీరస్వాతంత్ర్యములకు రెండిటికిఁ గూడఁ బ్రత్యక్షప్రతిబంధకము. కనుక నా కిష్టము గాదు.

రా—కాత్యాయనీ! మొట్టమొదట నాయొద్దఁ జదువు ప్రారంభించినప్పుడు రూపలత యిష్టపడి చదివెనా? తలిదండ్రుల ప్రోద్బలముచేఁ జదివెనా?

కా—బలవంతముగానే విద్య ప్రారంభించినది. అది నే నెఱుఁగుదును.

రా—నిజమేనా రూపలతా!

రూ-ల—నిజమే.

రా—విద్య ప్రప్రథమమందు నీస్వాతంత్ర్యమును బోఁగొట్టినదా లేదా?

రూ-ల—పోఁగొట్టినది.

రా—ఇప్పు డది సుఖదాయక మైనదా లేదా?

కా—కాదని యెట్లు చెప్పఁగలదు?

రా—కనుక విద్యవలెనే వివాహము భగవత్కృపచే సుఖదాయకము కాఁగలదు.

రూల—గురువర్యా! భగవత్కృప యొకటి గావలెను. విద్యవంటిదే వివాహము ను గావలెను.

రా—కాదని నీ వెట్లు చెప్పఁగలవు?

రూ-ల—ప్రపంచములోని వివాహితులచర్యలు చదువుటచేతను, వినుటచేతను, గనుటచేతను. పోట్లాటలు, పృథక్శయ్యలు, సంఘావమానభీతిచేఁ దద్గోపనములు, పైనవ్వులు, లోనియేడ్పులు, బాహ్యానురాగములు, అంతర్ద్వేషములు—ఎన్నెన్ని చూచుటలేదు? గురూత్తమా? పుస్తకము లానందమునే యిచ్చును గాని యెప్పుడును బాధింపవే! అట్టియానందమునుండి న న్నెడఁబాపి యెుకపీడాకరుఁ డగుపెనిమిటికంటఁ గట్టుట తమకు న్యాయమా?

కా—(అప-రూల) ప్రియునిపీడ ప్రీతికర మేమో! రూపలతా!

రా—అమ్మా! సీతాదమయంతీచంద్రమతీకాంతలపోలిక దెచ్చుకొని చూడ వేమి?

కా—వారిజీవనములును జింతాసంకులములే యైనవి గాదా.

రూ-ల—జీవనములు గావు, కాత్యాయనీ! జీవేశులవలన వచ్చినస్థితులు.

కా—తుదకు వచ్చినవిమాలయశస్సుమాట యేమనెదరమ్మా?

రూ-ల—గురుమహాశీ! లోకములో నట్టికాంతలు లేరని ఖ్యాతి వచ్చినది సరే. అది వారికష్టముల నెట్లు కాచినది? ఆఖ్యాతియైనను సుగుణరాసులని వచ్చినది కాని, సుఖజీవిను లని రాలేదే. అట్టివా రవివాహితలైనను, లోకవిదితము గాకపోవును గాని, వారిసుగుణసంపత్తికి లో పేమివచ్చును?

రా— గీ. ఒరుల కుపయోగపడనట్టి ♦ యుత్తమగుణ
నికర మున్నను లేకున్న ♦ నొకటెసుండి,
భోగ్యములు గాక యడవిలోఁ ♦ బుట్టి పెరిఁగి
చచ్చుసుందరసురభిపు ♦ ష్పములపగిది.

గీ. స్వార్థపరులె జీవన్మృతు ♦ లనెడువారు;
పుడమి మృతజీవులనఁగ నె ♦ ప్పుడు మనంబు
నొడలు లోకోపకారార్థ ♦ మొసఁగువార
లంచు మీ రెంచవలయు ల ♦ తాంగులార!

కా—గురూత్తమా! పరిణయమాట పరోపకార మెట్లగును?

రూ-ల—అదియే నేను నడుగఁబోవుచున్నాను. ఆత్మానందముకై పెండ్లాడువారు లోకోపకర్త లెట్లగుదురు?

రా—బిడ్డలారా! మీ రిద్దఱు, నే నొక్కఁడను, ముసలివాఁడను. ఎట్లు వాదింపఁగలనో తెలియదు. కాత్యాయనీ! పెనిమిటి పీడాకరుఁడనినఁ బెండ్లి పీడాకరమన్న మాటయేకదా?

కా—ఔను! గురుచంద్రమా!

రా—అప్పు డట్లని రూపలత యిప్పు డాత్మానందముకై పెండ్లాడువా రనుచున్నది కదా! వివాహ మానందకరము గావచ్చు నని యొప్పుకొన్నట్లేనా?

కా—ఒప్పుకొనక తప్పన ట్లున్నది. లేనిచో స్వవచనవ్యాఘాతమునకు జవాబీయవలెను.

రూ-ల—ఒప్పుకొనినను స్వవచనవ్యాఘాతము తప్పదు.

రా—కనుక రూపలతా! పెండ్లి యాత్మానందకర మగుననుట నిర్వివాదాంశము.

రూ-ల—అట్లే యనుకొనుఁడు. పరోపకారముమాట యేమిచెప్పెదరు?

రా— ఆ. ఆత్మసుఖముకొఱకు ♦ నన్యులసౌఖ్యము
లైచ్ఛఁబరాదు గాని ♦ శ్రేయములను
నన్యులకు నొసఁగ్గ ♦ నప్పుడు లభియించు
సుఖములందుఁ దప్పు ♦ చూడ రెవరు.

రూపలతా ! ఉదారచిత్తు లొకప్పుడు కేవలపరోపకారము చేతనే పరమా నందభరితు లగుదురు.

రూ-ల—అయ్యో ! నాప్రశ్నమునకును దమప్రత్యుత్తరమునకును సంబంధముకనఁ బడ లేదు.

రా—సంబంధము లేకేమి? ఆత్మానందకర మైనంతమాత్రమునఁ బరోపకారము పరోపకారము కాక పోదని గురువుగారు సెలవిచ్చినారు.

రూల-అటైన నాత్మానందకరములన్నియుఁ బరోపకారకృత్యములనిచెప్పవచ్చునా?

రా—నన్నడిగెదవేమి ? అది గురువుగారినడుగుము.

రా—తల్లీ ! కొంచె మోపికపట్టుము, చెప్పెదను—పెండ్లి పరోపకారకృత్య మని చూపినఁ జాలునా ?

రూ-ల—చాలును.

రా— క. యౌవనము సోయగంబును
లావణ్యము నవక మిట్టి ♦ లక్షణములకున్
దావలమౌ నీతను వొక
భావజసుందరున కనువు ♦ పడును భుజింపన్.

రా- (అప-రూల) చెలీ! నీవొకమానుషాదునకు మంజులాహార మగుదునని బెదరకుము,

రా— గీ. నీమన స్తనుసద్గుణ ♦ స్తోమమంత
రింప, కెంతయొ నీవల్ల ♦ వృద్ధినొందు,
సుతసుతారూప లగురూప ♦ లతలు పెక్కు—
రుందు రొకరూపలత వాడి ♦ డిందుపడిన.

గీ. సత్సతులపోల్కి నీవు సం ♦ సారశకట
మును నడపి తేని, యయ్యో ! య ♦ ట్లనుట యేల ?

నడపుదువు లెస్సగా నది ♦ నాకుఁ దెలియు,
నింతి ! భావికాంతలకు మే ♦ ల్బంతివౌదు.

అమ్మా ! యివన్నియుఁ బరోపకారకృత్యములు గావమ్మా ? అవియుఁ గాక

క. అకలంకుఁ డైనవరునికి
నొకసాలంకారకన్య ♦ నొసఁగుట భవతా
రక, మటుపడి, కిటుపడి, కీ
సుకృతమునకు సాటి యైన ♦ సుకృతము గలదే ?

రూ-ల—అటైన మహానుభావా ! సన్యాసినీసన్యాసులగతి యేమి ?

రా—అమ్మా ! గృహస్థులయాదరణమే వారికి గతి.

గీ. స్వాదుఫలములు శీతల ♦ చ్ఛాయ లిచ్చు
వృక్షములు పక్షులకు నెట్లో, ♦ భిక్షువులకు
సంతతాతిథ్యకరణప్ర♦శస్తిఁ బడయు
చవని నివసించుయోగ్యగృ♦హస్థు లట్లు.

రూ-ల—మహానుభావా ! అన్నియును బాగుగనే యున్నవి గాని, సంసారసుఖములు దుఃఖాత్మకములు గావా?

కా-మనరూపలతకు బీజములు లేనిశీతఫలమును, టెంకలేనిచూతఫలమును గావలెను.

రా—కోరిక నిష్ప్రయోజనమైనను మంచిదే, కాని యాబీజములే మఱలఁజెట్లయి మధురఫలము లిచ్చుచున్నవి. అమ్మా! రూపలతా! ప్రపంచసుఖములన్నియు మిశ్రసుఖములు. అనఁగా సుఖదుఃఖాత్మకములు. నామాటలునీకు నచ్చినవా?

రూ-ల—నచ్చినవి.

రా—బిడ్డలారా! మీతోఁ బ్రసంగము సంతోషకరమైనను శరీరధర్మ మనుక్రమము

రా—విశ్రాంతి పుచ్చుకొనుమని పోడుచుచున్నది.

రూ-ల-కా—అయ్యో ! గురువర్యా ! తమరు వెళ్ళి విశ్రమింపవచ్చును. మే మనుజ్ఞదీసికొనెదము.

తల్లులారా ! యీసమావేశఫలము తెలియనిదే యట్లు చేయ వీలులేదు.

రూ-ల—తమసెలవునకై నిరీక్షించుచున్నాము.

రా—మీరు విద్య సాంతమైనది. అనఁగా నిఁక నేఁ జెప్పగలిగినది లేదన్నమా
ట—విద్యావసానమున శిష్యులు శిష్యురాండ్రును గురుదక్షిణ యేదో యొ
సఁగుట పూర్వాచారము.

కా—అదేదో తమకు సెలవిచ్చుటయే మే మిచ్చుటయని మనవిచేసికొనుచున్నాను.

రూ-ల—కాత్యాయనీ! మన మేమీయఁగలము! రాజ్యధనకనకాంబరాదులు
వారికక్కఱలేదని మన మెఱుఁగుదుముకదా!

రా—శిష్యులీయలేనివస్తువు సద్గురు వెప్పుడును గోరఁడు. ఈయఁదగినదే కోరెదను.

రూ-ల, కా—చిత్తము.

రా—మీ రుభయులును బెండ్లిచేసికొనుట కొప్పుకొనవలెను.

కా—గురువర్యా! అంతకంటె నెక్కువప్రేమతోనే నేనురూపలతయునున్నాము.

రా—కాత్యాయనీ! నీవెప్పుడును బరిహాసప్రియురాలవు. రూపలతా! నీవువివా
హమాడి నీతలిదండ్రులదుఃఖమును, కాత్యాయనీ! నీవు పరిణయమై పాప
కు! నీతండ్రిదుఃఖమును దుదిముట్టింపవలెను.

కా—(కన్నులు దుడుచుకొనుచు) తమయాజ్ఞ శిరసావహించెదను. రూపలత వి
వాహము గాకుండ నేను గానని నియమముచేసికొంటిని. ఆప్రతిజ్ఞకుమా
త్రము భంగము రాకుండఁ జేయుఁడని ప్రార్థించుచున్నాను.

రా—నిన్ను నాలుగుగ్రహము లొకవైపునకు లాగుచున్నవి. వచ్చెదవా? రావా?

కా—అందులో గురుబల మెక్కువగా నున్నది.

రూ-ల—తమయాజ్ఞకు వ్యతిరేకముగా నడచుకొనుదానను గాను. కాని—

కా—ఆసందియ మేమో వెళ్ళఁగ్రక్కుము.

రూ-ల—ఈగురుదక్షిణ తమరు ప్రయాణమునకుఁ బూర్వ మేల కోరలేదో తెలియ
కున్నది.

రా—(స్వ) మీతండ్రిచేతఁ దిట్లుతినుటకమ్మా! (ప్ర) అడిగినవెంటనే యిచ్చెదవని
నాకుఁదెలిసినను దరువాతికొఱఁతఁగూడఁదీర్చుకొనియీపనిఁజేయనెంచితిని.

ఆ. తగిన వరుని వెదకి • తమకంబు గలిగించి
వచ్చి యున్న నీకు • నచ్చఁజెప్పి
పెండ్లిరోఁత నిన్ను • విడిచినపిమ్మట
నముఁగఁ దలఁచినాఁడ • నమ్ము యద్ది.

కా—తిసెప నని యొప్పుకొనినతరువాత బిడ్డ, యన్న పేదియని యడుగకుండ,గురు
వుగా రీపని జేసినారు.

రా—రూపలతా ! ఆపరుఁ డెపఁడో గ్రహించుకొంటివా ?

కా—మాముందఱ మాతలిదండ్రులతో నిదిసఅక్కుఁ దమరు ప్రసంగించినపృథ్వీరూ
పుఁడని గ్రహించుకొనలేదా ?

రూ-ల—గురువర్యా ! పరిణయమున కొప్పుకొందును గాని కులరూపవయోగుణము
లు దెలియకుండఁ బతి నెట్లొప్పుకొందును ?

రా—పరిణయాంగీకారమే గురుదక్షిణ. తక్కినది నీయిష్టము.

కా—గురువుగారు చేసినయాయనగుణరూపాదివర్ణనము వినలేదమ్మా ?

రూ-ల—కులవయోరూపములమాట యటుండనిమ్ము. ప్రతిమ చూచుటచేతనే
పరవశులయి భావజవికారములలోఁబడినవారు చలచిత్తులా? స్థిరచిత్తులా?

కా—రూపలతా ! శ్రవణమాత్రముననే చలించినమనసుగలవారికంటె స్థిరచిత్తులే.
నారూపమేగదా యట్లు చేసినదని యింతగర్వమెందులకు?

రా—అమ్మా ! స్థిరచిత్తత పోయియేకదా పరిణయోన్ముఖుఁ డైనాఁడు.

రూ-ల—అట్లయిన సపత్నీపీడ తప్పదేమో ?

రా—ఒకటెతప్ప నీకు సవతు లెవ్వ రుండరమ్మా !

రూ-ల-అయ్యో! యితఃపూర్వమే వివాహమైనవారినిగూర్చి యింతశ్రమపడితిరేల?

కా—గురువర్యా ! పానకమునందలిపుల్లవలె నడ్డువచ్చిన యామహాత్ము రాలెవరు?

రా—భయపడనక్కఱలేదు. ఆమె శాంతమూర్తి యైనభూకాంత దక్కమ రెవ
రును గారు.

కా—సఖీ ! నీయసూయ కిఁకఁ గారణము లేదు.

రూ-ల—నా కసూయయేమి? సురూత్తమా ! కాత్యాయనిని మందలింపవలెను.
మహాసందర్భప్రలాపములు వచ్చుచున్నవి.

కా—మహాత్మా ! భగవత్తుల్యు లగుగురువుగారియెదుట నంతశ్శుద్ధిగాఁ బలుకవలెను
గాని యీసంగినంగిమాట లెందులకు? చిట్టిచిట్టిసిగ్గులు, తాని వినవలె ననుకు
తూహలములు. ఒకఁడైనను బహువచనప్రయోగములతోఁ బ్రసంగించుట
లు. సపత్నీభయములు. నా చేత సవతులభయము లేదని తమప్రత్యుత్త
రమును చెప్పించుకొనుటలు. లోపలఁ గొండంతసంతోషము. అయినను

పైకి నన్ను మండలింపుఁడని తమ్ముఁ బ్రార్థించుటలు. ఇవన్నియు వలపును సూచించునా? వైరాగ్యమును సూచించునా?

రా—(నవ్వుచు) అమ్మా! పోనిమ్ము. పృథ్వీరూపునియెడల వలపును బరపురుషుల యెడల వైరాగ్యమును స్ఫూచించుచున్నవి. రూపలతా! కాత్యాయనిని నీవు చెప్పిపొడుచు నవసరమును దూరముగా లేదులే.

రూ-ల—అట్లయిన నాకుఁ బరమసంతోషము.

రా-మీయుభయులసంతోషమునకేకాదా బిడ్డలారా! నేనిన్నిపాట్లుపడుచుండుట.

రూ-ల—మాటాడవేమి, కాత్యాయనీ!

కా—ప్రశ్నలేనిప్రత్యుత్తర మెచ్చటనైన నుండునా?

రా—రూపలతా! కాత్యాయనీ! నాకు మీరిద్దఱును గురుదక్షిణ లిచ్చినారు. పరమసంతోషముగా నున్నది. ఇంతప్రయాణము చేసి యింటికి బిడ్డలయొద్దకు వచ్చినప్పు డుత్త చేతులతో రాఁగూడ దని రెండుచిత్రములు తీసికొని వచ్చినాను. పుచ్చుకొనెదరా?

రూ-ల—మహాప్రసాదము. గురుప్రకాండమా! ఆచిత్రము లేవి?

రా—అమ్మా రూపలతా! యిది నీకు. తల్లీ! కాత్యాయనీ! యిదినీకు. (అని చెఱియొకప్రతిమయుఁ జేతఁబెట్టును.)

కా—మహాత్మా! యీప్రతిమలు తమరు లిఖించినవని వేఱే చెప్పనక్కఱ లేదు. ఇతరరచితములైన నింతసొంపుగా నుండవు.

రా—బిడ్డలారా! నే నున్నది యున్నట్లు చిత్రించినాను. బాగోగులబాధ్యత ప్రతిమామూలములది గాని, నాది కాదు. ఇదియే పృథ్వీరూపునిప్రతిమ.

రూ-ల—(స్వ) ఇంతవఱకు శ్రోత్రద్వారమున నే యానందరసము మనసున కెక్కినది గాని యిప్పుడు నయనద్వారమునఁగూడఁ బోవుచున్నది. ఇఁక స్పర్శ సుఖమే మిగిలినది. (ప్ర) గురూత్తమా! కాత్యాయనీకరస్థమైన దెవరిరూపము?

రా—అది పృథ్వీరూపునిభావిమంత్రి యగుమారవర్మరూపము. అనఁగాఁ బ్రస్తుత మంత్రి యగుసుమంత్రునికొడుకుపటము.

రూ-ల—అతఁడుగూడ నవివాహితుఁడేనా?

రా—వివాహితుఁ డైనఁ దెచ్చి కాత్యాయనిచేతి కేలయిత్తును? కాత్యాయనీ! నీకు నచ్చినదా? రూపలతా! నీది నీకు నచ్చినదా? (తలలువంచుకొని యూరకుండుట చూచి)

గీ. బిడ్డ లూరకుంటయె యెంతొ • ప్రియము నాకు ;
మౌన మురరీకృతిని దెల్పు • మార్గ మిందు,
భ్రమరికానాదవిరతి తె•ల్పఁగల దవ్వి
వ్రాలఁదగు వృక్షములపైని • వ్రాలినవని.

రూ-ల—(నమస్కరించి) సెలవుదీసికొనెదము మహాత్మా !

రా—కల్యాణమస్తు.

(రూపలతాకాత్యాయనులు నిష్క్రమింతురు.)

జయనాదము చేసెదనని రూపధరునితో వాగ్దానము చేసితిని. (పోయి జయఘంటానాదము చేయును.)

(రూపధరుఁడును, మంత్రియు, రాణియుఁ బ్రవేశింతురు.)

రూ—రామానందా! నీఋణ మెన్నఁటికైనఁ దీఱునా? పర్యవసాన మచేతనపదార్థముచేఁ దెలిసినను జేతనమువలనఁ దెలియఁగోరుచున్నాము.

రా—గొడవలేకుండ మూఁడుముక్కలలోఁ జెప్పెదను.

గీ. రాజపుత్రికి నొకమహా• రాజునకును,
మంత్రి మతిమంతుసుత కొక • మంత్రిసుతున,
కఖిలకల్యాణగుణవార్ధి • యైనదేవు
కరుణ శీఘ్రంబుగా నగుఁ • బరిణయములు.

మ—రామానందా! బ్రతికియున్న నేనునుఁ బరమపదమునం దున్ననాభార్యయు ను ధన్యులమైతిమి. నాయెడలఁ జూపిననీదయ నిర్హేతుకము.

రా—అట్లనకుము. భగవంతునిదయ.

గీ. ధారుణీనాటకపుసూత్ర • ధారుఁడైన
యమ్మహాదేవుచేతిబొ•మ్మల మగు
మనము చేసెడిదేది? చే•యనిది యేది?
యెట్లు త్రిప్పిన నాడుదు • మట్లు లంతె.

రూ—నా రచ్చటను నీ రిచ్చటను నుండఁగా వివాహము లెట్లు సిద్ధించును?

రా—ఇంతచేయుటకు వీలుగలిగించినభగవానుఁ డాకొంతకూడఁ దీర్పనున్నాఁడు.

హే—ఎట్లు ?

రా—మోహితుఁ డైనపృథ్వీరూపుఁడు కొన్నాళ్లు సుమంత్రునకు రాజ్యమప్పగిం దూరదర్శితో మాత్ర మిచ్చటికి వచ్చు నేర్పాటులు జరిగినవి.

మ—దూరదర్శిగా రెవరు ?

రా—ఎవరో యిదివఱకే చెప్పితిని. మఱచితివిగాఁబోలు. ఆతఁడు కాఁబో మాయల్లుఁడు. వారిరాక చూచి ముందు మనకుఁ దెలియఁబఱుచుటకు నా శిష్యుఁడును విశ్వాసియు నగుశివశర్మను బత్రపురములో దిగవిడిచి వచ్చితిని

రూ—ఇంత శీఘ్రముగా నట్టిపృథ్వీరూపునకు రాజ్యబంధములు సడలించిన నీఋ నెన్నినోళ్లతో నైనఁ బొగడలేము.

రా—బంధమోచనుఁడు పరమేశ్వరుఁడు దక్క నన్యుఁడు గాఁడు. రాజ్యబంధ ములు పోయినవో లేవో కాని, రామాబంధములు వచ్చుచున్నవి. ఆ చిద్విలాస మే మని చెప్పుదును ?

హే—కారాబంధములు కష్టములు గాని, కల్యాణబంధములు కష్టములా?

రా—చూచుమనసునుబట్టి సుఖదుఃఖము లుండునమ్మా. ఇంతవఱకు రూపలత చే మనుచుండెడిదో యెఱుఁగవా? సెలవైనయెడలఁ బోయి యించుక విశ్రాంతి దీసికొనెదను.

రూ—మంచిది. రామానందా! నీకుఁ బ్రత్యుపకారము మే మీవందనములతో గాని వేఱుగాఁ జేయలేము.

మ—ఆదక్షిణయే యీయానందబాష్పములతో వీఁడు ధారవిడిచిపెట్టుచున్నాఁడు.

(అందఱు నిష్క్రమింతురు.)



శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# రూ ప ల త.

## తృతీయాంకము.

పరిదేశము—పత్రిపురప్రాంతవనము.

ప్రవేశము—శివశర్మ.

శి—గురుఋణము తీర్చుకొనునవసరము భగవంతుఁ డనుగ్రహించెనుగదా యని కొండంత సంతోషముతో నున్న నా కెంతయాశాభంగము తటస్థించినది !

వ. ఇచటనె, యాకరంబుననె ♦ "యిద్దఱు వచ్చిరి, రాజవరాళియున్
సచివుఁడు, మార్గకష్ట మప ♦ శాంత మొకించుక యైనవెంటనే
యచటికి వత్తు" రంచు మన ♦ సార లిఖించితి మొన్న ; లేఖకా
వచనము లిప్పుడీపగిది ♦ వ్రాయఁగఁ జేసితి వేమి దైవమా ?

కానీ ! ప్రపంచానుభవములు తరంగతరళములు గదా ! అది చూచుకొని యానంద బాష్పములును, ఇది చదువుకొని యింకొక విధమైన కన్నీళ్లను రాల్తురు ! నేనేమి చేయఁగలను ?

గీ. అవని సుఖములు క్షణికంబు ♦ లైనయపుడు,
కాఁపురం బుండునే యిఁకఁ ♦ గష్టవితతి ?
కష్ట మావశ్యకము ధైర్య ♦ కలన కెపుడు ;
ధైర్యమును దాల్చికొని దాని ♦ దాఁటువాఁడ.

గురుకృపామహిమచే నీవిఘ్నము నిర్విఘ్నముగా విఘ్నమగుఁగాక ! కారాబద్ధులై యున్నారనివింటిఁగాని, యెందుచేతనో యెచటనో నాకింకను దెలియలేదు. ఎప్పటిసంగతి యప్పుడే గురువుగారికి సమర్పింపవలెను. ప్రభువునకుఁ బరమమిత్రుఁడును, నాకు నూతనస్నేహితుఁడును నగుధర్మాచార్యునితో మాటాడితిని. నాగురుభక్తికి మెచ్చి యన్నియుఁగనిపట్టి యిచటికేవచ్చి చెప్పెదనన్నాఁడు. వచ్చెదనన్నసమయము దాఁటినది. ఇప్పటికీయుత్తర

మంపి, తరువాత సహస్రముగా మఱియొకజాబు వ్రాసెదను. నాకిపెంపుడు పావురములు ప్రియమిత్రములు. (అని యొకదానిఁ బిలిచి యుత్తరము గట్టి)

గీ. పక్షిరత్నమ! మిత్రమా! పావురంబ!
పైకెగిరిపోయి, యేదేశ వార్తఁ బడక,
గురుని కీలేఖ యిచ్చి, వే మఱలి రమ్ము!
త్రోవబత్తెంబు నడుగని దూత వమ్మ!

(అని విడిచిపెట్టును.)

(ధర్మాచార్యుఁడు ప్రవేశించును.)

శి—ఆచార్యా! నమస్కారము. నేనిట నెంతోసేపొంటరిగా నుంటిని. ఇంత యాలస్యము చేసితివేమి?

ధ—నేనాలస్యము చేసితినన్నమాట నిజమే కాని, నీవొంటరిగా నుంటివన్నమాట యిప్పు డెగిరిపోయినపావుర మసత్యమని ఋజువుపఱచుచున్నది. పట్టినపక్షులు నిన్నుఁ బావురాలబాఁపఁడని యేలనుచున్నారో నాకిప్పుడు తెలిసినది.

శి—పరదేశములోఁ బావురములే నాకుఁ బరమబంధువులు, పోనిమ్ము! ధర్మాచార్యుఁడవయ్యు నియమధర్మము నిలుపుకొలేకపోయితివిగదా! నీవు రావేమో యని యిప్పు డెగిరిపోయినపావురపు టెక్కలవలె నాగుండె లెట్లు తటతట గొట్టుకొనుచున్నవో చూడు.

ధ— గీ. ధర్మ మొక్కటి గాదు మిత్రంబ! పెక్కు
ధర్మముల్ నిల్పుకోవలె ధరణి నరుఁడు,
ధర్మపథ మలరాజపథంబుమాడ్కిఁ
దథ్యముగఁ జెడు నిమ్నోన్నతములచేత.

కనుక శర్మా! ధర్మనిరూపణము సమష్టిమీఁదఁ జేయవలెను గాని వ్యష్టిదృష్టితోఁ గాదు.

శి—ఇప్పుడు సత్యధర్మమున కడ్డువచ్చినధర్మ మేది?

ధ—మిత్రధర్మము.

శి—నేను నీకు మిత్రుఁడనే కాని యన్యుఁడను గానే!

ధ—రాజా నీకంటెఁ జిరపరిచితుఁడగు మిత్రుఁడు; నీకుఁ జేయనెంచుకొనినసాహాయ్య మతనికి ద్రోహము గాదా?

శి—ద్రోహికి ద్రోహము చేయుట ధర్మము గాని యధర్మమా?

ధ—ఈధర్మాధర్మవిచారణయే సాయాలస్యమునకుఁ గారణము.

శి—చివరకుఁ దేలినదేమి? ఏమి రూఢిపఱుచుకొంటివి? నాకుఁ దోడ్పడుటకా? నీపరిభూత్తమునకు సాహాయ్యపడుటకా?

ధ—నీకుఁ దోడ్పడుటకుఁ గాకున్న, నీకడ కేల వత్తును?

శి—నాయాశ వదలుకొనుమని చెప్పుటకుఁ గాఁగూడదా?

ధ—అయ్యో! ధర్మవైషమ్యమున కవసరము లేకుండఁ, దన్మూలమున నాతోడ్పాటు నీ కక్కఱ లేకుండఁ జేయుటకు సాధ్యమైనప్రయత్నము లన్నియుఁ జేసితిని. కాని యవి వృథా యయ్యెను.

శి—అనఁగా?

ధ—"పరపీడ పాపకృత్యము. నాయ నీకుఁ జేసినయపకార
దు. వారిఁ జెఱఁగొన్న లాభము నీ కేమియు లేదు.
రుల, యట్టిసత్పురుషుల, మనస్సంక్షోభము నిన్ను చె
తత్క్షణమే వారిఁ గారావిముక్తులఁజేసి, కాళ్ళపైఁ బడి,
పంపివేయు" మని పరిపరివిధముల భయపెట్టి, బోధిం
తిని. కాని రాజు మనసు తిరుగలేదు.

శి—ముందు తిరుగునాశయు లేదా?

ధ—ఏమో! ఎవఁడు చెప్పఁగలఁడు? ఇక్కడకు వచ్చి నన్నుఁ
మాటలాడెదనని చెప్పినాఁడు. పర్యవసానమెట్లుండ

శి—ఇక్కడకే! నన్నుఁగూడఁ బట్టుకొని చెఱఁబెట్టుటకుఁగా
నా రిఁక నిస్సహాయులు, నిరాధారులు! కొంపఁదీసి,
వారికుండుసంబంధము, నాక్రూరునితోఁ జెప్పలేదుకద

ధ—అట్లు చేయువాఁ డధర్మాచార్యుఁడు గాని ధర్మాచార్య

శి—మఱి యాతని నిచటికే, మనసంకేతస్థలమునకే యేల రప్పి

ధ—రప్పించుచుండుట లేదు. వత్తు నన్న, రా వలదనిమాత్ర
యనుమానమున కవకాశ మిచ్చుటకాదా? అతని కిదె

శి—ఎప్పుడు వచ్చును?

ధ—ఇప్పుడే, రెండుమూఁడుగడియలలో.

శి—అయ్యయ్యో! ధర్మాచార్యా! వ్యర్థప్రసంగములతోఁ గాలము గడపుచుం
మే! కావలసినవృత్తాంతములను గనుఁగొనివచ్చితివా?

ధ—ఆ!

శి—నన్నడిగినవేనా?

ధ—నీ వ్నడుగుకొనవలసినప్రశ్న నన్నడుగుచున్నావు. నాయందు నీకుండువిశ్వా
సమునుబట్టి ప్రత్యుత్తర ముండును.

శి—మిత్రమా! ఒకమాట! ఇక్కడనే పునస్సమావేశము కాకుండ రాజుచే మి
లినమాట లచ్చటనే యేల యాడింపలేకపోయితివి?

ధ—దాని కుత్తర మీవఱకే యిచ్చితిని. నీకు నచ్చలేదుకాఁబోలు. అనుమా
మతనికిఁ గలుగకుండుటకును, ఇదివఱకే యైనయాలస్య మనావశ్యకముగా
నధికము చేయకుండుటకును, అట్లు చేయలేదు.

శి— క. చెలికాఁడా! నాదుమనః
ఫలకంబును, జక్కఁ, నీదు ♦ వచనము లంటన్,
దోలుదోల్తఁ దుడిచివేయఁగ
వలె సంశయరూపమలిన ♦ పటలం బెల్లన్.

అందుచే నింత నొక్కినొక్కి యడిగితిని; క్షమింపుము.

ధ—క్షమించుటకు నీవు చేసినయపరాధ మేమియు లేదు. కాని వ్యర్థకాలక్షే
ము చేయుచుంటి మని పలికిన నీవే యవతారిక ననవసరముగాఁ బెంచుచు
టివి. రాజు వచ్చుతఱియుఁ దారసిల్లుచున్నది.

శి—రాజామాత్యు లిద్దఱు నెక్కడ బంధింపఁబడిరి?

ధ—ఇదిగో! ఇక్కడ (ఒకయాలేఖ్యము చేతిలోఁ బెట్టును.)

శి—మిత్రమా! నీకు వందనసహస్రములు!

క. నాలుకకుఁ బాణి యిచ్చుట
నేలాగున సాయ మయ్యె ♦ నీశ్వరుకృపచే
నాలాగున సాయముగాఁ
జాలుదు నా కీవు పూన్కి ♦ సఫలముచేయన్.

దీని నిమట్టుననే గుఱుతుపెట్టి గురువర్యునికిఁ బంపెదను. లేఖ వ్రాయుంత
మ విశేషముగా నుండదు. బంధహేతువు కనిపట్టితివా?

ధ—అది ప్రభువువలననే తెలిసికొంటిని.

శి—ఏమది ? రాజ్యకాంక్షా ?

ధ—బ్రహ్మాండమంతరాజ్యమునకుఁ బ్రభువై యుండువానికి దానిపై యాశ యేల పుట్టును? పుట్టినను నెవరో యిద్దఱు పథికులఁబట్టుకొనుటవలననది యెట్లీడేఱును?

క. కనకంబును, గనకాంగియు,
మనుజులమోహాపకృష్ట ॥ మార్గంబులలోఁ
జొనుపు ననుమాట నిజ; మై
నను, ధన మిట బంధకార॥ణము గాదయ్యా !

శి—అట్లయిన హరిహరీ! మీప్రభువు స్త్రీపురుషభేదముఁ గనలేనిపశు వన్నమాట. కామాంధుఁడైనయెడలఁ గాంతలఁ బట్టవలెను, గాని నిరర్థకముగా నిరప రాధులైనమగవారి నేల కారాబద్ధులఁ జేయవలెను?

ధ—దూరాలోచన లేక యేమేమో యనుచున్నావు; వారు మగవారే కాని నిరప రాధు లని యెట్లు చెప్పఁగలవు?

శి—అంతదూరమునుండి వచ్చినవారు చేసిననేర మేది?

ధ—మా రాజును మీరాజును, ఏకఫలాపేక్షులై యుండుటయే.

శి—అదెట్లు ?

ధ—రూపలతారూపగుణాతిశయశ్రవణముచేఁ గలిగినస్మరపీడవలనఁగొంతకాలమునుం డి యస్వస్థచిత్తుఁడైయుండి, పచ్చిన మితపరివారమును వెనుకదిగఁబెట్టి, పాం డ్రకుఁడు తదేకధ్యానముతో నీవనమునకొంటరిగా మొన్నవచ్చినాఁడఁట.

శి—వచ్చి ?

ధ—దూరముగా, నాదమఱచి నిద్రపోవుచున్న యిద్దఱను జూచెనఁట. ఒకఁ కరఁగిపోసినకనకవిగ్రహమువలె క్షాత్రతేజమునఁ వెలుఁగుచుండెనఁట. రెం డవయతఁడు నవయస్కుఁడై బ్రహ్మతేజమునఁ బ్రకాశించుచుండె నఁట.

శి—తరువాత ?

ధ—మెల్లఁగా నడచి సమీపించి చూడఁగా

గీ. బోరగిలి, పడి లేచుచు ॥ బొమ్మ యొకటి
భూపునక్షస్థలంబుపైఁ ॥ బొడవుసూపి ;

మఱియొకటి చెంతనున్న భూ ♦ సుతునిప్రక్క
నొరగి మఱఁగయి చూపట్టె ♦ నుర్విపైని.

ఆ. ఒఱల నిద్రపోవు ♦ నురగములట్లుండె
వారిమొద్దను దర ♦ వార్లు రెండు;
వానిఁ జిత్రపుపుల ♦ వాయు మేల్కొనకుండఁ
జక్క సంగ్రహించె ♦ ధాత్రిభుండు.

శి—మీప్రభు వీవఱకుఁ గ్రూరప్రభువే యనుకొంటిని; జారప్రభువు కూడనా?

ధ—అందొకపటము చూచికొని యాశ్చర్యనిశ్చేష్టుఁడై యుండఁగా, సుప్తుఁడై యున్నసుందరాంగుఁడు ‘రూపలతా! రూపలతా!’ యని కలవరించెనఁట.

శి—అయ్యో! ఎట్టివానికైనను మనోగోపనము స్వప్నసన్నిపాతములలో నసాధ్యముకదా!

గీ. బలిమి జీలుగుబెండ్లను ♦ జలధియందు
ముంచి వదలినఁ దేలి కా ♦ న్పించుపగిది,
నెంతగంభీరహృదయుని ♦ స్వాంతవికృతి
పాళిమైనను గలలందు ♦ బయలుపడును.

ధ—అంత మారాజు తోఁకత్రొక్కినత్రాఁచయ్యెనఁట. ఆశ్చర్యమంతయు నసూయాగ్రహములుగా మారెనఁట. తీసినకౌక్షేయకమునకు మీరాజువక్షు మెఱచేయవలెనని యనుకొనెనఁట. కాని యంతలో మనసు మార్చుకొని గిఱుక్కున మఱలి భటులఁ బంపించి యెట్లున్నవారి నట్లు పట్టించి చెఱఁ బెట్టించెనఁట.

శి—మహీపతితోఁ గారాశిక్ష నొందుటకుఁ బాపము! మంత్రికుమారుఁ డేమిదోషము చేసెను?

ధ—సాంగత్యదోషము తప్ప, నేమియుఁ గనఁబడదు. ఇనుముతోఁగూడ నింగలమునకు సమ్మెటపెట్లు గావా?

శి—ఇట్టిక్రూరశీలుని బెట్టుకొని మీ రెట్లు వేఁగుచున్నారో తెలియదు.

ధ—కేవలము క్రూరశీలుఁడన్నమాట నిజముగాదు. కొన్ని సుగుణములుగూడ నున్నవి.

గీ. పూర్ణదుశ్శీలుఁ డెవ్వఁడుఁ ♦ బుడమి లేఁడు ;
పూర్ణసచ్ఛీలుఁ డౌవాఁడు ♦ భూమి లేఁడు ;
మంచితన మెక్కువగ నున్న ♦ మంచివాఁడు ;
చెడ్డతన మెచ్చుగా నున్నఁ ♦ జెడ్డవాఁడు.

ఆ. పెదవి దాఁటినంతఁ ♦ బెద్దశోఁకును దెచ్చు
వేము పైత్త్యమునకు ♦ విఱుగు డయ్య !
మస్తురుచ్యధవళ ♦ మంజుల మైనట్టి
పెరుఁగు కరము శ్లేష్మ ♦ వృద్ధికరము.

మ. దయ విస్తారము, ధైర్యసంపదయు న ♦ త్యంతంబు, దానంబులో
వ్యయమావిత్త మటంచుఁ గొంకఁ; డిఁక స్నే ♦ హంబందుఁ బ్రాణంబునే
నియు నీయంగలవాఁడు, దోషి యగువా ♦ నిశ్శిక్షితుం జేయుచో
నయమార్గంబును వీఁడఁ ; డిట్టివిభు న ♦ న్యాయంబు దుష్టుం డనన్.

శ—అయ్యయ్యో! ధర్మాచార్యా! ఇసుకతోఁ ద్రాళ్లు పేనఁదలఁచుచుంటివేమయ్యా?

సీ. సుప్త పాంథులఁ జెఱఁ ♦ జొరఁబెట్టు పెట్లయ్యెఁ
గరుణయు నీతియుఁ ♦ గలిగెనేని ?
దొంగపాటున బొమ్మ ♦ లుం గత్తులుం గొనె
నేల భూపతి ధైర్య ♦ శాలియేని ?
నీబోధముల విని ♦ నిరసించె, నది యేల
నీకుఁ బారిణము లిచ్చు ♦ నెయ్యుఁడేని ?
పరులస్వాతంత్ర్యంబు ♦ హరియించు పెట్లయ్యె
నేత నీచెప్పిన ♦ దాతయేని ;

గీ. సాత్త్వికము లైన నీస్తోత్ర ♦ పాఠములకు,
వికృత మైనట్టి నీప్రభు ♦ వృత్తములకు,
గలదు భేదంబు మిగులఁ, జీఁ ♦ కటిని దివ్య
కాంతి యని చెప్పితివి నమ్మఁ ♦ గలనె నేను ?

ధ—దానికేమిలే! కాంతిప్రకోపముచేఁ గూడఁ గన్నులకు గాఢాంధకార మగును. శిష్ట శబ్దమును నమ్మకున్నను, నిజము నిజముగానే యుండును.

శి—నిజముగా నీప్రభువు శిష్టప్రకాండమా?

ధ—శిష్టప్రకాండమును గాఁడు, పరమదుష్టుఁడును గాఁడు. కొన్ని సుగుణము లున్నవి. కాని వానినన్నిటిని గప్పివేయఁజాలుదుర్గుణములు కొన్నియున్నవి. ప్రధానదుర్గుణ మింద్రియలోలత.

శి—ఇంద్రియలోలత యింద్రునంతవాని కిక్కట్లు తెచ్చినదే.

ధ—ఇతనికిమాత్రము లేదని నే నంటినా?

ఆ. ఒక్కగింజవలనఁ బెక్కుబీజము లగు
పగిది, నొక్కగుణమువలన నగు స
జాతిగుణము లెన్నొ; జనియించె నితరవి
కారవితతి పతికిఁ గామమునను.

అంచోటిదైనఁ గంచ మంతయు నోటిదనుట ధర్మముగాదు. స్నేహములో నతని సహనబుద్ధి చూడుము. ముఖముముందఱ నీవు చేయుపని యయుక్త మని చెప్పితిని. దాని కేమియుఁ గోపపడక, యభిప్రాయభేదము లుండవచ్చు నని చెప్పి చిఱునవ్వు నవ్వినాఁడు. ప్రభువని చెప్పి నన్ను విడనాడ లేదు. అనాదరణమును జేయలేదు. ఇది యోగ్యలక్షణము కాదా?

శి—విరుద్ధస్వభావులకు మైత్రి పొసఁగుట వింతగానే యున్నది.

ధ—ప్రకృతియే వింతప్రకృతి. అతఁడు వచ్చువేళ యగుచున్నది.

శి—ఇఁక నేను బోయెదను, ఏలాగుననైన బోధించి యుభయులకు బంధవిముక్తి గావించితివేని నీకుఁ జాలఁ బుణ్యమగును.

ధ—అందులో మనమిరువురము సమభాగులము. ప్రియవాక్యములే కాని హితోపదేశములు కామాతురులతల కెక్కుట కడుఁగష్టము.

(శివ—నిష్క్రమించును. పౌండ్ర—ప్రవేశించును.)

పౌం—మిత్రమా! నాకోసము కనుపెట్టుకొని యుంటివికాఁబోలు.

ధ—ఇఁక గొంతసేపైన నట్లనవలసివచ్చును. కనుపెట్టుకొని యున్నను భృత్యునికది కానిపని గాదే!

పౌం—నీవు భృత్యుఁడవే యైనచో నిటకు నీయొద్ద కేలవత్తును?

ధ—దానితో నన్నుఁ దృప్తిపఱచి నామాట వినక, యథేచ్ఛముగాఁ బ్రవర్తించుటకు. తృణీకృతుఁడైనమిత్రుఁడు భృత్యునికంటెను నధముఁడు గాఁడా?

పౌం—పరాభూతుఁడైనప్రభువుమాట యేమిచెప్పెదవు?

ధ—పరమహితము పరాభవముగా నెంచవచ్చునా? అహితుఁడు చేయునది పరాభవము కావచ్చును గాని స్నేహితుఁడు చేయునది పరాభవమగునా?

పౌం—ఇదివఱకు నీవు చేసినబోధములు సుబోధములే కాని యిప్పటివి కావు.

ధ—దుర్బోధములు చేయువాఁడు శత్రుఁడు గాని మిత్రుఁడు గాఁడు. అట్టివాని యొద్దకు నీవు రాఁగూడదు. వాఁడు త్యజింపవలసినవాఁడు.

పౌం—అట్లు చేయలేకయే యిక్కడకు వచ్చినాను. నాకు సాయముచేయకపోయినఁ బోయెదవుగాని, ప్రతికూలవాక్యము లేల యాడెదవు?

ధ— గీ. కాయికం బగురోగంబు ♦ కటుపదార్థ
భుక్తిచేఁ బోవునట్టులు, ♦ ప్రోత్కటాంత
రంగికామయవితతి య♦డంగఁగలదు
వెగటుగాఁ దోఁచుమిత్రోక్తి ♦ వినుటవలన.

పౌం—నీవెగటుమాటల యనుభవ మున్నది, కాని, రోగములేక విషౌషధప్రయోగము చేయుచుంటివేమో యని నాయనుమానము.

ధ—ఇదివఱకుఁ గామక్రోధము లనురెండుమానసికరోగములే యగపడినవి కాని, యిప్పుడు, రోగముండఁగా నే రోగము లేదని యనుకొనుమూఁడవరోగ మొకటి బయలుపడినది.

పౌం—భావభవరోగము లెన్నియైన నుండవచ్చును.

ధ—అజ్ఞానోక్తమైనను యథార్థమే వెడలఁగ్రక్కితివి. రూపలతాపరిణయకాంక్షయే యన్నిటికి మూలకారణము.

పౌం—నిజమే. కాని యది రోగమని యెట్లనఁగలవు? క్షుత్పిపాసలు రోగములైనయెడల నదియు రోగమగును.

ధ—క్షుత్పిపాసానివారణమునకుమాత్రము యుక్తాయుక్తవిచార మక్కఱలేదా?

పౌం—కావలయును.

గీ. మంచిరంగును రుచియును ♦ మంచిపదను
గలఫలంబును మెసఁగి యాఁ♦కటిని దీర్చు

కొనెడు మాణిక్యాని, దమిఁ దీర్చు ♦ కొనఁగవలయు
నుజ్వలాకారసుందర ♦ యువతిఁ గలసి.

గీ. తియ్యనులివెచ్చపాల్ద్రావి ♦ తృష్ణవలనఁ
గలుగుతాపముఁ దీర్చుకోఁ ♦ గలిగినట్లె,
వలపుఁదాపము వాపుకో ♦ వలయుఁ గలికి
యధరమధురామృతపుటూట ♦ లాని యాని.

ధ—ఇంత నీతికోవిదుఁడ వని యీవఱకుఁ దెలియకపోయితిని. అచేతన ఫలమువలె చేతనఫలమును సంగ్రహింప నెంచితివా? అనుభవించుటకుఁ బూర్వ మంగీకారమావశ్యకము గాదా?

పొం—అది సులభ మార్గము. ఆమార్గమునకు రాలేదు కనుక మార్గాంతరము పట్టితిని. రాయబారము లైనవి. తర్జనతంత్రము లైనవి. కార్యములేకపోయెను. వివాహప్రయత్నములు వేళాకోళములలోనికి, విగ్రహవార్తలలోనికి దిగినవి.

ధ—అన్యమార్గము పట్టుటకుమా అన్యకన్యాన్వేషణము చేయరాదా? మహారాజవు సకలసంపత్సమృద్ధుఁడవు. ప్రపంచము విపులము. కాంతాసంతతికిఁ గఅవు లేదుకదా!

పొం— ఆ. మనసు వచ్చినట్టి ♦ మహిళావతంసంబు
తనువుఁ దనువుఁ జేర్చి ♦ తనియవచ్చుఁ;
గాని దాని దీని ♦ గాఢపరిష్వంగ
కలనఁ దృప్తినొందఁ ♦ గలనె నేను?

ధ—నీకు మనసువచ్చినది సరేకాని, యావలివారికి రాలేదే?

పొం—అందుచేతనే యీబాధ. ప్రస్తుతబాధ భావిసుఖకారణము గనుక నది బాధయేకాదు.

ఆ. సుకరముగ లభించు ♦ సుందరిపొందున
వచ్చుసుఖముకంటెఁ ♦ బడఁగరాని
కష్టములను బడుచు ♦ గడియించుకొన్నట్టి
పడుచువలనిసుఖము ♦ పరమసుఖము.

ధ—పడుచుకై నీ చిన్నిపాప్లయినఁ బడవచ్చును గాని, పాప మాబాటసారుల నేల బంధించి బాధపెట్టుచున్నావు?

పౌం—పరమచ్ఛాందసునికిఁ బ్రత్యుత్తరమిచ్చుట బ్రహ్మకైనఁ దరము గాదు. ఇంతకుమును పక్కడ జవాబుచెప్పినప్రశ్నయే పునరుక్తముగా వేయుచున్నావు.

గీ. మధువుకై మధుమక్షికా ♦ మారణంబు;
మంచినిద్రకు మత్కుణ ♦ మారణంబు;
మస్తకసుఖంబుకై యూక ♦ మారణంబు;
మగువబిగికౌఁగిటికిఁ బాంథ ♦ మారణంబు.

ధ—హరి హరీ! ఎంతమాటంటివి? కారాగృహబంధమే కాక, మారణకృత్యము కూడఁ గానున్నదా?

పౌం—ఆవశ్యక మైనయెడల.

ధ—పాపభీతియుఁ, బరలోకభీతియు, దైవభీతియు లేవా?

పౌం—ఈయవసరమున రూపలతాశ్లేషభీతిదక్క మఱి యేభీతియు లేదు. పాపభీతి కిచటఁ బాపమేది?

ధ—జీవహింస పాపము గాదా?

పౌం—నాకొక్కనికేనా? అందఱకు నా?

ధ—అందఱకును.

పౌం—అట్లైన నఖిలప్రపంచకర్త యనియు భర్త యనియు, నీవుచెప్పు నాపరమేశ్వరునకును!

సీ. సుందరవృక్షము ♦ లుసుందరపక్షులు
సుందరమృగములు ♦ సురుచిరాంగు
లైనస్త్రీపూరుషు ♦ లయ్యయ్యొ! మడియుట
యే కాని యొకటేని ♦ యిల నిలఁబడి
యుంట చూడముగదా! ♦ యునుజీవహింసకు
నింతకు నొండుదృ ♦ ష్టాంత మేది?
యాత్మజహత్యకు ♦ నధికమౌజీవహిం
సాపాతకము ప్రపం ♦ చమున లేదు.

గీ. ప్రాణములకంటెఁ దీపి యెం ♦ దేనిఁ గలదె?
కన్నబిడ్డలసుఖము దుః ♦ ఖంబె తనకు?
సంతతిని గూర్పఁ బుణ్యమై, ♦ స్వసుఖపరత
భ్రాతలను జంప నది యెట్లు ♦ పాపమౌను?

ధ—దైవదూషకుని మిత్రుఁడ నై యుండుట నా ప్రారబ్ధము.

హాం—అట్టి దొకటి యున్నయెడల, సత్యనిరసనునిసావాసము చాలించుకొనలేకుం డుట నా ప్రారబ్ధము.

ధ—పరలోకమునఁ బాపశిక్షకు వెఱవనా? పుణ్యఫలమున కాశింపవా?

హాం— సీ. శిశుకుఁ డొనరించు ♦ చేఁతలే చేసిన
వాఁ డెట్లు శిశుకుఁ ♦ బాత్రుఁ డగును?
ఋజుమార్గవర్తిగాఁ ♦ డీశుం డనుటకంటె
లేఁ డతం డనుటయే ♦ లెస్స సుమ్ము,
పరలోక మనున ద ♦ ప్రత్యక్ష మాటచే
సత్యంబుగా నెంచఁ ♦ జనదు దానిఁ,
దత్పృథుసుఖవాంఛ ♦ ధర సుఖలేశముల్
విడనాడుకొను టది ♦ వెఱ్ఱితనము,
ఆ. చచ్చి చూచి మఱల ♦ వచ్చి మనకుఁ జెప్పి
నట్టివాఁ డొకండు ♦ నవని లేఁడు;
కనఁగరానిచిలుక ♦ కదుపును నమ్మి చేఁ
దవిలినట్టిచిల్క ♦ నెవఁడు విడుచు?

పరలోకమే యుండి శిక్షయే తప్పనియెడల, నిక్కడిసుఖమునకు నక్కడి దుఃఖమునకు సరిపోవచ్చును. లేనియెడల నిక్కడ సుఖశూన్యము. అక్కడ సర్వశూన్యము.

ధ—తెంటిఫల మొక్కటిగానే కనఁబడుచున్నదే! నీమతమున నిఁక మంచిచెడ్డ లను మాటయే లేదుకాఁబోలు,

పౌం—లేకేమి ? అవి దేశకాలములనుబట్టియు, మనుష్యుల బుద్ధులఁబట్టియు మాఱుచుండును. నామంచి నీకుఁ జెడ్డ. ఇప్పటిచెడ్డ యప్పటిమంచి.

ధ—అట్లైన మంచికిఁ బ్రవృత్తి యెట్లు కలుగుచున్నది ?

పౌం—ఇహలోకభీతిచేతఁ, బరలోకభీతిచేతఁ గాదు. యథార్థప్రత్యక్షశిక్షాభయముచేతఁ, గల్పితపరోక్షానుభూతివలని జంకుచేఁ గాదు.

ధ—పోనీ ! ఆభీతియే నీకుండఁగూడదా ?

పౌం—నాకంటె బలవంతుఁడును, నాకు శాసకుఁడును నున్నయెడల నట్లే.

ధ—నీవే సర్వశాసకుఁడ వని నీయభిప్రాయమా ?

పౌం—అభిప్రాయముమాత్రమే కాదు.

ధ—ఆహా ! అహంకారదేవతాప్రభావము ! ఓసర్వశాసకా ! రూపలతను శాసింపలేక స్మరతాపముచే నేల సన్నగిల్లుచున్నావు ?

పౌం—(నిట్టూర్పుతో) అబ్బా ! మర్మభేదనమైనపోటు పొడిచితివి. నారాజ్యములో నేను సర్వశాసకుఁడ నఁటిని. ఆమె యన్యదేశవాసిని, (తనలో) హా రూపలతా !

శా. నాకాయంబును, నావయోబలములు, ♦ న్నా రాజ్యవిత్తంబులున్
నీకర్పించి సుఖాబ్ధిఁ దేలఁగలన ♦ స్త్రీవేరిచ్ఛలో నుండ, నా
యాకారంబున కేవగించుకొని శౌ ♦ ర్యశ్రీని నావంతయున్
గైకోకుండఁగ గేలికొట్టి ననుఁ జు ♦ ల్కంజేయ నీకొప్పునే ?

ఆ. తమకుఁ దామె వచ్చి ♦ తరుణులు వలపుతోఁ
బరిణయంబుఁ గోరు ♦ ప్రభువరుండు
జాణయైనయొక్క ♦ చపలాక్షిదృష్టికి
గడ్డిపరకపాటిఁ ♦ గాకపోయె.

కానిమ్ము ! రూపలతా ! నన్నుఁ గాదని యెక్కడకుఁ బోయెదవో చూతము.

క. ఎటనుండువానికో సి
పటముం బంపితివి; మూక్ర ♦ పకు నోయుండే
యిటఁ బ్రక్క నుండఁ భూపతి ?
కుటిలాలక ! భక్తి నుంచు ♦ కొని సిచేతల్.

ధ—సంధ్యారాగలిప్తశ్యామలాంబరమువలె ముఖము పెట్టుకొని యేమో గొణఁగు కొనుచుంటివి.

పౌం—ఏమైననేమి ?

క. వలపో కోపమొ యీసో
తెలియదు సుమి! మానసంబు ♦ దేహముతోడన్
సలసలఁ గాఁగుచు నున్నది,
మొలఁత లభింపకయయున్న ♦ మృతిపాలౌదున్.

ధ—తెలియుచునే యున్నది. రూపలతపై వలపు. అనాదరణముచేఁ గోపము, అన్యాదరణ మున్నదేమో యని యీర్ష్య—ఈమూఁడును నిన్ను దహియించుచున్నది.

పౌం—అత్రేతాగ్నులలోఁ బడి దగ్ధుఁడఁ గాకుండ నీవలఁ బడుటెట్లు ?

ధ—రూపలతయాశ వదలుకొని.

పౌం—జీవితాశ వదలుకొనుటకైన సిద్ధుఁడనై యుందును గాని, యది చేయలేను.

ధ—ప్రాణములకుఁ దెగించినయెడలఁ బ్రస్తుతస్థితిలో నున్నను బాధలేదే !

పౌం—అన్యాదరణముచేఁ గలిగినయగ్ని—ఈర్ష్యాగ్ని—అయ్యో! నన్ను మలమల మాఁడుచుచున్నది. వాఁడు చేసినపుణ్యమేమి? వీఁడుచేసికొన్నపాపమేమి?

ధ—రాజా! నీమతమునఁ బుణ్యపాపములు లేవుగాదా?

పౌం—రూపలతయాదరణమే పుణ్యము. తదనాదరణమే పాపము.

ధ—నీయెడల ననాదరణసూచన లున్నవి సరే కాని, యట నాదరణ మున్నదెట్లు నిర్ధారణ చేసినావు.

పౌం—నిర్ధారణ నిరాధారము గాదు.

ఆ. ఎంతదవ్వొ నడచి ♦ యేతెంచి యతఁడుండెఁ,
జిన్నెలాఁడిపటము ♦ చెంత నుండె,
దాఁప నేల ? చక్కఁ ♦ దన మెచ్చుగా నుండె,
నింతిపేరు కలవ ♦ రింత నుండె.

ధ—ఆతనికి నిద్రలోఁ గలవరింతలు గాని, నీకవి జాగ్రదవస్థలోనే వచ్చుచున్నవి గాదా ?

పాం—భావిసుఖాపాదకము లైనయతనికలలకును నాకలలకు నెంతో భేద మున్నది.

చ. కలలను నాకు నాకలికి ♦ గన్పడుఁ గాని, స్మితపరిపన్నమం
జులవదనారవింద యయి ♦ చూడక, భూరికుటుల న్భయావహాం
బులగురుపాన్ఫులింగపరి ♦ పుష్టదృశాళులు గ్రక్కు; నాకు రూ
పలత సుషుప్తులం దురగ ♦ భామినికై వడిఁ దోఁచు నయ్యయో!

ధ—ఆయురగకన్యను విసర్జింపక యేల ముద్దాడఁదలఁచెదవు?

పాం—ఇద్దఱ కురగకన్యగా లేదు. నాకు విషముగ్రక్కు నాగకాంత, యామహా భాగునకు భోగినీ కాంత.

ధ—నీకంటె నతనియెక్కువ గనఁబడదు. నీయంతబాధయు నతఁడు పడుచుండ వచ్చును. నీకు లేనికారానివాసబాధ యొకటి యతని కధికముగాఁ గా న్పించుచున్నది.

పాం—రూపలత కాతనిపై ననురాగ మున్నదని యీయవస్థహృదయము చెప్పు చున్నది. కారణమేమో తెలియదు.

ధ—అనురాగ మున్నను, హేతు వెవఁడు చెప్పఁగలఁడు?

మ. ధనముం జూచి యొకర్తు, దేహబలము ♦ న్దర్శించి యొక్కర్తు, బు
ద్ధినివీక్షించి యొకర్తు, శీలకులము ♦ ల్దృష్టించి యో, ర్తందముం
గని యొక్కర్తు, నడ లున్నతు ల్గనిమఱొ ♦ క్కర్తు, న్విరాళింబడున్
వనితాప్రేమకుఁ గారణం బిదని చె ♦ ప్పం జాలఁ గష్టం బగున్.

కొన్నికొన్నిపట్ల కోమలాంగుల యనురాగము నిర్హేతుకముగాఁ గూడఁ జూ పట్టును.

పాం—మనకుండుమైత్రివలెనే! రూపలత కట్టి నిర్హేతుకజాయమానకటాక్షమైన నామీఁద రారాదా?

ధ—దానికి నేనేమి చెప్పఁగలను? పోయి యామె నడుగరాదా?

పాం—అట్లడుగుట కవకాశ మున్నయెడల, ని న్నేల యడుగవలసివచ్చును?

ధ—నన్నేమి చేయుమనెదవు?

పాం—అదియే నే నిన్నడుగుప్రశ్న.

ధ—నేఁ జేయుమన్నట్లు చేసెదవా?

హేం—చెవికిఁ జిత్తమునకు నచ్చినయెడల.

ధ—చేయనని యనిపించుకొనుటకా చెప్పమనుచున్నావు?

హేం—అబ్బబ్బా! అదేమో పైకి రానీయవయ్యా!

ధ—త్రికరణశుద్ధిగాఁ జెప్పుచున్నాను. ఆయుభయులను విడిపింపుము.

హేం—ఇది నీవు చెప్పుటయు నేఁ జేయననుటయు నీవఱకే యైనదే!

ధ—ఇప్పుడు చిత్తవృత్తి మాఱవచ్చు నని చెప్పితిని.

హేం—మాఱలేదు సరికదా! మఱింత పట్టుదల హెచ్చినది. విడువు విడువు న నెదవుకదా, విడిచిన వీనిహృదయతాప మెట్లు చల్లారును?

ధ—విడువకున్న నెట్లు చల్లారును?

హేం— గీ. లేమ నను వరియింపఁగా ♦ లేదటంచు
నొక్కతాపము, మనసు మ ♦ ఱొక్కనిపయిఁ
దగిలియున్నది యనుమహా ♦ తాప మొకటి;
యందు నొకతాపమైనఁ జ ♦ ల్లారుఁ గాదె!

గీ. క్రమముగా రూపలత పాదు ♦ కడకుఁ బోయి
పాఁతుకొనియుండఁ దలఁచెదు ♦ పాదువంశ
దండమును దానికిం గడు ♦ దవ్వుగాను
బెట్టినను, దీఁగ దానిని ♦ జుట్టుకొనదు.

ధ—ఇదివఱకే దూరముగ నున్నదానిపైఁ బ్రాఁకి యల్లుకొని తనవైపునకు వంపు న్నదనుచుంటివే!

హేం—అట్లయినఁ గర్తవ్య మొక్కటే!

ధ—ఏమది!

హేం—అవలంబచ్ఛేదనము.

ధ—దానితో లతాచ్ఛేదనముకూడ నగును.

హేం—అయిన నగుఁగాక!

ధ—ఇదా! నీయనురాగస్వభావము!

గీ. కడు నధమమైనకాయిక ♦ కామమునసె
వర్తనము సేయుపశుపక్షి ♦ వర్గమందుఁ
బోతు తక్కినపోతులఁ ♦ బొడుచుఁగాని,
పెట్ట గిట్టించుటకుఁ దల ♦ పెట్టదయ్య!

నీవు పశువుల తలఁదన్నిన పశుప్రవరుఁడువలెఁ గాన్పించుచున్నావు.

పౌం—రూపలత నట్టేపెట్టినను, నప్పుడే పేర నామె నర్ధాంగలక్ష్మిని జేసికొన్న యాపృథ్వీరూపుఁడను రాజకంటకమును మాత్రము కడ తేర్పక మానను.

ధ—అతఁడు బ్రతికియున్ననే నీకు లాభమేమో!

పౌం—లాభ మెట్లు?

ధ—రూపలతకుఁ బృథ్వీరూపునిపైఁ బ్రేమ యనిగాదా యంటివి.

పౌం—ఔను! అది యతనికి లాభము.

ధ—అట్టివానిని గారాబద్ధుని జేసితి వని వినినయామెకు నీమీఁదఁ గోపము రాదా! అసహ్యత గలుగదా?

పౌం—అది యిదివఱకే కలిగినది.

ధ—ఇదివఱకున్నది మఱింత హెచ్చును. అట్టివానిని జంపిన, నామెయేవకు మేరయుండునా?

పౌం—చంపననుకొమ్ము. చెఱనుండి విడుగడ చేసెదననుకొమ్ము. రూపలత నాకు వశవర్తినియగునా?

ధ—ఆదేవరుచెప్పఁగలరు! అన్యవిధముగాఁ జేసిన నామెకుఁ బుట్టురోఁతకంటెఁ దక్కువరోఁత యుండునని తప్పక చెప్పవచ్చును. ప్రత్యుపకారమున కవధియెక్కడ? అది మనుష్యప్రకృతి ననుసరించి యుండును. కృతజ్ఞతఁ జూపుటకై ప్రాణము లిచ్చినవారున్నారు. మృదులస్వభావ లగుస్త్రీలు మేనొసంగుట యసంభవమని యెంచలేము. పృథ్వీరూపుని పెండ్లాడెద నని రూపలత కేవలము వాగ్దానముచేసినట్లు వినలేదుకదా!

పౌం—ఆఱిపోవుచున్న యాశాగ్నిని మఱల రగుల్చుచున్నావు. కాని యీపిశాచము—పృథ్వీరూపపిశాచము—వదలు టెట్లు?

ధ—అది వదలిన నాశాపిశాచముకూడ వదలు ననియేకాదా యీభయము?

పౌం—నిర్బంధించిన, నాకు రూపలత యక్కఱలేదని తిరిగిపోఁడా?

ధ—ప్రయత్నించి చూడుము.

(పౌండ్రకుఁడు నిష్క్రమించును.)

గీ. ఓసి కామాంధకారమా! ♦ యోసి యాస!
మీరుభయులును బురుషుని ♦ జేరిరేని,
బుగ్గియగు బుద్ధి కన్నులు ♦ బొత్తవడును,
దాటుమాఱయి కాన్పించు ♦ ధరణి యెల్ల.

గీ. రూపలత నవ్వి, ఛీ, యని ♦ రోఁతపడెను
తనకొఱకు వైరి, నోటిముం ♦ దటిఫలంబు
విడిచి భయమునఁ బోవు న ♦ న్వెఱ్ఱిభ్రాంతిఁ
బరుగుపరుగునఁ జను నయో! ♦ పౌండ్రకుండు.

ఆహా! జీవయాత్ర యెంతవిచిత్రము! యుక్తప్రవర్తకుల కెంతకష్టము! శివశర్మకు నేనిచ్చినమాట నిలుపుకొనుటకు యావచ్ఛక్తియు వినియోగపఱచితిని. కార్యము లేకపోయెను. లేకపోవుటేమి? చంపఁడని యనుకోవచ్చును గాదా! కారావిముక్తి గాకున్నను బ్రాణవిముక్తి యుండదు. అంతవఱకే సంతోషింతము. జరుగుచర్యలలో నాకుఁ దెలియు సమస్త మొప్పటికప్పుడతనికిఁ జెప్పుటకంటె నేనాకారాబద్ధులకుఁ జేయఁగలయుపకారమేమియు లేదు.

(నిష్క్రమించును.)



శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# రూపలత.

## చతుర్థాంకము.

పరిదేశము—కారాగృహము.

పరివేశము—పృథ్వీరూపుఁడు, దూరదర్శి.

పృ—ఏమిది దూరదర్శీ! ఇండ్లయొద్దను లేక, యిల్లాంద్రయొద్దను లేక, మధ్యమార్గ మున నిట్లయితిమి.

దూ—మహాప్రభూ! నామాట వినకపోయితిరి. తగుసేనతో వచ్చిన, నీయవస్థ తటస్థింపకపోవునుగదా!

పృ-మిత్రమా! వట్టివెఱ్ఱిగాని, యవశ్యానుభోజ్యమైనయవస్థ యనుభవింపకతప్పునా?

దూ—అయినను నీవ్యాకులవాక్యము లేల యాడెదరు?

పృ—ఇది రామానందుఁడు పన్నినమాయపన్నుగడ కాదుగద!

సీ. పరిణయ మాడన ♦ న్వ్రతము భంగము చేయ
వచ్చి నాకొకచిత్ర ♦ పట మొసంగి
వైరాగ్యమును సుంద ♦ రీరాగముగ మార్చి
యంగన నొప్పింతు ♦ నంచుఁ జెప్పి
రాజ్యంబు మంత్రిక ♦ రంబునఁ బెట్టించి
యధిపు నొంటిగ రమ్ము ♦ టంచుఁ జెప్పి
దారిలో నీయూరఁ ♦ దనశిష్యు నొకని సా
హాయ్యంబుకై యుంతు ♦ నంచుఁ జెప్పి

ఆ. చెప్పినట్టి వసిష్ఠ ♦ చేయించి నాచేతఁ
బడఁతినెలవుదరికి ♦ వచ్చుతఱిని

మోసపుచ్చి పెపవి । ముందటినాపాల
గిన్నె నేలఁ గూలఁ । దన్నినాఁడె ?

ఏమనెదవు, దూరదర్శీ ?

దూ—నేను మీతో నేకీభవింపలేను. విపులప్రపంచానుభూతి గలిగినమా తండ్రి సుమంత్రుఁ డట్టివానిఁ జేరఁదీయఁడు. రామానందుఁ డట్టిపని చేయువాఁడు గాఁడని దృఢముగా నమ్మవచ్చును. మా తండ్రి రాజభక్తి గలవాఁడనుమాట యథార్థమగునా కాదా ?

పృ—అట్లడిగెదవేమి ?

దూ—మాయ యెప్పుడును సప్రయోజనమై యుండును. మిమ్ము మీరాజ్యము నుండి తొలఁగించి యీరాజ్యము మాతండ్రికిఁ గట్టిపెట్టఁదలఁచుకొన్ననే మీయనుమానమున కాధార ముండును.

పృ—రామరామా ! ఎంతమాటంటివి ?

దూ—నిజమైనకారణముఁ గనుఁగొనుటకు నన్నికారణములు ననువదించుకొని పరికింపవలెనుగాదా !

పృ—ఈకారణము భావించుకొని పరిశీలించుట పరమపాపము. అంతవిశ్వాసపాత్రుఁడైనమంత్రి యట్టిదురాలోచనము చేసినాఁడనిన, నన్ను నేనే నమ్ముకొనఁదగదు. చేసిన సావృద్ధుఁ డెవరికోసము చేయును ? నీకొఱకు ? నీవు నాతోఁ జెఱఁబడియున్నావే !

దూ—వంచనహేతు వన్యమేమున్నది ?

పృ—నాకేమియుఁ గనఁబడుట లేదు.

దూ—మనల బంధించినరాజు రామానందునిశత్రువుగాని మిత్రుఁడై యుండఁడు.

పృ—భటులఁ దీసికొని రాక ప్రచ్ఛన్నముగా రమ్మని యేల చెప్పినాఁడు?

దూ—అదియే నాకు నచ్చలేదు. అట్లు చేయఁగూడదని బయలుదేఱునప్పుడే చెప్పినాను.

పృ—అట్లు చెప్పుటలో నాతనియుద్దేశ మేమైయుండవచ్చునో !

దూ—ఏకకాంతా పేక్షులై యనేకభూపతు లుండవచ్చును, రహస్యముగాఁ బ్రయాణము చేసిన, నట్టిపరరాజులబాధ మీకుఁ దగులదని యూహించి చెప్పియుండవచ్చును.

పృ—ఎంతప్రచ్ఛన్నముగా వచ్చినను బయలుపడితిమే !

దూ— గీ. దినకరోమసుతూత్ర • తేజ మెట్లు
లడఁగియుండుఁ బ్రకాశితం • బౌను గాని?
ప్రోజ్వలాగ్నిని గుడ్డలో • మూటగట్ట
నడఁగి పడియుండునే పైకి • వెడలుఁగాని.

వృ—బ్రహ్మతేజము వల్లే, కాని యీవహ్నిద్వయమును బ్రస్తుతము కారాచ్ఛాదిత ములై యున్నవి.

దూ—పరమాత్మనికృపచేఁ గారాచ్ఛాదనముఁ గాల్చిరోజును రావచ్చును.

వృ—ఎప్పుడో యెట్లో? ఇది యొకచిత్రబంధనముగా నున్నది.

గీ. క్రోశదూరముచుట్టు సు • రుచిరపుష్ప
ఫలమహీరుహాసుందర • పక్షిమృగవి
తానములతోడ నొప్పును • ద్యానవనము
గలది చెఱసాల యెట్లు కాఁ • గలదు సఖుఁడ?

గీ. ఆఁకలియు డప్పి వాపుట • కవనిపతుల
కర్హమౌ దివ్యవస్తువు • లమరి యుండె;
గమ్రశయ్యాసనములు మే • ల్కట్టు లుండె;
నెట్లు కారాగృహం బగు • నిది సఖుండ?

దూ—చుట్టు నింగిముట్టునట్టున్నయున్నతశిలాకుడ్యావరణముమాటయేమిచెప్పెదవు?

వృ—అదే మనకు దుఃఖకారణముగా నున్నది.

ఆ. తలఁపు దాఁటునాత్మ • తగిలి మాయోపాధి
స్వేచ్ఛఁ దొలఁగునట్టు • లిరువుర మిట
స్వైరితాసుఖంబుఁ • బడయులేకున్నాము
చూడఁ గనులుదిరుగు • గోడచేత.

మనకత్తులుఁ గన్యాపటములుఁగూడఁ దీసికొనిపోయినాఁడే దుర్మార్గుఁడు!

దూ—అవి గోడదాఁటుట కుపయోగించును. కత్తులు దీసికొనుట కాతరుఁడని తెల్పుచున్నది.

వృ—పటచౌర్యము ?

దూ— క. నాపటమూలంబో యిఁక
నీపటమూలంబొ ధారి ♦ ణీపతికిం గా
మాపాదక మయ్యె ననుచుఁ
జూపెడుఁ జిత్రములు రెండు ♦ సురుఁగుట భూపా !

వృ—అంతవఱకు నౌకరి విడిచి యొకరు నిద్రపోవుచుండు మన మప్పు డొకసారి యే నిద్రాపరిమత్తుల మై పడిపోవుటచేతఁగదా యీస్థితికి వచ్చితిమి!

దూ—శివశర్మనుగూడ నుండుమనియైనఁ గోరినాము గాముకదా !

వృ—ఇట్లు జరుగనున్నప్పు డట్టిబుద్ధి యెట్లుపుట్టును ? హా రూపలతాపటమా!

గీ. నిన్ను నామీఁదఁ బెట్టుక ♦ కన్నుమోడ్చి,
నాయురముపయి నానలి ♦ నాయతాక్షి,
యీమనోహారిణియె, యుండె ♦ నంచు నెంచి,
పోయితిని నిద్ర, నాకెంత ♦ మోస మయ్యె !

గీ. "ప్రభువు నన్నుంచుకొనెఁ బ్రాణ ♦ పదముగాన
టంచు గర్వింప కోసిబో ♦ మ్మా! యిఁ కెన్ని
నాళ్లు నీభోగ ! మాకొమ్మ ♦ నాదియైన,
గోడ నొకమూల నీవువే్రి ♦ లాడుచుందు !"

క. అని నిన్నుఁ జులుకఁ జేసితి
నని నాపై నలిగి, వీడి ♦ యన్యనిహస్తం
బునకుం జని పగసాధిం
పను న న్నీకారయుంచు ♦ బంధించితివే ?

దూ—మిత్రమా ! దుఃఖింపకుము ! ఉరముపై స్థూలపటము పోయినది కాని, యు ల్లములోని సూక్ష్మవిగ్రహ మెక్కడకుఁ బోయినది ?

వృ—నాధైర్యముకూడ సూక్ష్మమగుచున్నది.

గీ. పాడుచేతుల నొసఁగి దై ♦ వంబ! మమ్ము
మనుజులను జేసితివి గాని, ♦ మంచితెక్క-

లిచ్చి యిచ్చుకు వచ్చిన ♦ శ్లైగురంగల్లు
చిన్నివిహాగంబులుగ నేల ♦ చేయవైతి?

దూ—మనను దిట్టపఱచుకొని విమోచనమార్గము వెదకవలయుం గాని, యపస్మార
సంభాషణమువలన లాభ మేమియు లేదు. మనము పక్షులమైన నావలివా
రును బత్తులు గాపలయును. మనుష్యులకు మనుష్యబాధ యున్నంబత్తుల
కుం బరపక్షిబాధ గలదు. మనకుం గారాబంధమైన, వానికిం బాపము!
పంజరబంధము. సృష్టి పాక్షికసృష్టి గాదు.

పృ—మనకు విముక్తిసుఖ మెన్నండైన వచ్చునా?

దూ—కారాకష్ట మెట్లువచ్చినది?

పృ—మనదురదృష్టమువలనను, శత్రువులవలనను.

దూ—తక్కినది మనయదృష్టమువలనను, మిత్రులవలనను లభింపంగలదు.

పృ—మన కదృష్టముకూడనా?

దూ— గీ. ఉచ్చగతియు నధోగతి ♦ యున్న వల్ల
సూర్యునంతటివానికి; క్షో ♦ ణి మాన
వునికి వంశంబునకు దేశ ♦ మునకు నేక
సరణిగాం గాల మెన్నండు ♦ చనదు చనదు.

గీ. పగటితరువాత నిశ, తరు ♦ వాతం బగలు,
వెన్నెలలవెన్కం జీంకట్లు ♦ పిదప జ్యోత్స్న;
లీవరుస సుఖదుఃఖంబు ♦ లెనయు నరుండు,
కనుక దుఃఖంబె శాశ్వతం ♦ బనంగం జనదు.

పృ—ఏమోకాని! యీచెఱలో నున్నమూండునాళ్లు మూండుయుగములుగాం గా
న్పించుచున్నవి.

దూ—కష్టస్వభావ మట్టిదే. కారాసేవకులుగూడ వారివారిపనులు నెఱవేర్చుకొని
పోవుటయే కాని పలుకరించినను బలుకకున్నారు.

పృ—దుష్టరాజు వారికిచ్చినయుత్తరువు లట్టివికాంబోలు.

(పౌండ్రకుండు ప్రవేశించును.)

పౌం—పలుకరింపకుండంబలుకుసంతోషము మీకిచ్చుటకే నీండు వచ్చినాండు.

అతఁడు దుష్టుఁడో యుపకారియో మీరిచ్చుప్రత్యుత్తరములఁబట్టియుండును.

పృ—ఉపకారి యగువాఁ డుత్తములఁ జెఱసాలలో నెన్నఁడు పెట్టఁడు.

దూ—చోరకృత్యములు చేయుట కంతకంటెను దిగింపఁడు.

పౌం—బంధములలో నున్నవారిని బంధవిముక్తులఁ జేయుటకు వచ్చినవాఁ డుపకారియా? యపకారియా?

పృ—బంధించినవాఁ డితరుఁడైన నుపకారియే.

పౌం—కాకున్న?

దూ—కొన్నాళ్ళుపకారము చేసి, తరువాత మానినవాఁడు.

పౌం—ఇంకను దీర్ఘకాలము బాధపెట్టుట యుడిగినపుణ్యా మతనిదిగాదా?

పృ—కావచ్చును. చేయఁదలఁచుకొన్నపుణ్యము చేసి చెప్పరాదా?

పౌం—చెప్పి చేయుటకు వచ్చినాను.

దూ—చెప్పుటయైనది కనుక నీకఁ జేయవచ్చును. నీవేనా యీరాజ్యమునకధిపతివి?

పౌం—అనలము నడుగకుండనే తెలిసికొనవచ్చును.

పృ—ఓహో? ప్రపంచానలమా!

గీ. పరులఁ బీడించుపట్టున • వహ్ని వౌదు,
కాని వర్చస్సుఁ గాంచినఁ • గావు సుమ్మి!
వహ్నిధూమంబ వనవచ్చు • వర్ణపటిమ,
నొడ్డుపొడుగుల బలమె నీ • కున్న బలము.

పౌం—ధైర్యపటిమ పైకగపడునది కాదు.

దూ—ఔను మహారాజా! అది కార్యరూపమున నగపడును. చోరకార్యరూపమున—మనపటములును గత్తులును నెట్లు మాయమైనవో యెఱుఁగవా?

పృ—దొంగతనము రాజలక్షణము గాదే!

పౌం—రాజచంద్రమా! దాని కేమిలే.

గీ. అల్పతిసొత్తును హరియించు • నతఁడు దొంగ,
రాజ్యమును దోఁచుకొనువాఁడు • రాజమౌళి;
యపహృతార్థపుటాధిక్య • మల్పతయునె
క్షితిపతుల, దొంగవారిని • జేయు నవ్వి.

పెద్దదొంగతనము రాజధర్మము. చిన్నదొంగతనము చోరధర్మము. అతఁడు శిక్షకుఁడు. ఇతఁడు శిక్షార్హుఁడు. లోకవిపరీతములలో నిదియొకటి.

దూ—సొత్తుగలవారు గాఢసుప్తిలో నున్నప్పుడు వచ్చి దాని నపహరించి, మేలుకొలిపి చెప్పకుండఁ జేబులోఁ బడవేయుట మహారాజలక్షణము.

పౌం—మీరాజిప్పు డన్నట్లది చేసి చెప్పితిని. పటములు మీసొత్తని యెట్లు చెప్పఁగలరు?

దూ—మా యొద్ద నున్నవి మా సొత్తు గాక యెవరిసొత్తగును?

పౌం—ఇప్పు డవి నాచెంత నున్నవి గనుక, నాసొత్తనుకొనవచ్చును.

దూ—చోరుఁడనుకొనునట్లే. శిక్షించుతఱి వచ్చినప్పు డాయనుకొనుట లేదో తెలియును.

పౌం—శిక్షించువాఁ డెవఁడు?

పృ—పైనున్న భగవంతుఁడు.

పౌం—పైనున్నవాఁ డడుగునకు రాలేఁడేమో!

పృ—ఓరీ! పాపప్రలాపా! రాలేకేమిరా! సర్వాంతర్యామికిఁ గ్రిందేమి? మీఁదేమి?

పౌం—అట్లైనఁ గ్రిందుమీఁదెఱుఁగని మీతలక్రిందు దైవమే నాలోనుండి యింత పనియుఁ జేయించి మిమ్ముఁ గారాబద్ధులఁ జేసినాఁడు.

దూ—ఓరి నీచుఁడా! నీదుష్టబుద్ధికి దేవుఁ డెట్లు కారకుఁడురా?

పౌం—(నవ్వుచు) అటుకాదేని దుష్టసృష్టికర్త యనియు శిష్టసృష్టికర్త యనియు నిద్దఱు దేవు లున్నారు కాఁబోలు. వా రెప్పుడు నేను మీరును దగవులాడుకొనుచున్నట్లే దెబ్బలాడుకొనుచుందురు కాఁబోలు.

పృ—దూరదర్శీ! ఏమీ వితండావాదము? రాజా! దేవుఁడే సున్న యనుచున్నావా?

పౌం—సున్నను జూచితినిగాని సృష్టికర్త నెప్పుడును జూడలేదు.

పృ—ఓరీ! నికృష్టాత్మా! నీకష్టముల కంతముండదురా!

పౌం—ఉన్నాఁడని చెప్పిన మీకొలుపుచున్న సుఖమేది? కలఁడో లేఁడో యను నాకుఁ గలిగించుచున్న కష్టమేది? ఈవివాదముతోఁ బ్రయోజనము లేదు. మీకుఁ గావలసినది కారాబంధవిమోచనమే కాదా?

పృ-దూ—ఔను.

పౌం—బంధకారణము బోధపడినదా?

పృ—నీవే బంధకారణమువు.

పౌం—నే నట్టికారణమగుటకుఁ గారణము ?
పృ—అది నీవే చెప్పవలెను. మే మెఱుఁగము.
పౌం—నేను వలచినకాంతను నీవు వలచుట.
పృ—(అప) దూరదర్శీ! రామానందుఁ డెంగిలికూడు పెట్టఁదలఁచినాఁడా?
దూ—(అప) మీ రూరకుండుఁడు. (ప్ర) నీవు వలచినకాంత నాయన వలచి నాఁడా? నిన్ను వలచినకాంత నాయన వరించినాఁడా ?
పౌం—వలచుట పురుషులకు శక్యముగాని, వలపించుటయే మో?
పృ—అట్లయిన నామె నీకాంత యని చెప్పి నాపై నేల ద్వేషపడెదవు?
పౌం—నీకాంత యనిమాత్ర మెట్లు నిర్ధారణచేసికొంటివి ?
పృ—నిర్ధారణమునకు నీవు నిరోధము కల్పించితివి.

గీ. తరుణిపట్టునఁ దర్కశా♦స్త్రంబు తగదు;
వలపు నైసర్గికముగఁ బూ♦వలపుమాడ్కి
నొదవు; నది చని పూఁబోఁడి ♦ హృదయపద్మ
ముకుళము విరియఁజేసినఁ ♦ బొసఁగుఁబొందు.

పౌం—విరిసి వికలమును గావచ్చును.
దూ—ఆత్మానుభవముచేఁ జెప్పుచున్నావు కాఁబోలు.
పౌం—క. వికసింపఁగ విరిసినసరె !
వికలంబయి పోవుటకును ♦ విరిసినసరె ! యా
చకితహరిణాక్షి నానా
యిక యని మీ రింక నిశ్చ♦యింపఁగ వచ్చున్.

దూ—కత్తిగట్టి కాంతను లోఁబఱచుకొను లోకాతీతుల నెక్కడను జూడలేదు.
పౌం—ఇక్కడఁ జూచితిరికాదా ! లోఁబఱచుకొనుట ప్రధానము గాని సాధ్య ముగాదు.
పృ—నాకత్తి నాకిచ్చిన నీదుష్ప్రసంగఫల మిప్పుడే కనఁబఱుతును.
పౌం—ఏమి ప్రతాపప్రకటనాలాపములు ! తేరగా వచ్చిన తెఱవ నాలింగనమ చేసికొనుటకుమాత్రమే తగిన యామృదుబాహువులు కరవాలము త్రిప్ప కనుకూలింపవు. శత్రువిలోకనభీకరము లైనయీకరములు చూచినావా

స్పృష్టమాత్రీ చూర్ణీకృతరిపుశిరోభాండకాండ మగునీముష్టిప్రకాండమును జూచినావా! ఘోరచపేటాఘాతసమాకృతద్విపత్కపోలయుగళము లగునీ పాణితలములు చూచినావా? సామవాక్యములతోఁ గార్యము చక్కఁబడునని చూచుచుంటినిగాని, రెండప్పడములు నలిపి రూపుమాపుటకు ఖండనపాటవ ముండనక్కఱలేదు. అందులో వంటయింటికుందేళ్ళయి పడియుంటిరి.

దూ—కుందేళ్ళమో తేళ్ళమో యిప్పు డేమి తెలియును లే!

శాం—తెలుపఁదలఁచుకొనిన దెప్పుడో యేల యిప్పుడే తెలుపరాదా!

పృ—కత్తు లీయ నిష్టము లేనియెడల, రెండుకత్తులైన నిటు పడవేసి, నీవును రెండుకత్తులు పుచ్చుకొని రమ్ము. ఇప్పుడే తెలిపెదము.

శాం—నాకుఁ గత్తు లక్కఱలేదు. ఈభుజాదండములు చాలును. వానితో మీయుబలాటముఁ దీర్పఁగలను. అటు గాదేని నీవొక కత్తివు-కావు చువకవు. అతఁ డొక చువక. ఒకదానితో నొకటి గొట్టి రెండును నిమిషములో ఖండింపవచ్చును.

పృ—అట్లేల చేయవు మఱి?

శాం—చేయుటకు మనసొప్పక, మీ కుసుమకోమలగాత్రములను నా కోపాగ్ని కెర చేసి దహింపలేక.

దూ—అంతదయ యున్నయెడల మా దారిని మమ్ముఁ బోనీయరాదా?

శాం—నేను జెప్పినట్లు చేసినయెడల నట్లే కావించెదను.

పృ—ఎట్లు చేయవలెను?

శాం—నీవు రూపలతకు నీళ్లు వదలుకొని వెళ్లెదనని చెప్పవలెను.

దూ—(అప) మహారాజా! ఆత్మరక్షణమునం దసత్యము పాపము గాదు. అట్లే యని తరువాతిపని మనము చూచుకొనవచ్చును.

పృ—(అప) మంత్రికుమారా!

గీ. ధాతువులు మూఁడు విషమవర్తనములైన
నామయవ్రాతమున దేహ మంత చెడును;
త్రికరణవిశుద్ధి లేనిపాతకియు, నరయ్య!
సమయు నామాటక నిచటి కచ్చటికిఁ గాక.

కనుక నేనొకటి మనసులోఁ బెట్టుకొని యొకటి నోటననేను. క్షమింపుము.

(వ్రి)—గీ. భూప? విపరీతనీతిప్ర•బోధశాలి!
ప్రాణములనైన విడిచెదఁ • గాని ప్రాణ
ములకుఁ బ్రాణంబుగానుండు • మోహనాంగి
రూపలత వీడ, వీడను • రూపలతను.

పౌం—అటైనఁ బ్రాణత్యాగమునకే సిద్ధుఁడవై యుండుము.

దూ—చెఱలోనుండుట చాలక సిగ్గులేక జీవహింసకూడఁ జేయనెంచుచున్నావా?

పౌం—జీవహింసయే కాదు. చిత్రవధ.

ఆ. పసిఁడిపసిమిమిసిమి • పైతోలు చీలిచి,
తొగరురంగుకండ • తోనలు గోసి,
గుండెకాయలోని • కులుకులాఁడిని రూప
వతిని గొందు రూప•లతను నేను.

వృ—ఛీ! ఛీ! మిథ్యాకాంతోపభోగకుతూహలా! అవాచ్యమానుషాదచండాల క్షత్రబంధూ!

పౌం—కాంత యటనుండుట మిథ్య యైనయెడల నిట నుండుట సత్యము.

దూ—ఏకాంతయో యొకకాంత యున్నఁ జాలునా?

పౌం—ఏకాంత?

దూ—నీవింత కామాంధుఁడవై యున్నావు. నాయొద్ద నున్నపటమునకు మూ కాంత నాకింకను భార్య గాలేదు అవివాహిత ననేకులు కామింతురు. నీకుఁ గామోపశాంతి గావించుపుణ్యమును గామించి నేనామెను వదలిపెట్టి న, మమ్ముభయులను గారావిముక్తులఁ జేసెదవా?

వృ—(అప) ఏమిది దూరదర్శీ! ఆమెయే నిన్నిట్లుచేసిన, నీమన సెంతబాధపడు నో యూహించుకొనుము. అనుచితముగా మాటలాడినావు.

దూ—(అప) చేయుట కాడినమాటలు గావు, చెప్పుటకాడినవి. మీకవి లెక్క చేయ కుఁడు. మిమ్ముఁ గండకండలుగాఁగోసి మీకాంతను హరించెదనని కాఱు లఱచుచున్నాఁడు. సత్యవాక్యములకు ధర్మోపదేశములకు లొంగునట్టివాఁడు గాఁడు. విషమునకు విషమే విఱుగుడుకాని వేఱుగాదు. లోకాపవాదభీతి లేదు. యశోనాశమునకు జంకువాఁడుకాఁడు. నాశన మొందుటకు యు న్నన్నో లేదో సందేహము. పరమాత్ముఁడే లేనివానికిఁ బరలోకభీతి

యుండదుకదా. చూచుచుఁ జూచుచు మీ ప్రాణము లీజీపఘాతుకుని చేతిలో నెట్లు పెట్టి యూరకుందును? యుక్తకార్యము లయుక్తసాధనములచే నెఱవే ర్చుకొనుట పెద్దతప్పుగాదు. అయిన నీయసత్యదోషము నాదిగాని మీది కా దుకదా! కనుక నన్ను క్షమించి యీవిషయమున నాకు మీరడ్డు రాకుఁడు.

పౌం—నీవు చేయఁదలఁచుకొనుపుణ్యకార్యము బోధించి, నీరాజుచేఁ జేయించిన యెడల, నిప్పుడే మిమ్ము విముక్తులఁ జేసెదను. నీకాంతను నీవే యుంచు కొనవచ్చును. నాకక్కఱలేదు.

పృ—(అప)వింటివా? మిత్రమా! కొంటెకారెనుమునకుఁ గఱుగోలవాఁతలవలనఁగా ని రోగము కుదురదు. అయిన నేమి యిప్పు డాసాధనములు మనయొద్దలేవు.

పౌం—ప్రత్యుత్తరములేదేమి?

పృ—అతనికి బదులు నేను బ్రత్యుత్తర మిచ్చుచున్నాను వినుము.

చ. నరపతివంశపాంసనుఁడ! ♦ నాస్తికశేఖర! మాపటంబులన్
గరమునఁ బెట్టుకొంచుఁ గని♦ కాలముపుచ్చు మిఁకంతె; మాదుమ
క్కరముల శ్వాస ముండుదను♦క న్నటమూలము లైనకన్నెలన్
వెఱచి తొలంగ; ఋాపు నడ♦పింపుము తోఁచినయట్లు చర్యలన్.

పౌం—తోఁచినట్టుగాఁ జేయవచ్చునా?

పృ—ముమ్మాటికిఁ జేయవచ్చును.

పౌం—నాప్రాణహింసాకృత్యమును భరింపఁగలవా?

పృ—నీప్రాణహింసమాట నీవే చూచుకొనవలెను.

పౌం—నాచేఁ జచ్చు గౌరవమైన నీకుండదు. కనీసపుఁ గటికవానిచేఁ గారా గృహమందు ముక్కముక్కలుగఁ గోయింతునుజుమా!

పృ—నీయట్టి [illegible] యొక్కవ గౌరవము.

పౌం—కర్తవ్యమేదో నిదానించి చూచుకొనుటకు [illegible]?

దూ—[illegible] జన్ముల నెట్లు [illegible].

పౌం—[illegible] నీవు, మూర్ఖ [illegible] యూడయము [illegible] మైనఁబోవల [illegible] చేసెదను.

దూ—అది యేమి?

పౌం—మీకాంతలకు మీయవసానవాక్యము లేమైన నున్నయెడల వ్రాసి పెట్టరో నుఁడు. అవి వారికిఁ జేరునట్లు చేసెదను.

వృ—దీనికిమాత్రము నీవు మాకృతజ్ఞతకుఁ బాత్రుఁడవై యున్నావు. ఏడవనాఁటి దాఁకనుండి యెవరికో యీసందేశ మీయనక్కఱలేదు. మరణవార్తావహనాభి లాషుఁడవగునీవు దయచేసి కొన్ని నిమిషము లిటనున్న, నదినీచేత నే పెట్టెదము.

పౌం—నాస్తికుఁడు దయాశూన్యుఁడుకాఁడు. అట్లే యుందును. వ్రాయఁదలఁచు కొనునది వ్రాసి యుంఁడు. (వ్రాయుదురు.) కన్నీళ్లు వదలుటకు సహజమైనా నికిఁ గాతణముగైవకాంతలనే వదలుకొనరాదా? ఒక్కకాంతను వదలినఁ జాలునుగదా!

దూ—నీ వనుకంపాయుక్తుఁడవే యైన, నీయవసరమున నధికప్రసంగము మానవలె ను. ఈప్రశ్న కివఱకే పెక్కుసారులు ప్రత్యుత్తర మిచ్చితిమి.

(ఉత్తరమిత్తురు.)

పౌం—ఇది నేను జూడవచ్చునా?

దూ—ఆహా! ఏమిధర్మశీలత? పటములును గత్తులును మమ్మడిగియే దొంగిలించితి వా? చూడవలదన్నమాత్రమునఁ జూడకుందువా? చూచుశ్రమ నీ కేల యీ యవలెను? చదివి వినిపించియే మఱల నిచ్చెదను. (పుచ్చుకొనిచదువును.)

ఆ. ఏడునాళ్లలోన ♦ నీల్గెడు మే మంపు
వ్రాఁతఁబట్టి చేతి ♦ వడఁకుఁబట్టి
వ్రాఁత నలికివేయు ♦ బాష్పంబులనుబట్టి
కనుఁడు మాదు ప్రేమ ♦ కాంతలార!

గీ. మాకు మీపయినున్న ప్రే♦మంబు మీకు
మాదెసల నున్నదో లేదో ♦ మాకుఁ దెలియ;
దట్టియును రాగ మున్నఁ బ్రే♦యసులు వ్రాయు
లేఖ గని రాల్తు రశ్రువు ♦ ల్లెనులార.

ఉ. మీమృదుబాహుబంధపుఁద♦మిన్గడుదూరము వచ్చి, యక్కటా!
మేమిటఁ గారఁ బెట్టఁబడి ♦ మృత్యుమహాముఖమందుఁ దూఁఱు నూ

న్నా మనసీశుఁ డీర్ష్యను మ♦నంబునఁ దాల్చుట, మీగుణావళి
న్నేమము సంస్మరించుకొని ♦ వీడెద మంగనలార! ప్రాణముల్.

పౌం—విడిచిన మీతప్పుగాని నాతప్పుగాదు.

దూ—(చదువును.)

చ. వలచితి రేని, మాదుదుర♦వస్థను సూచనసేయుదృగ్భుజా
చలనములో, యకారణపు ♦ స్వాంతవిషాదమొ, యస్మదార్తి మీ
కిలలను గానుపించుటయొ ♦ కల్గు? సుఖంబుగ నుండుకోమలాం
గులకును గూడ దుఃఖమును ♦ గూర్చినపాపము మమ్ము నంటెడున్.

పౌం—వలపు లేకపోయిన, నాబాధయు లేకపోవును.

దూ—(చదువును.)

క. మాకష్టములకుఁ బౌండ్రికుఁ
డే, కారణమౌట, వాంఛ ♦ యింతకు మున్నే
యాకడ కోరూపలతా!
పోకుండిన, నట్టె యాఁపి ♦ పొందుము సుఖమున్.

పౌం—చావనున్నపుడుసైతము సహకామిపై యీర్ష్య చావకున్నది.

దూ—ఈర్ష్యకా, దది పరశ్రేయోభిలాష. (చదువును.)

క. అంతశ్శుద్ధిగ మీకే
మింతటిదూరముననుండి ♦ యిచ్చెడిముద్దుల్
స్వాంతోపగూహనంబులు
కాంతామణులార! కొనిసు♦ఖింపుఁ డింకన్.

ఇట్లు
రూపలతాప్రియుఁడు పృథ్వీరూపుఁడు.
కాత్యాయనీప్రియుఁడు దూతదర్శి.

పౌం—ఉభయప్రాణక్షేపవిక్షేపప్రియుఁడు పౌండ్రికుఁడు (అని లేఖ లాగి పు
చ్చుకొని నిష్క్రమించును.)

వృ— గీ. వృషభములనుండి గోవుల ♦ వేఱు చేసి
తీసికొనిపోవ వృథగ య♦త్నించి, తిరిగి

పోవు బెబ్బులివాఁడిక్రొ నిప్పులను గ్రక్కు
చెల్లఁ పోఁగఁ జేరఁ డేగెనో యాపు రెండు.

దూ—ముందు వృషభములనే నోట వేసికొనఁ దలఁచుచున్నాఁడు.

పృ—ఔ నా ఱురోజులతరువాత! హా! రూపలతా! నాకేమో తల దిరుగుచున్నది.

దూ—మహారాజా! మనస్సంక్షోభముచేఁ గడుఁ బడలియున్నారు. అక్కడ సమర్చిన యాహారపదార్థము లించుక భుజింపుఁడు.

పృ—ప్రాయోపవిష్టుల మై ప్రాణములు విడుచుట మంచిదిగాదా!

దూ—మీసహజధైర్యలక్షణమునకు విరుద్ధములైనమాటలు వచ్చుచున్నవి. అంతపనికు వచ్చినయెడలఁ జెటియొకనిని జంపి మఱిచత్తము.

పృ—దోషియైన యల్లవానిఁ జంపలేనప్పు డితరుల నెంతమందినిజంపిన లాభ మేమి?

దూ—కార్యపరిణామ మెట్లుండునో యెవరు చెప్పఁగలరు? ఏదో కొంచెము పుచ్చుకొని మనశ్శాంతిని బొందుఁడు కర్తవ్యమేదో పిమ్మటనాలోచించుకొందము.

పృ— ఆ. చేతఁ గత్తి లేక ♦ చీఁకటింబడి కోలు
పోయి బ్రతికి మొయిక ♦ బుష్టి నిచ్చి
కటికవాని నేను ♦ గష్టపెట్టుట యేల?
వలదు తిండి! సఖుఁడ ♦ వలదు! వలదు!

దూ—మీకుఁ బిచ్చియెత్తినది. మీరు దినకున్న నేనును దినను. అయినను దినములట్లున్న గటికవానికి మీరు మఱెంత సాహాయ్యము చేయవచ్చును.

పృ—ఎట్లు?

దూ-వానిపని మీరేచేసి-ఆత్మహత్యాపుణ్యముమిత్రహత్యాపుణ్యమువిూరేకట్టి కొని.

పృ—పిఱికిచావు చచ్చుచున్నామే?

దూ—అట్టిచావు చావకుండుటకే భోజనమునకు గన్పఱచుచున్నాను. కాదు. ఎట్లో చెప్పలేను గాని మనకష్టము లచిరకాలములో [illegible] గలవని నాయంతరాత్మ చెప్పుచున్నది. రామానందుఁ డిటనుంచిన శివశర్మ యమాత్యుఁ డుండెను.

పృ—కష్టముల కేమిలే! రూపలతాప్రాప్తి యగునా?

దూ—కష్టములు పోవుననుటకంటె లభించుననుమాటయే! కాదు పోదము!

పృ—హా! రూపలతా! (ఇద్దఱు నిష్క్రమింతురు.)

———

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# రూ ప ల త.

## పంచమాంకము.

ప్రదేశము—ముక్తిపురోద్యానవనము.

ప్రవేశము—రూపలత, కాత్యాయని.

రూ—కాత్యాయనీ ! గురుదక్షిణామూలమున మనకన్యాత్వము లంతరించినవి.

కా—ఇంకను నంతరింపలేదు.

రూ—రెండుమూఁడురోజులలో నాపని జరుగ నున్నది.

కా—నీపనియే కాదు. నాపనిగూడను.

రూ—ఔను. వా రావలియొడ్డున నున్నపత్రిపురమునకు వచ్చినారఁట ! మనసోదరుఁడు శివశర్మ, గురువుగారికి మొన్న నుత్తర మంపినాఁడు. సముద్రము దాఁటి యిటకు వచ్చుటే తడవు ?

కా—అది దాఁటి యింకొకసముద్రమును దాఁటవలెను.

రూ—అది యేది ?

కా—దుస్తరసంసారసముద్రము.

రూ—సులభముగా దాఁటించుటకు రెండుతెప్ప లిట నున్నవికాదా !

కా—మీఁదఁ బెట్టుకొనిపోవుటకు మనపుణ్యముచేతఁ బలుచనివా రైనారుగాని, పొండ్రికునివంటివారైన, వారితో మనమును బుటుకునమునుఁగవలసివచ్చును.

రూ—చెలీ ! వానిమాట చెవిని బడనీయకు. నాకుఁ బరమాసహ్యముగా నున్నది.

కా—దానికేమిలే ! అసహ్యముగా నున్న పెండ్లి తప్పినదా యేమి ?

రూ—కనుక నతనికథను వినుటయుఁ దప్పదనెదవా యేమి ?

కా—నీవు పెండ్లాడనివారి నెవ్వరిని బ్రపంచములో బ్రదుకనీయవా ?

రూ—అందఱిమాటయేల ? అతనిప్రసంగము నాతోఁ జేయకుము.

కా—చేయనన్నవిచేయుట, చూడనన్నవిచూచుట, పెక్కుచోట్లఁదటస్థించుచున్నవి.

రూ—తటస్థించినప్పుడు చూతములే.

కా—పోనీ! రాజకన్యవు గనుక నీకిష్టము లేనిమాట యాడినందుల కపరాధవిధిగా నీపూదండ నీమెడ వైచెదను. దండన చాలదని తోఁచినయెడల నీవురాణి వైనపిమ్మట నీపృథ్వీరూపునిచే నాదండన హెచ్చు చేయింపవచ్చును.

రూ—రాణి నైన నేనే యాపని చేయలేనా?

కా—ఏమిచేసెదవు?

రూ—నిన్ను నాయురమున నిట్లంటఁగట్టించెదను.

కా—ఇది సుఖశిక్షయే కాని పైతీర్పులోఁ బృథ్వీరూపునిచేఁ గొట్టివేయఁబడును.

రూ—ఎందుచేత?

కా—తనకే మోసమగును గనుక.

రూ—(నవ్వుచు) యావజ్జీవశిక్షయైన నాబాధ గాని, యన్యవిధమైనఁ గాదు. ఉన్న యెడల నాచిక్కు మఱొక్కనికిఁగూడ నుండును. నీదండ నామెడ నుంచితివిగావున నాదండ నీమెడ నుంతును.

కా—రాఁబోవుకల్యాణనాటకమును దప్పులు లేకుండఁ బ్రదర్శించుటకిది పూర్వాభ్యాసశిక్షాతంత్రము కాఁబోలు.

రూ—మనలో వధూవరనిర్ణయ మెట్లు చేసెదవు?

కా—స్వయంవరములోఁ గన్యయే కాంతుని మొదటఁ బుష్పమాలాలంకృతునిఁ జేయునుగాదా! కావున నీవే వరపాత్రమవు.

రూ—నేను గాను; గడుసుదాన వైన నీవే కాంతుఁడవగుదువు. కాని కాత్యాయనీ బాలికాస్వేచ్ఛాసుఖములు పరిణయ మైనతరువాత నుండునా?

సీ. పక్కఁ బ్రక్కను జేర్చి • పాటలుఁ బద్యము
లెల్లరేఁగి పాడుకోఁ • గలమొ యింక?
నావేణి నీవును • నీవేణి నేనును
గమ్మపూ లెరువుకోఁ • గలమొ యింక?
నిర్విచారంబుగా • నీవు నేఁగూడి చ
క్కనియాట లాడుకోఁ • గలమొ యింక?
పికవిరావంబులు • వినిపంతముల్గట్టి
కలిసి కో యని కూయఁ • గలమొ యింక?

గీ. గురువుచెప్పినపాఠము • ల్మఱలఁ జదువు
కొనుచు నాయాస్థలంబుల • మనసు నొవ్వ
నట్టి పరిహాసవాక్యంబు • లాడుకొనుచుఁ
గలికి! కలకల నవ్వకొఁ•గలమె యింక ?

కా—బాల్యసుఖములు బాల్యముతోనే పోవును, వానితరువాతఁ దారుణ్యసుఖములు. వానివెనుక వార్ధకసుఖములు.

రూ—వార్ధకసుఖములా ? వార్ధకపీడలా ?

గీ. కనులు గనరావు, వీనులు • వినఁగరావు,
పండ్లు పోవునొ పెదపెద్ద • గండ్లు పడునొ,
యతిశయించు నిందిౖయవాంఛ, • లడఁగుశక్తి,
సుదతి ! భూలోక నరకంబు • సుమ్మి ! ముదిమి.

కా—ఒకవైపుచూచిన నట్లు. ఇంకొకవైపు చూచిన నిట్లు.

గీ. ఇంటఁ గిటకిటమని జంట • జంటలుగను
బిడ్డలును బిడ్డబిడ్డలుఁ • బెరుఁగుచుండఁ
గనులపండువుగాఁ గాంచు • వనితకంటె
భాగ్యశాలిని యేది యీ • వసుధపైని ?

గీ. అవ్వ, పాపము ! నమలలే•దనుచు మనుమ
లును మనుమరాండ్రు వస్తువు • ల్వాడుము చేసి
యొసఁగి, నడచెడునపుడు చే•యూఁత లిచ్చి,
యడ్డులకు మడ్డులొగ్గుదు • రామె కేమి ?

గీ. వీనికన్నిటి కేమిలే ? • వెలఁది పూర్వ
సుఖములఁ దలంచుకొని లోన • గ్రుక్కునందు
వేసి, ముదిమిపైఁ గలయట్టి • యేవఁ, జావఁ
జొరవ జేసినయొకతెనేఁ • జూచినావె ?

రూ—గతావస్థ మంచిదని మన ముభయుల మొప్పుకొనుచున్నాము గదా ! ఇఁక

భావ్యవస్థలోనా భిన్నాభిప్రాయములు? అది వచ్చినప్పుడు చూచుకొనవచ్చునులే !

కా—ప్రస్తుతావస్థ సుఖావస్థయేకద ?

రూ—అది యిద్దఱకు నొక్కటే కనుక నీవే చెప్పుము.

కా—నీవు వధూపాత్రవుగమక వరుని యెదుటఁ జెప్పుటకు సిగ్గువేయుచున్నది కాఁబోలు.

రూ—అట్లే యనుకొనుము.

కా—మన యలంకారశాస్త్రములోఁ జదువుకొన్న హావభావవర్ణనములకు నాత్మానుభవములకును సరిపడుటలేదు.

రూ—సరిపడకపోయిన దూరదర్శిపై నీకు గాఢానురాగము లేదన్నమాట.

కా—గాఢానురాగము లేకున్నఁ గల్యాణమున కెట్లొప్పుకొందును ?

రూ—గూఢానురాగము కాఁబోలు.

కా—చెలీ ! నీదగ్గఱ దాఁపరిక మేమున్నది ?

రూ—అయిన నడుగఁగానే చెప్పఁగూడదా ?

కా—ఉద్యానవనములో నుంటిమిగదా ! నాకు వసంతుఁ డగపడుటలేదు. అనంగుఁ డంతకంటెను గనఁబడుటలేదు. పూవులు పూవులలాగుననేయున్నవి గాని నన్నుఁ బొడుచుటలేదు. చిలుకలు కోకిలలు గూయునప్పుడు వానిపలుకులు చెవికింపుగానే యున్నవిగాని ములుకులవలె దూసికొనిపోవుట లేదు. నిన్నటిరాత్రి వెన్నెలలోనేకద తిరిగితిమి !

రూ—ఔను.

కా—వెన్నెల చల్లఁగానే యున్నదిగాని వేఁడిగాలేదు. మలయమారుతము నిప్పుగాలి విసరుటలేదు. దానిచల్లఁదనముచే నీతోడమీఁదఁ గునికిపడితిని గాని వడగొట్టి కాదు. తుమ్మెదలను దుమ్మెత్తిపోయుటకుఁ దగినకారణము మృగ్యము. నిన్న నీవు చిన్నిపూఁదేనెలో వేసినజిలేబులు నాకుఁ బెట్టితివికాదా!

రూ—పెట్టినాను.

కా—అవి విశేషములాగున మధురముగా నున్నవి. తలఁచుకొనిన నిప్పటికి నోరూరుచున్నది. కాని నాప్రియుఁడైనదూరదర్శి వానిని జేదుగాఁ జేయలేదు. నమ్మవేని, మఱికొన్ని తెప్పించి నాకుఁ బెట్టి చూడుము.

రూ—తెప్పించి పెట్టినఁ దృప్తిగాఁ దినెదవా?

కా—కొంచెము విచారముతో.

రూ—ఎందుచేత?

కా—కావలసినన్ని నీవు జెప్పించవైతివికదా యనియు, సహభోజివై సౌఖ్యపడు ట కాయనయొద్ద లేరుగదా యనియు.

రూ—నీపరిహాసవాక్యములు గట్టిపెట్టి నిజము వక్కాణింపుము.

కా—వక్కాణించినవానిలో నొక్కముక్కయైనను యథార్థము నతిక్రమింపలేదు.

రూ—బ్రాహ్మణులు జితేంద్రియులు గనుక నంతరంగ మరికట్టఁగలరు.

కా—జితేంద్రియులైన, దృష్టి జిలేబులమీఁది కేల పోవును?

రూ—నిజముగా మనోవికారములు నీ కేమియులేవా?

కా—నీమనసున నున్నవన్నియు దాఁచి మూటగట్టుకొని నాచిత్తమును మాత్రము చిల్లికుండఁ జేయుమన్న నట్లు చేయుటకు వెఱ్ఱిదానను గాను. ఇద్దఱమొక చదువే చదివితిమిగాదా !

రూ—నాస్వాంతస్థితినిబట్టి, యధిగమింపఁబడిన యలంకారశాస్త్రము కేవల మబద్ధ మని చెప్పఁజాలను.

కా—లోపలనున్నది యీవలికిఁ దెగిపడుటలేదు. గంభీరహృదయవైన రూపలత వు గనుకఁ దియ్యనిపలుకులు తీఁగలవలె సాఁగుచున్నవి. కేవలాబద్ధము లు గావన్నఁ గేవలసత్యములును గావన్నమాటయే కాదా ?

రూ—ఔనవ్లే! యథార్థము లతిశయోక్తులుగాఁ జెప్పఁబడినవి.

ఉ. కోయిల శ్రోత్రపాటనపుఁ • గూఁతలు కూయుట కేమి ! చిత్తజుం
డేయుట కేమి సూనశర•బృందము! చంద్రుఁడు వేఁడివెన్నెల
ల్గాయుట కేమి ! యన్ని కవి•కల్పన లందము ; కాని యోసికా
త్యాయని ! నాకుఁ గల్గెను జు•మా! యొకరీతి మనోవికారముల్.

గీ. కారణములేని చీకాకు • గదురు మదికిఁ
జూచుచుండఁగనే యయో! • సురుచిరాంగి !
రేలఁ గనుఱెప్ప లేలాకో • వాలవమ్మ !
పాన్పు మంచము గదియు ము•న్నపటివెమ్మెన.

గీ. పట్టు కెట్టకేలకు నిద్ర • పట్టెనేని,
పటముపై నున్నప్రతిమ స•ప్రాణమగుచు

వచ్చి పోఁగొట్టు దాని స్వ ♦ ప్నములచేతఁ,
గనుల కరుణిచు యందుచేఁ ♦ గలిగనేమొ!

గీ. గురువుగా రిచ్చినట్టిచి ♦ త్తరువు నెదుటఁ
బెట్టుకొని చూచినపుడు భా ♦ వించినపుడు,
హాయి యనలేను! బాధయు ♦ ననఁగలేను?
నిలువునను మేన నొకవేఁడి ♦ గలుగునమ్మ;

కా—ఏమి ముగ్ధాశృంగారము? పటము నాకుమాత్రము వికటింపలేదని యంటివా? నీవు మృదువుగా, స్వప్నములతోను, శయ్యాచిత్రములతోను, గన్నెత్తితోను వెల్లడించినబాధ నేను జిలుతిండితోఁ జెప్పినాను. అంతే మనకిద్దఱకు భేదము.

రూ—ఈబాధలు పోవు టెట్లు?

కా—స్వప్నసాక్షాత్కారులౌవారు జాగ్రదవస్థలోఁ గంటఁ బడినయెడల.

రూ—ఎప్పుడు?

కా—రెండుమూఁడునోజులలో నని నీవే యంటివికాదా? పృథ్వీరూపుఁడునిన్నఁ దెలుపుమఱపుసంధిలోనికిఁ గూడ దించినాఁడు కాఁబోలు.

రూ—కాత్యాయనీ! నాకేమో దక్షిణపార్శ్వ మదరుచున్నది. అశుభసూచకము గాదుగదా?

కా—స్వప్నశకునములు సత్యములని నాకు విశ్వాసము లేదు.

రూ—ఎందుచేత?

కా—నాకు దక్షిణభుజ మదరినమఱునాఁడే మాతండ్రిగారికి జీతము రెట్టియయినది.

రూ—మీతల్లిగారు మరణించినదియు నప్పుడేకాదా?

కా—అయ్యో! ఔను.

రూ— గీ. సృష్టిసందిగ్ధవిషయంబు ♦ లెన్నొ గలవు,
వానిలోనివే శకునము ♦ ల్స్వప్నములును,
గొన్నిటినిబట్టి నిజ మను ♦ కొనఁగవచ్చుఁ,
గొన్నిటినిబట్టి కల్లను ♦ కొనఁగవచ్చు.

వానిని విప్పి చెప్పఁటకూడ నతికష్టమందురు.

కా—నేను విప్పఁ బ్రయత్నించెదను. దక్షిణపార్శ్వమం దేది తొలుత నదరినది?

రూ—కన్ను.

కా—కన్నులు చెదరుకనక కాంతులతో నీకాంతుఁడు వచ్చి నీకుడిప్రక్క నిలుచు నని సూచన !

రూ—ఎడమకన్నదరలేదే!

కా—అప్పు డాయనయెడమప్రక్క నదరు బెదరు లేకుండ నంగనాచివి నీవు నిలుచుందువు. ఇంకను దక్షిణపార్శ్వావయవము లేవేవి యదిరినవో వివరముగాఁ జెప్పుము.

రూ—చాలు, నీనిమిత్తవ్యాఖ్యానవైదగ్ధ్య మింతటితో నిలిపివేయుము.

కా—రామానందుఁడుగారిపుణ్యమా యని రానున్న వివాహమహోత్సవములు తలఁచుకొని నవ్వుచుఁ ద్రేలుచు నుండకుండ నడ్డుపెట్టెదవేమి?

(రామానందుఁడు ప్రవేశించును.)

రా—బిడ్డలారా! ఈవఱకుఁ బ్రియవార్తలు వినిపించినవాఁడొక పిడుగువంటివార్త మీచెవులఁ బడవేయుటకు వచ్చినాఁడు.

ఉభ—గురువర్యా ! అదియేమి ? అయ్యో ! నమస్కారమని మొదట ననుట మఱచిపోయినాము.

రూ—(స్వ) ఇంతకుముందు కాన్పించినదుర్నిమిత్తములతో నిదియొకటి. అయ్యో! ఇవి సద్యఃఫలదాయకములుగాఁ గనుపట్టుచున్నవే !

రా—ఇటకు రాఁబోవుచుండఁగా మీప్రియులను బత్రపురమునందుఁ బరమనీచుఁడైన పౌండ్రకుఁడు పట్టించి బందిలోఁ బడవేయించినాఁడు.

రూ—(అప) ఇంతకంటెఁ గష్టము మన కేమున్నది?

కా—ఆదుర్మార్గుని కంతటివా రేమియపకారము చేసియుందురు ?

రా—వారు మిమ్ముఁ గామించుటయే వాని కపకారము. కామమే క్రోధజనకమని మీ రిదివఱకుఁ జదివియుంటిరి. పౌండ్రకుఁడు దాని కిప్పుడు ప్రత్యక్షనిదర్శన మైనాఁడు.

రూ—అయ్యో ! మహాత్మా! వారిదురవస్థకు మేమే కారణమైతిమే ?

రా—ఔను ! అబుద్ధిపూర్వాకాపకారిణులు.

కా—రూపలతా! ఇప్పు డిట్లగునని తెలిసినయెడల నప్పు డట్టిత్రృణీకారవచనములాడకపోదువు. మన మట్టి నిర్లక్ష్యప్రత్యుత్తర మీయకుందుము. కోఁతికి కల్లుపోసినాము.

రా—అయినదానికి వగచినఁ బనిలేదు.

రూ—అన్నగారియొద్దనుండి వచ్చినవార్త యేనా?

రా—ఔనమ్మా! ఎప్పటివర్తమాన మప్పుడు పారువములచేఁ బంపించుచున్నాఁడు.

రూ—అక్కడనుండి చెంద్ర కేమియు నుపకారము చేయలేకపోయినాఁడా?

రా—అమ్మా! చేతనైనంతవఱకుఁ జేయుచునే యున్నాఁడు. అసాధ్యమైనదాని నతఁ డెట్లు చేయఁగలఁడు?

రూ—(స్వ) హృదయమా! తటతట కొట్టుకొనకుము. నీవు స్థిరముగానుండి నా బుద్ధికి సహకారివగుము. (ప్ర) అతని కసాధ్యమైనట్లే, నాయనగారికిని విద్యాజనకులగుమీకును గూడ నసాధ్యముగానే చూపట్టుచున్నదా?

రా—తల్లీ! తనుసేర్పాటు లిదివఱకే చేసి వచ్చినాను.

కా—అవి యేవో సెలవిండని ప్రార్థించిన క్షమింతురుగాక!

రా—విచారకరవార్త వినఁగానే సుమంత్రున కొకఫౌజు పత్రపురముపైఁ బంపుమని లేఖిక వ్రాసి పెంపుడుపావురమునకుఁ గట్టి పంపినాను.

కా—గురువరా! అంతజ్ఞానవయోవృద్ధుఁడయ్యును నతఁడు కుమారు నొంటరిగా నేల పంపి యూరకున్నాఁడు?

రూ—అధిపు నంపవచ్చును గాఁబోలునే?

కా—క్షమింపుము, రూపలతా! పోషితుఁడగునతునే పంపఁగూడనప్పుడు పోషకుఁడగుప్రభువు నొంటిగాఁ బంపఁగూడదని వేఱుగఁ జెప్పనక్కఱలేదు.

రా—దానికి నేనేకారణము గాని యతఁడుగాఁడు. నే నొకటితలఁచిన దైవ మొకటి తలఁచుటయైనది. అయిన నొకతప్పు నొకతప్పుఁ గలిసి కార్యము కావలసినట్లే యైనది.

రూ—నాకు బోధపడుటలేదు.

రా—ప్రచ్ఛన్నులుగా వచ్చినఁ బొంద్రికబాధ యుండదని సేనతో రావలదని చెప్పి జాగ్రత్తకై శివశర్మనుగూడ నట నుంచినాను. ఎంతచేసినను నన్యథా కార్యము జరిగినది. కనుక నేఁ జెప్పినది తప్పని యిప్పు డనుకొనవలసి యున్నది.

కా—రెండవతప్పేది?

రా—అట్లే చేసెదనని చెప్పినను సుమంత్రుఁ డెటుపోయి యెటువచ్చెనో యని మాఱాలోచనము చేసి కొన్నాళ్ళతరువాత వారివెనుక యుద్ధసామగ్రితో నొకసేన పంపించినాఁడు. చేసెదనన్నదానికి వ్యతిరేకముగాఁ జేయుట యతనితప్పు.

రూ—అది మీ కెట్లు తెలిసినది?

రా—నే నుత్తరము పంపినపావుర మా ప్రత్యుత్తర మిప్పుడే తీసికొనివచ్చినది.

రూ—ఆసేన పత్రపురమున కెప్పుడువచ్చునో?

రా—రెండుమూఁడురోజులలో రాఁగలదు.

రూ—వారికి వారే సాహాయ్యము చేసికొనుటా? వీ రేమైనఁ జేయునదున్నదా?

రా—వీరనఁగా?

కా—అత్తవారని యామెయభిప్రాయముకాఁబోలు.

రా—వీరుచేయకుండ, వారిని జేయుమనెదరా వెఱ్ఱిబిడ్డలారా! రూపధరమహారాజు గారును నేను నాలోచించినాము. దేశసంరక్షణమున కావశ్యకమగునౌకా దళములన్నియు స్థలవాహినులు గొన్నియు నిచట నుంచి, మిగిలినయావత్సే నతోను మహారాజును మతిమంతుఁడును దాడి వెడలనున్నారు. పురీరక్ష ణోద్యోగమున నే నిచట నుందును.

రూ—ఎవరికొఱకు వా రిన్నియిక్కట్లపాలైనారో, వారుచేయవలసిన దేదియు లేదా? యని నాయభిప్రాయము. కాత్యాయని నాయభిప్రాయముతిన్నఁ గా గ్రహించి మీతో మనవిచేయలేదు.

రా—అమ్మా! స్త్రీలేమిచేయఁగలరు? తండ్రులు చేసినసాహాయ్యము బిడ్డలదికాదా?

కా—బిడ్డలకొఱకగునదిగాని, బిడ్డల దెట్లగును?

రా—మీరు చేయునది, వారి యాపద్విమోచనముకై, తదనంతరకళ్యాణసుఖముకై నిర్వ్యాజభక్తితో మీయిష్టదైవములను బ్రార్థించుకొనుచు నిట నుండుటయే.

రూ—అంతేనా?

క. స్త్రీలకును బూరుషులకును
స్థూలశరీరంబునందె ; సూక్ష్మపుభేదం
బాలోకితమగు నని గ్రం
థాళి జెప్పంగఁబడెఁగదా! గుణమాళీ!

రా—భార్యాభర్తృభేదము స్థూలశరీరమునుబట్టియే వచ్చినది. నిజమే. అందుచేత మీరు స్త్రీవిహితధర్మములు వదలుకొందురా?

కా—శౌర్యసాహసములు పురుషులకువలె స్త్రీలకును నుండవచ్చును.

రూ—సాహసమునందుఁ బతులదాఁటినసతులుగూడఁ గలరు.

రా—అవ్వి చూపుటకు శరీర మేకదా ముఖ్యసాధనము. అందులో స్త్రీపురు[illegible] తారతమ్యమున్నది.

కా—మాపట్ల భవత్కరుణాకటాక్షముచే నా తారతమ్యముగూడ నదృశ్యమైన[illegible] జన్మముచే నబలలమైనను మాశరీరములు సద్గురువుచే సుశిక్షితములైనవి.

రూ—సీ. ఘోటకారోహణ ♦ పాటవం బబ్బెఁగా
[illegible]సద్గురుకటా♦క్షమున మాకు,
సంపూర్ణ[illegible] ♦ సంపద ల్గల్గెఁగా
సద[illegible]సద్గురుకటా♦క్షమున మాకు,
[illegible]నలు [illegible] ♦ మైనమైపోయెఁగా
[illegible]యసద్గురుకటా♦క్షమున మాకు,
[illegible]స్త్రగ్రాహ ♦ పటిమ లభించెఁగా
సదయసద్గురుకటా♦క్షమున మాకుఁ,

రూ—గీ. గాండములను బుంఖానుపుం♦ఖముగ వేయఁ
గలసమర్థత మాకు మీ♦కరుణఁగల్గె,

కా— ఖడ్గకాంతులు రోషదృ♦క్కాంతు లరుల
పైఁ గురియుశక్తి మాకు మీ♦వలనఁ గలిగె.

రా—అమ్మా! కాత్యాయనీ! ప్రళయకోపమున వరునిపై ప్రసరించు చూపులకును, భండనమునఁ గరవాలము జళిపించి యరిపైఁ బఱపు క్రోధవిలోకనవీక్షాహో[illegible] జ్వాలలకును భేదము లేదమ్మా? తల్లీ! రూపలతా! సకలవిద్యాపారంగత[illegible] పించుకొనవలె నని సంగ్రామకళలు చదువుట వేఱు, ఘోరసంగ్రామనాట[illegible] రంగమందుఁ గనుమాంగులు వీరపురుషుల మాఱుకొని చక్కనిశస్త్రప్రయో[illegible] గములతో వానిని బ్రదర్శించుట వేఱు.

రూ—గురూత్తమా! సత్ప్రయోగముగను సత్ప్రదర్శనముగనే తమయొద్ద నావి[illegible] లభ్యసించినాము.

రా—కుజములను గ్రూరకాననమృగములను గుఱిచేసికొని ధనుశ్శస్త్రవిద్యాకౌశల[illegible] నీవఱకుఁ జూపినారు. ఇప్పు డట్లుకాదే!

కా—ఆచార్యా! ఇంతవఱకు నితరలక్ష్యములు సందర్శింపలేదు. ఇప్పుడుంల[illegible] సున్న[illegible]

రా — అయ్యో ! అట్లైన మీరుగూడఁ బరిపురముపై దండెత్తఁదలఁచియున్నారా?

రూ — అటు చేయకున్నఁ దమయొద్ద నేర్చుకొన్నకొన్ని విద్యలకుఁ బ్రయోజనమే యుండదు.

రా — ధనుర్విద్య తరుణులపట్టున సప్రయోజనమై యుండకపోయినను బాధ లేదు.

కా — ఆచరణము లేనియస్త్రవిద్య, యనుభవములేని యాధ్యాత్మికవిద్యవలెనే, వ్యర్థముగాదా ?

రా — అట్లైన నే నొకసదుపాయము చెప్పెదను వినుఁడు.

రూ - కా — సావధానలమై యున్నాము. సెలవిండు.

రా — పురరక్షణభారము ముసలివానిమీఁదఁ బడవైచి వారు పోవుచున్నారు గాన, నిచటనే యుండి యావశ్యకమైనయెడల నాకు సాహాయ్యము చేయుఁడు.

రూ — వెళ్లుచున్నవారును ముసలివారే కావున, వారికి సాహాయ్య మక్కఱలేదా ?

కా — ధనురాచార్యులకుఁ దన్వంగులయుద్ధసాహాయ్యప్రసక్తి కావలెనా ?

రా — రెండుసేన లక్కడకుఁ బోవుచున్నవి. చాలును.

రూ — ఒకటి నాయకహీనమై యున్నట్లు కనఁబడుచున్నది. రెండవది వృద్ధులగు తండ్రిగారిచేతను రాజ్యకార్యతంత్రమందేకాని రణతంత్రమందు నిపుణుఁడు గాని మంత్రిచేతను నడపింపఁబడవలసియున్నది.

రా — కనుక.

రూ — నే నక్కడకుఁ బోవుట కనుజ్ఞయిండని ప్రార్థన.

కా — అసహాయశూరురాలగుక్షత్రియకన్యకనుక, మఱపుననో మత్సరముననో స్నేహితురాలిని దిగవిడిచినది. మఱచుటచేఁగాదు. యుద్ధతంత్రకోవిదుఁడు గాని విప్రమంత్రికూఁతురు మాత్రము యుద్ధకుశల యగునా యని యూహించి యట్లన్నది.

రూ — కాత్యాయనీ ! ప్రాణసమాన నగునిన్ను విడువఁగలనా ? ప్రాణము నిచట వదలి శరీర మటకుఁబోవుట సాధ్యమానెడల, నే నొక్కతెనే పోవుదును. మన కిరుపురకభేద మని గురువుగారే యెఱుఁగుదురు.

కా — ఇంతయభేదవాదిని యంతయహంభావముతో “నేనక్కడకుఁబోవుట”కననేల?

రూ — మఱపుచేఁ గాని మఱి యెందుచేతను గాదు.

కా — ఇప్పుడు రూపలత, రూపలతగా మాటలాడుచున్నది.

రా — ఈకుహనాకలహములు గురుని మోసపుచ్చుటకే కాదా ?

రూ — తమయనుజ్ఞకై కను పెట్టుకొనియున్నాము !

శా—ఈవిషయమునఁ బిత్రాజ్ఞ కావలసినది గాని నాయనుమతి తగదు.

కా—పిత్రాజ్ఞ వచ్చులోపలఁ బిరియులు పితృలోకమును జూడవలసివచ్చునేమో!

రూ—చెలీ! అవాచ్యసంభాషణము లాడకుము. గురువర్యా! మీరే మమ్ముఁ బోనిచ్చుట కింతసందేహించుచుండఁ దండ్రిగా రియ్యకొందురా?

శా—మీతండ్రిగారొప్పుకొనని పని మీరుచేయుదురనిన, నేనట్లేకానిండనవచ్చునా?

రూ—గురుకులతిలకా!

గీ. ఎవ్వరో చేయిపెట్టి యీ ♦ హృదయకలశ
మును గలంచుచు నున్నట్లు ♦ పొడముబాధ;
యనుమతి నొసంగి యీయార్తి ♦ యడఁపవలయుఁ;
దండ్రిఁ దల్లియు నిల సమ ♦ స్తంబు మీరె.

కా—గీ. ఓదయామయ! విద్యావి ♦ నోదకలనఁ
గాలమును బుచ్చుముగ్ధలౌ ♦ కన్యల కొక
వింతవలపును గొలిపి యీ ♦ యంత దెచ్చి
నట్టివారలె యీవగ ♦ నడఁపవలయు.

శా—స్నేహమిచేయుమనెదరు బిడ్డలారా! నేఁబడ్డపాట్లు మీసుఖముకై పడితిని గాని మిమ్మిట్లు కష్టపెట్టుటకుఁ గాదుకదా!

రూ—అది మాకుఁ దెలియును? అన్యథా యనుకొన్నఁ, గృతఘ్నతాపాతకము పాలౌదుము.

కా—మాసుఖమునకుఁ గారకులు మీరును గష్టములకు మాపురాకృతకర్మమునని యే త్రికరణశుద్ధిగా నమ్ముచున్నాము.

శా—పురాకృతకర్మమునకు బుద్ధిపూర్వకముగా నిహకర్మమును గలిపి కష్టములు గి ట్టించుకొననేల?

రూ—గిట్టింతుము గాని రెట్టింపము. మహాత్మా! భగవత్కృపచేతను భవదాశీర్వాదముచేతను మాకార్యము తప్పక నెఱవేఱఁగలదు.

గీ. ఎవరికై రాజ్యవైభవ ♦ మెల్లఁ బాసి,
మారసుకుమారు లొకతుచ్ఛ ♦ కారఁ జిక్కి,

నవయుచున్నారో, యాయంగ • నలమనోంగ
బలముచేతనె పైకిరా • వలయు వారు.

కా— ఆ. పెండ్లి కాకముందె • ప్రియురాండ్రు సుఖదుఃఖ
ములను బంచుకొనెదు • నెలఁత లనుచుఁ
జెఱను బందెవడిన • చెలువు లచ్చెరువునఁ
బ్రిమద బాష్పములను • రాల్పవలయు.

రా—తల్లులారా! మీధైర్యసాహసములు చూచిన నాకత్యాశ్చర్యకరములుగ నున్నవి. మీరెట్లుపోయి యేమేమిచేయఁదలఁచుకొన్నారో సవిస్తరముగ నాతోఁ జెప్పిన నవి విని, నాకు నచ్చినయెడల, నంగీకారమిచ్చెదను.

రూ—అంగీకృతివచ్చినట్లే సంతోషించుచున్నాము. నేనుఁ గాత్యాయనియు మనస్సులఁ గొంచెము సంప్రతించి నవరించుకొని యిప్పుడే మనవిచేసికొనెదము.

రా—మంచిది. (స్వ)

గీ. పురుషవిద్యల బిడ్డలఁ • జెఱపితి నను
నింద భూపతి వేసె నా • నెత్తిమీఁద
నీనడుకె; వెట్టిచేఁతల • నిపుడు వీర
లేమితలవంపు దెత్తురో • యింకనాకు?

క. చనఁ జనదని యెటు చెప్పిన
వినకున్నా; రాఁప నన్య • విధ మొక్కటియున్
గనఁబడదు; వీరు సని యట
నొనరించెదుకృత్య మేది • యో నేనెఱుఁగన్

(ప్ర) మానినీమణులారా! మంత్రాంగము లైనవా?

కా—ఐనవి. శిష్యరాండ్రము శిష్యులమగుదుము.

రూ—పురుషవేషములఁ జొండ్రకు దర్శించెదము.

కా—అన్నకడకు మొట్టమొదటఁ జని యన్నిసంగతులు దెలిసికొని, తరువాత రాజ సందర్శనము చేసెదము.

రా—సురంగకన్యలు క్రూరవ్యాఘ్రిగహ్వరముఁ జొచ్చిన నెంతప్రయోజనమో, మీకు నంతప్రయోజనమే.

రూ—కన్యలుగాఁ బోము. వ్యాఘ్రమారకసాధనములతో మృగయానిపుణులైన మహామృగయులు పోవునట్లు పోదుము.

రా—అతనితోఁ గలియఁబడి పోరాడుదురా ?

కా—అంతవెఱ్ఱివారమా ! ఆచార్యపుంగవా ?

గీ. మృదుమృషావాక్యసంతతి • మేదినీశు
చిత్తమును జతురిగతులను • మెత్తఁబఱిచి
యుత్తరింతుము తల, యున్న • దున్నయట్లె,
పిండిబొమ్మను జాఁకుతోఁ • జెండునట్లు.

రా—బిడ్డలారా ! విశేషప్రపంచానుభవపరిపాకచిత్తులకుమాత్రమే లభించునాసైపుణ్యము పొరుగూరేమో యెఱుఁగనిముగ్ధలకు మీకెట్లలవడును?

రూ— గీ. కావలసినట్లు సంసార • కలన నడచి
నంతకాలము నాఁడుది • యబల, ముగ్ధ,
వినయవతి, సత్యవతి, మహా • భీరురాలు,
కలికిచూపులచాన, ని • ష్కపటహృదయ.

గీ. కాని యెందేని తబ్బిబ్బు • గలిగెనేని,
యంతసాహసురాలిని, • నంతధీరు
రాలి; మదవతి, నంతమా•యాంతరంగఁ,
గాంచలేమింతవిపుల ప్ర • పంచమందు.

రా—తల్లులారా ! ఇచట నాచార్యుఁడు శిష్యుఁడైనాఁడు. శిష్యురాండ్రు గురువులైనారు. చెప్పుటకేమున్నది ? మిమ్ముఁ బంపుటకు మీకున్నధైర్యబలములో సహస్రాంశమైన నాకు లేదు.

కా-గురుచంద్రమా! ఆధైర్యలోపమును దమయాశీర్వచనబలముచేఁబూర్తి చేయుఁడు.

రూ—తథాస్తు.

రా—అయినను మీయుద్యమమును మీజనకులకుఁ దెలియనీయఁగూడదనియే మీయభిప్రాయము ?

రూ—తెలియనీయవచ్చుఁ గాని, మేము కర్పూరద్వీపము వదలి వెళ్ళినతరువాత.

కా—అప్పుడు తప్పకుండఁ దెలియఁబఱుపవేఁడెదము. మీరట్లు చేయకున్ననూ, అటఁ

బత్రపురమునఁ బ్రకాశితలము గాక తప్పదు. జనకనుతావియోగము స్వల్ప కాలమే యుండును. మధ్యమార్గములోనే. మేము ముందు. వారు వెనుక.

రా—ఒప్పుకొనక తీఱనప్పుడు చప్పున నొప్పుకొనుటయే సమంజసమైనమార్గము.

రూ-కా—గురువర్యా! తమ కనేకకృతజ్ఞతాపూర్వకనమస్కారములు.

రా—పరమదయాళు వైనభగవంతుఁడు మీకభీష్టసిద్ధి యనుగ్రహించునుగాక!

(నిష్క్రమించును)

రూ—కాత్యాయనీ! గురుధిక్కారదోషము మనల నంటదుకదా!

కా—అంటదు. ఆజ్ఞ యిచ్చిరికదా! అంటినను దానికిఁ బరిహారమున్నది.

రూ—ఏది?

కా—ఇద్దఱముగదా పాపము చేసినవారము?

రూ—ఔను. అట్లడిగెదవేమి?

కా-కారావిమోచనకార్యము నెఱవేఱినపిదప, వారు పౌండ్రకునికిపీరస్వర్గమిప్పించి-

రూ—శూరుఁడై పోరినయెడల.

కా—ఔను. మనతో, విజయకీర్తికాంతతో, ముక్తిపురమునకువచ్చి మనసార గురువుగారి కెనిమిదిచేతులమొక్కులు సమర్పించినయెడల దోషపరిహారమగును.

రూ—కీర్తికాంతకుఁ జేతులు లేవని యెనిమిదిచేతులు చెప్పితివా?

కా—చేతులున్నచేడె, నెవతె సవతిగాఁ గైకొనును?

రూ—మన మనుకొన్నట్లయినయెడల నామె మనకుఁగూడ భార్యయే యగును.

కా—మనము మగవారము కాఁబోవుచున్నాముగాదా! కాలయాపన మేల? పురుషవేషములు ధరించి వెంటనే పోవుదము రా!

రూ—అదిగో గాలి, పత్రపురమువైపునకుఁ దిరిగి, సత్వరులై రండని మనకుఁ జెప్పక చెప్పుచున్నది.

కా—గాలిచేఁ జెట్లు నిష్పత్రము లగుచున్నట్లే, భగవదనుగ్రహమున్నయెడల, మనచేఁ బత్రపురము శీఘ్రముగా నిష్పౌండ్రక మగును. రమ్ము పోదము.

రూ— సీ. మన రాజ్యరమ కురు • మాణిక్య మేఖలా
రాజమై యెసఁగువా • రాశి యదిగో!
మనద్వీపమునకుఁ దరి • వ్వని కందకంబయి
శత్రుభీకరమైన • సంధ్రి యదిగో!

శీతోష్ణముల సమ ♦ శీతోష్ణములఁ జేసి
యారోగ్యసుఖ మిచ్చు ♦ నబ్ధి యదిగో!
ముక్తాప్రవాళము ♦ ల్భూపతి కుపహార
ములుగఁ బెట్టెడుమహా ♦ జలధి యదిగో!

గీ. ఓయిరత్నాకరుండ! మా ♦ కుభయులకును
భవదుదరసంస్థనక్రాది ♦ భయదజంతు
సహజపాటవమును దయ ♦ సంతరించి
పత్త్రినగరంబునకు వేగఁ ♦ బంపు మయ్య!

కా— గీ. మిడిసిపడునట్టితరఁగల ♦ మీఁద గొప్ప
నర్తకితెఱంగునను బోవు ♦ నౌక! తల్లి
కరణి మముఁ బెట్టుకొంచు నీ ♦ గర్భమందు,
వడిగ నావలిదరిఁ జేర్ప ♦ వలయు నమ్మ!

(ఇద్దఱు నిష్క్రమింతురు.)



శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# రూపలత.



## షష్ఠాంకము.



ప్రదేశము — పత్రిపురరాజసభాభవనము.

పరివేశము — భామవర్మ, సోమవర్మ.

భా — సీ. రత్నభూషాపుష్ప • రాజితోఁ దులకించు
తలకు నాయసశిర • స్త్రంబు వచ్చె,
నునుపట్టు చెంగావి • చనుకట్టుపైఁ జూలు
సన్నపైఁటకుఁ గవ • చంబు వచ్చె,
మువ్వలబంగారు • మొలనూలికిని మాఱు
జెట్టిగట్టెడు తోలు • దట్టి వచ్చె,
క్షితి పైని జీరాడు • జిలుఁగుఁబావడ వోయి
రౌతులు దొడుగుష • రాయి వచ్చె,
గీ. హారములు చిన్నిసూడులు • తగటుఁబోఁగు
లలరులును బోయి మృదువులౌ • హస్తములకుఁ
గటకట! కదనసముచిత • ఖరకఠార
శస్త్రకార్ముకసాయక • సమితి వచ్చె!

ఏవేళ కెవరి కెట్టిస్థితి వచ్చునో యెవరు చెప్పఁగలరు? కాత్యాయనీ! కాదు— సోమవర్మా! శివశర్మ చెప్పినవార్త వినఁగాఁ జిత్తము మతియును నుత్తలపడు చున్నది! ఏమిచేయుదము? కబురుపంపించి యెంతసేపో యైనది. ఆదుష్టుఁ డింకను రాలేదే.

సో — వచ్చువేళ యైనది. కాని, పేర్లలోఁ దబ్బిబ్బు రానీయకుము. పౌండ్రకునిపై నేవ హృదయములోనే యడఁచిపెట్టుము. కాని మాటలతోఁ బైకి రానీయకు

కుము. మనము నూతిగోడయంచుపై నడచుచున్నాము. జాగ్రత్త! ఇసుమంత వచఃప్రమాదమున మనము నాయనుగూడ మానప్రాణములు గోలుపోదుము.

గీ. ఓ యగోచర! దుష్ప్రాప్య! ♦ మాయలోఁడ
సృష్టిమర్మం బవేద్యము ♦ చేసి తెట్లొ,
యట్టి మాస్త్రీత్వమును దాఁచి♦పెట్టి కపట
పౌరుషంబును నిలఁబెట్టు ♦ పరమపురుష!

గీ. పలుకులను లోనివలపుఁ గో♦పంబుగాను
బటురుషాజుగున్నలు భయ♦భక్తులుగను
జేయ నున్నాము ప్రియుల ర♦క్షింప, మాకుఁ
గావలయుశక్తి దయచేసి ♦ కావు మయ్య!

అదిగో! రాజు వచ్చుచున్నట్లున్నాఁడు. దున్నపోతువలె నెంతస్థూలశ రుఁడో చూడు. ఓరీ! పశుపతీ!

భా—అట్లైన నే పార్వతినగుదును.

స్తో—అయ్యో! అట్లనుచున్నావేమి?

భా—మహిషాసురసంహారముకొఱకు. ఛీ! క్రూరాత్ముఁడా!

స్తో—అట్లు మొగ మెఱ్ఱచేసికొనకుము.

భా—భయములేదులే! అది మనయళీకకథాకథనమునకుఁగూడ నుపయోగించును.

(పౌండ్రకుఁడును, ధర్మాచార్యుఁడును ప్రవేశింతురు.)

పౌం—ఆహా! ఏమిమనోహరాకారులు!

ధ—అంతఃకరణములుగూడ నట్లుండవలెను.

భా-స్తో—జయము! జయము! మహారాజా!

పౌం—బాలురారా! నిలుచున్నారేమి? ఆకుర్చీలపైఁ గూర్చుండుఁడు. (స్వ)

సీ. అలసటచేతనా ♦ యలఁతికొఁదీఁగలు
జనజన యిట్టిట్టు ♦ సంచలించు?
నడచివచ్చుటచేత♦నా యట్లు ఫాలము
ల్చెక్కిళ్లు పెదవులు ♦ చెమ్మరించుఁ?

బాలలోఁ గుంకుమముఁ బసుపుఁ గల్పినచాయ
వ్యాపించు నేలొకో వదనములను ?
గార్ముకాశుగములుఁ గత్తులు భుజముల
మొలలందు నేలొకో పొడవుచూపు ?
గీ. జయము ! జయ ! మనుమధురని స్వనము వినినఁ,
గలికిమూఁపులుఁ జిన్నారి కులుకుఁ గనిన,
నపుడు కౌశికుతోఁ జని నట్టి రామ
లక్ష్మణులు దోఁతు రిప్పు డుల్లంబునందు.

(ప్ర) సుందరాంగులారా ! బడలిన ట్లగపడుచున్నారు. ఎక్కడనుండి వచ్చితిరి ? మీరెవరు ?

భా—రాజచంద్రమా ! కడుదూరమునుండి కాలినడకనువచ్చినాము. మాదిపాంచాలదేశము. నే నాదేశాధీశున కేకపుత్రుఁడను. ఇతఁడు నా మేనత్తకొమారుఁడు.

సౌం—ధర్మాచార్యా ! అంద మిద్దఱిలో దాదాపొకరీతిగానున్నను, నితనిది లోకాతీతము. ఇతనితండ్రియు నతనితల్లియు సౌందర్యాతిశయముగలవారని తోఁచుచున్నది.

ధ—సౌందర్యవిమర్శనమునకుఁ జాలినవారు తమరుదక్క నెవరున్నారు ? ప్రక్కఁ గూరుచుండి తల యూఁపుటయేకాని నా కేమియుఁ దెలియదు.

సో—(అప-భా) నీలనికషమేకదా స్వర్ణచ్ఛాయలఁ బరీక్షించునది !

సౌం—మీ నామధేయము లేమి ?

సో—అతని పేరు భానువర్మ.

భా—అతని నామము సోమవర్మ.

సౌం—నీ రాజ్యమేది ?

సో—నాకు రాజ్యము లేదు.

భా—మా మేనత్తభర్త గారిల్లఱిక మున్నారు.

ధ—క్షత్రియకుమారులారా ! మీ రింతదూరము వచ్చుటకు మీతలిదండ్రు లెట్లంగీకరించినారు ?

భా—వారితోఁ జెప్పకుండఁగనే వచ్చినాము.

సో—చెప్పిన రానీయరని యిట్లు చేసినాము; గాని జనకావిధేయులము గాము.

శాం—మారసుందరు లగుమిమ్మెడఁబాసి వారింతకాల మెట్లున్నారో తెలియదు.

భా—ఈవియోగదుఃఖము మేము తిరుగఁ బోయి వారిని దర్శించినతోడనే పోవు
నది. యావజ్జీవదుఃఖములో వారిప్పుడు మునిఁగియున్నారు.

శాం—అయ్యో! అట్టిదుఃఖమేది?

సో—సుతావియోగదుఃఖము.

ధ—మీ కప్పలున్నారా?

భా—అప్పలుగారు, చెల్లెండ్రు.

శాం—వారు మీవంటియందకత్తెలేనా?

భా—(అప-సో) మనపై ననుమానము పుట్టలేదుకద?

సో—అందకత్తెలు కాఁబట్టియే మాతలిదండ్రులదుఃఖమున కంతము లేకున్నది.

శాం—రాజాపీడితులైపోయినారా?

భా—అట్లయిన లోకసామాన్యమైన మరణములే యగును.

శాం—మరణకారణ మేమిమతి?

సో— ఆ. ముట్టుకొనినఁ గందు • పూవులదండచే
నిందుమతి సుమాంగి • యీల్గినట్లు,
సౌఖ్య మీయఁదగిన • స్మరసాయకములచే
నిందువదన లిర్వు • రీల్గినారు.

ధ—పాపము! పసిబిడ్డలకుఁ బాలపాపచిన్నెవలెఁ దరుణులకుస్మరతాప మొకగండము

భా— ఆ. అయ్యో! రాజచంద్రమా! ప్రియుల్వలపులు
గొల్పి యాసగొల్పి • కూల్చినారు.
బాసచేసి యొరుల • వలచిరి కూళల
న్మాట చెవిని బడఁగ • మడిసినారు.

మహారాజా! ఆత్మహత్యాదోషముగూడ మాచెల్లెండ్ర మెడకుఁ జుట్టి
పాపాత్ములు హాయిగా నున్నారు. (కన్నులొత్తుకొనును.)

ధ—దేనితోనైనఁ బొడుచుకొని మడిసినారా?

సో—అన్యప్రేమవార్తారూప మైనయశనిఘాతమే వారిని జంపినది.

ధ—అట్లైన నాత్మహత్యాపాతక ముండదు. మీ రూఱడిల్లుఁడు.

శాం—వారిని వెగనేజకినేసు బాపము లేదు.

భా—ఆపని మాచేఁ జేయింతురనియే యింతదూరము శ్రమపడి వచ్చినాము.

సో—ఆపుణ్యము గట్టుకొని మాకు స్వస్వాణవిముక్తిఁ గావింతురని గంపెఁడాసతో నిద్రాహారములు లేకుండ నడచి వచ్చినాము.

హాం—నే నెట్లు చేయింపఁగలను?

భా—నా రిచ్చటనే యున్నారని విన్నాము.

ధ—ఏమి? నేను గానని ప్రమాణపూర్వకముగఁ జెప్పఁగలను. రాజా! నీ వున్నావేమో నాకుఁ దెలియదు. బహుకాంతాప్రియుఁడవుకదా!

హాం—నేను నిప్పు డేకకాంతాప్రియుఁడనే. హా రూపలతా!

భా—అయ్యో! రాజేంద్రా! ఆచండాలురాలే మాకొంపఁదీసినది.

ధ—ఆమె క్షత్రియకన్యయే!

భా—స్త్రీహత్యాపాతకురాలు జన్మముచే క్షత్రియకన్యయైనను, జర్యలలోఁ జండాలకన్యయే యనవచ్చును. తప్పులేదు.

సో—దానితోఁ గూడ నింకొకమాలమాతంగి యున్నది. దాని పేరు కాత్యాయని.

ధ—రెంటికి నొకటేయర్థమా.

హాం—ఏమేమీ! మీకాగ్రహపాత్రులైనవరాధములు మాచేఁ గారాబద్ధులైనవారేనా?

భా—శ్రోత్రపర్వమైనయామాట వినుటచేతనే యిక్కడకు రావలసివచ్చినది.

సో— క. నరనాయక! విల్లమ్ములుఁ
గరవాలముఁ జంకఁ గటిని • గదలుచును భవ
స్మరణాంగీకారముకై
త్వరపడుచున్నది మాకు • దయ సేయవలెన్.

హాం—శత్రుశత్రులు మాకుఁ బరమమిత్రులుగదా!

(అప-ధ్యా)గీ. ప్రక్కనున్నట్టి యాచిన్న • వాని సొగసు
చూడు పరమేష్ఠి తొలుతను • జెలువగానె
పొనరుపఁగ నెంచి పిమ్మటఁ • బురుషుఁ జేసె
స్వాంతమును బట్టఁజాలన • న్భయముచేత.

క. ఇంత చెలువంబుఁ గలిగిన
కాంతయె నాకబ్బెనేని • కావలసినదే

మంతకు ? రూపలతాకృత
సంతాపము వోయి హృదయ౯శాంతిం గందున్.

ధ—(అప-పాం) నిదానించి మఱి కర్తవ్యము నిశ్చయించుకొనుము. (ప్ర) సోమ
వర్మా ! నీచెల్లెలు బ్రాహ్మణపురుషు నేల వరించినది ?

సో— గీ. చూపు వగచూచి నెమ్మోము ౯ సొబగు చూచి
నడలమురి పెంబు మాటల౯ బెడఁగు చూచి
క్షత్రియ, ధరామరుని బెండ్లిఁ ౯ గలయవచ్చు
ననెడుశాస్త్రోక్తి చూచి మా౯యలను జిక్కె.

పాం—భానువర్మా ! సోమవర్మా ! గాఢమిత్రత్వసూచకముగా నొకసారి కౌఁగిలిం
చుకొందు మిటురండు !

భా—
చ. ఇట కరుదెంచినట్టిపని ౯ యే మొనరించి, యట న్ప్రితికిరియో
ద్భటరభసంబుతో రిపువి౯దారణకృత్యము చక్కఁబెట్టి, య
క్కటికను బ్రోసి రక్తమును ౯ గన్నులపండువుగాఁగఁ జూచి, యం
తటఁ బరితృప్తి నొంది, నర౯నాథ! యొసంగెదమయ్య! కౌఁగిలుల్.

సో—
మ. భవదానందవివర్ధనోత్సుకమహా౯బాహాపరిష్వంగవై
భవ మంతంబున నీకొసంగెదము భూ౯పా ! పాంథనిర్బంధనో
త్సవ మిట్టట్టులు విస్మృతిం బడదు; వాం౯ఛాసిద్ధికి న్నీకు ముం
జవిగా సంచకరం బిదే! కని, యెద౯ న్సంతోషముం బొందుమా!

(అని భానువర్మ సోమవర్మలు గౌఁగిలించుకొందురు.)

పాం—సరే! ఇప్పటి కింతటితో నేసంతోషింతును. రాజపుత్రులారా! వారికిఁకను
రెండురోజులు గడువున్నది. రూపలత యక్కఱలేదని యప్పటికిననకపోయి
నయెడల నాయవాచ్యుల సైనికులచేఁ గోయించి చీరించెదనని చెప్పితిని.

సో—(అప-భా) పతులగుటచే వారు మనకు నవాచ్యులే యని చెప్పకొనవచ్చును.

భా—అదుర్మార్గురాలిని వదలిపెట్టెద నని చెప్పినయెడల ?

సౌం—నేనన్న మాటప్రకారము వారిని జంపింపఁగూడదు.

సో—అట్లైన మాయభీష్టము లెట్లుసిద్ధించును?

ధ—రూపలతను విడిచిపెట్టి, దీనికి దానికిఁగూడ జెడినవాని కాశిక్ష చాలదా?

సో—(అప-భా) శివశర్మ, యీధర్మాచార్యుఁడు మనకు శత్రుచయములోవాఁడు గాఁడని చెప్పెనుగదా, యట్లగపడఁడే!

భా—(అప-సో) అతఁ డెన్నఁడబద్ధమాడువాఁడు గాఁడు. (ప్ర) రూపలతజోలి మా కేమున్నది? దానినిబోనాడినఁ, బోయినవారిప్రాణములమఱలవచ్చునా?

ధ—వారిని జంపినమాత్రము రాఁగలవా?

సో—రా లేవు. కాని

గీ. పైనొ క్రిందనొ యున్న యాౘనవితలహృద
యములు చల్లారు నెట్లెట్లు ౘ ట్లైనయెడల?
బగ్గుమని మండు మాక్రోధౘనవహ్ని లెట్లు
లుడిగి యొనరించు మాకుఁ జిౘత్తోపశాంతి?

భా—అయ్యా! అక్కచెల్లెండ్రున్నవాఁడవైన నట్లు చెప్పవు.

ధ—లేనిచెల్లెండ్రున్నారని యబద్ధమాడి స్వవచనపోషణ మెట్లుచేసికొందును?

సౌం—క్షత్రియార్భకులారా! రూపలతను నేఁ గామించి వారిని బంధించినాను. నా కష్టంకిలేకుండ వారు చేసినయెడల వారిని వధింపనేల?

భా—అయ్యా! మీకు సాహాయ్యముచేయుటకై మే మిచటికి రాలేదు. మీసాహాయ్యము నర్థించి వచ్చితిమి; వారిని గనులారఁ జూచి వారికిఁ జేతులారఁజేయ వలసినచిత్రమారకృత్యములు చేసి పోవలెననుకుతూహలముతో నింతశ్రమపడి వచ్చినాము. తరువాత మీచిత్తము మా భాగ్యము.

సో—మిత్రగాఢాలింగనమును గోరినమీరు మాకాశాభంగమును గలుగఁజేయఁదగదు. వధించివలె మీరొసుకల నిండని కోరము.

భా—శిబివలె మీకండలను గోసి యిండని యడుగము.

సో—రాఘేయునివలె నొడలొలిచి దయసేయుఁడని ప్రార్థింపము.

భా—రాజ్యాభిలాషను రాలేదు.

సో—ఉద్యోగవాంఛతో సంతకింటె రాలేదు.

భా—ధనకాంక్ష లేదని వేరుతో మనవిచేయునక్కఱలేదు.

ధ—కాంతార్థులై రాలేదుకద?

సో—అటువచ్చుట కధిపుఁ డవివాహితుఁడే?

పౌం—మారసుందరులారా! నాయొద్దఁ గన్యలున్న మీరడుగకే యిచ్చుటకు సిద్ధుఁడనై యున్నాను.

భా-నిజముగా నంతదయయేమాపైనున్న యెడల,నడిగినస్వల్పోపకారము చేయరాదా?

సో— ఆ. మీరు మెచ్చినట్టి ♦ మారసుందరులైన
రాజసుతులచేతఁ ♦ బాణితులగ్న
లైనవారిఁ జంపి♦నట్టి ఘాతకులఁ జం
పించి యిడఁగదయ్య! ♦ ప్రీతి మాకు.

భా—మీరు కసాయివాండ్రచేఁ జేయింపఁదలఁచుకొన్నపనియే, యేమియు నీయకుండ, నీయిరువురచేఁ జేయింపుఁడని మాప్రార్థన.

ధ—మీభోజనము లైనవా?

భా—దుష్టశిక్షాసమవర్తియైనపౌండ్రకమహారాజు రాజధాని యనుపరమపుణ్యక్షేత్రమునకు వచ్చినాముగదా!

గీ. పట్టుదలతోడ క్షేత్రోప♦వాస ముండి
పారణమొనర్తు మీపన్నులు ♦ తీరెనేని,

సో— కన్నులనుగాని నోటను♦గాదు; దుష్ట
శత్రుపలలాస్రములను, భ♦క్ష్యములఁ గాదు.

పౌం—నాయభినివేశముకంటె వీరిక్రౌర్యము హెచ్చుగానున్నది. (అప-ధ) కారాగృహరక్షకత్వము వీరిపైఁ బెట్టిన బాగుగానుండును. మిత్రమా! నీయభిప్రాయమేమి?

ధ—(అప-పౌం) నాయభిప్రాయప్రకారము నీవు నెళ్లుట లేదుకాదా!

పౌం—(అప-ధ) అనుసరించుట కనుకూలము లైనయభిప్రాయములు నీవిప్పుడిచ్చుటయేలేదు. అయిన నీవిషయమున నీ వేమిచేయుమనెదవు?

ధ—(అప-పౌం) వారిని జెఱనుండి విడిపించి పంపి, వీరి నెట్లువచ్చినవారి నట్లపొమ్మని చెప్పవలెను.

శాం—(అప-ధ) అది చేయనని యెన్నిమాఱులో యీవఱకే చెప్పినాను. ఇది చేయుటకు మనసొప్పకున్నది.

ధ—(అప-శాం) నీకర్మము నే నేమిచేయఁగలను?

శాం—(అప-ధ) అట రూపలతాసాంగత్యమును, ఇటఁ గొన్నాళ్ళయిన వీరి రామణీయకదర్శనలాభమును. నాకర్మము బాగుగానే యున్నది. (ప్ర) రాజకుమారులారా! మీశత్రువులను బంధించినకారాగృహమునకు రక్షకాధిపతులుగా నుండెదరా? ఇవిగోఁ దాళపుఁజెవులు.

ధ—కుసూలసంరక్షణము మూషికములపైఁ బెట్టినావు. మంచిబుద్ధిశాలివి.

భా—భంజింతుము గాని, భుజింపము. భయపడనక్కఱలేదు.

ధ—(స్వ) భంజింతురో భంగింతురో! మూఢుఁడు తెలిసికొనలేకున్నాఁడు. ఇంతకంటె నెక్కువమాటలాడిన, శివశర్మకు ద్రోహినౌదును మిత్రద్రోహులలో న్యాయమైన ద్రోహమే మంచిది. (ప్ర) భయాభయము లప్పగించినవారును బుచ్చుకొనువారును జూచుకొనవలసినవి గాని నాకేమి?

భా—(తాళపుఁజెవులు గ్రహించి) మహారాజా! మాది యొకమనవి. తాము రెండురోజులలోఁగాని యీపని చేయఁగూడదన్నారు. ఒకవేళ సోదరీమరణజనితక్రోధావేశముచే నది తత్పూర్వము జరిగినయెడల మమ్ము క్షమింపవలెను.

శాం—సుందరవిగ్రహులారా! అట్లు చేయకుఁడనియే నాయాజ్ఞ. కాదు నాప్రార్థన! నిష్ప్రయోజనముగా మాటదిరుగుట మావంటి రాజేంద్రులకుఁ దగదు.

శో—ప్రయోజనము లేకేమి? అపేక్షించినఫలము కొంచెము ముందుగా దొరకవచ్చును.

శాం—నెల లున్నవాఁడ నిఁక రెండురోజులుమాత్ర ముండలేనా?

భా—(స్వ) నీ విలపైనుండురోజులు నిఁక రెండే. (ప్ర) రాజేంద్రా! ఇంతదూరము వచ్చినవారామోహినులకో ద్రోహిణులకో, కండలొలుచునప్పుడు కన్నీళ్ళతోఁ గడవార్త లేమైనఁ బంపుదురేమో! యవివ్రాసి యీయనీయవచ్చునా?

శాం—నీకుఁగూడ నింతదయ పుట్టుట యాశ్చర్యమే! అది యీవఱకే జరిగినది. ఇది మీ రుభయులును జూచుకొనవచ్చును. (లేఖ యిచ్చును.)

భా-శో—(చదువుకొని యుపశమముగాఁ గన్నీళ్లు రాల్తురు.)

శాం—ఏమి యట్లేడ్చుచున్నారు?

భా— గీ. లేమలకుఁ బ్రేమ యున్నదో ♦ లేదో యటంచు
నిట్టు లేడ్చిరి పాపాత్ము ♦ లింకఁ బ్రేమ

నిండుగా నున్నదనుకొన్న • నెలంత లప్పు
డెంత యేడ్చిరో యని యేడ్చు • చిప్పుడేము.

మహారాజా! ప్రాణపతివియోగశోకమంత శోక మెక్కడను లేదు.

ప్రా— గీ. ప్రాణ ముండంగఁ బఱపఱ • పరశరీర
ములను కోయుటకంటె బాధలను బెట్టు
మరణ మే దేని యున్న, నా • మరణమునకు
నెరలఁ జేయఁగవలయు నిర్వరను భూప!

ఆహా! మా క్రోధాగ్నిజ్వాల లైన నీదుఃఖబాష్పముల మతిఁగించుచున్నవిగాని యింకించి మాన్పలేకున్నవి. బావా! యింక నీలేఖను మహారాజుగారికిఁ దిరుగ నిచ్చివేయుము. చాలును.

ప్రా— కావలసిన మీయొద్ద నుంచుకొని, యింక నేమైన వారు వ్రాయఁదలఁచుకొన్నచో, దానితోఁగూడ నిది నాకీయవచ్చును.

భూ— అట్లే చేసెదము. చిత్రవధకు ముందు వారిముఖముముందఱ నిది చదివి చెప్పి, తరువాతఁ బని సాగించెదము.

ప్రా— గడువు గడచకముందు మాత్రము వారిని జంపఁగూడదుసుండీ!

భూ— మా చిత్తహయఖలీనములను గట్టిగ బిగఁబట్టి లాగి యెట్లో మీయాజ్ఞకు బద్ధులమై యుండెదము.

స్తో— దాఁటినతర్వాత సైనికకృత్యములు సాగింపవచ్చునుగద.

ప్రా— రూపలతను వదలుదునని చెప్పినయెడల, మఱల నాయాజ్ఞను గైకొనవలెను.

ధ— దౌష్ట్యమునకుఁగూడ నవనిలో నవధియున్నది.

భూ— మఱల మీకు శ్రమ యీయవలెనా?

ప్రా— ఈయక తప్పదు.

స్తో— తప్పనియెడల వారు విధించినట్లు చేయక మనకును దప్పదు.

ప్రా— సేవకా! (ప్రవేశించును.)

సే— చిత్తము.

ప్రా— సరిగా రేపుదయ మాఱుగంటలకుఁ గారాగృహము వీరిద్దఱవశము చేయవలెను. నేఁటి కవసరము లేదుగనుకఁ దాళపుఁజెవులు వీరియొద్దనే యుండును. నేఁటినుండి దూరదర్శి పృథ్వీరూపులు వీరికధీనులై యుండురు. కారాభృత్యవర్గమునకు మాయాజ్ఞ యిప్పుడే పోయి తెల్పుము.

సే— చిత్తము. (అందఱు నిష్క్రమింతురు.)

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# రూపలత.



## సప్తమాంకము.



ప్రదేశము——కారాగృహము.

ప్రవేశము—పృథ్వీరూపుఁడు, దూరదర్శియు.

పృ——మిత్రమా! నేఁడు మనజీవితగ్రంథముల కుపసంహారవాక్యములు చెప్పుకొనవలసియున్నది.

దూ——అటుగానిచోఁ గారాగారకథకు మంగళము పాడుకొందుము.

పృ——ఈయడియాస నీకేల కలుగుచున్నదో తెలియదు.

దూ——సీ. పున్నమజాబిల్లిఁ • బోలుమోములవారు
రాజితాకర్ణనే • త్రములవారు
పక్వబింబారుణా • వర్ణోష్ఠములవారు
భ్రమరాభకుటిలాల • కములవారు
దగదగమెఱసెడు • తనుకాంతిగలవారు
మొలకనవ్వులతోడఁ • బలుకువారు
శృంగారసరసియా • నంగజాలమువారు
పసగల్గులేలేత • వయసువారు
గీ. పటుకృపాణధనుర్బాణ • పాణు లగుచు
నిద్ద జేతెంచి నిద్దుర • నెనసియున్న
మనల స్పృశియించి లెండులెం • డనుచు లేపి
నట్లు కలగంటి రాత్రి ధ • రాధినాథ.

పృ—కలలలో నిభోజనములతోఁ గడుపులునిండునా దూరదర్శీ! జాగ్రదవస్థలో నిరంతర

చింతాసముద్రమునఁ గొట్టుకొనుచుండుటచే స్వప్నావస్థలోఁ బ్రతిఫలించి కనఁబడును.

రూ—నిజమే యనుకొన్నాను గాని, యిదివఱకు లేనియట్టికల యిప్పు డేలరావలెను ? మనకష్టములు లంతరించునని నాకు గట్టినమ్మకమున్నది.

వృ—కష్టములు లంతరించునో కాయము లంతరించునో రేపు భానూదయ మైనప్పుడు తెలియును.

(భానుసోమవర్మలు ప్రవేశింతురు.)

భా—(అప) ఆ. కొలఁకునుండి తీసి ♦ వెలుపలఁ బడవేయ
వాడి వ్రాలియుండు ♦ పద్మములటు
చెన్నుదఱిఁగి యొల్లు ♦ చిక్కియున్నవో వారి
సుందరాస్యములను ♦ జూడు మకట !

సో—(అప) ఆ. ఎంతగా వాడియున్న న ♦ పీనసహజ
రామణీయకశోభ, చిత్రముల, గురుని
చిత్రవిరచననైపుణిఁ, ♦ జిన్నవుచ్చి
యెటులుపిసాళించుచున్నదో ♦ యోచి చూడు.

వృ—(అప) రూపవతీ ! అటు చూడుము ! నీకు స్వప్నసాక్షాత్కారులైనవారు మన యెదుట నున్నారు. నీవు నిజముగా మహానుభావుఁడవు.

రూ—(అప) ఔను ! ఈనుందరాకారులే నాకుఁ గలలోఁ గనఁబడినవారు.

భా—మహారాజా ! నమస్కారము.

సో—మంత్రికుమారా ! నమస్కారము.

వృ—దివ్యతేజస్సంపన్నులారా ! స్వర్గమునుండి మాదురవస్థఁగని జాలిపడి మమ్ము రక్షింపవచ్చినయమరకుమారులలో నెవరో మీరు తెలుపఁ బ్రార్థించుచున్నాము.

భా—అయ్యో ! రాజకుమారా ! మేము మీవంటిమర్త్యులమే కాని దేవతలము గాము. రూపములఁ జూచి మోసపడఁగూడదు.

రూ—మీరిటు లేల వచ్చి మాకుఁ గనుపండువు చేయుచున్నారు.

సో—వచ్చుట నిజమే కాని, కనుపండువుచేయుట కల్ల. పౌండ్రికమహారాజుగారిచే మేము కారాగృహాధిపతులముగాఁ గ్రొత్తగా నేర్పఱుపఁబడుటవలన నిటకు వచ్చినాము.

భా—జరిగినది, యింక ముందు జరుగవలసినది, ప్రభువుగారు మాకుఁ బూర్ణముగాఁ దెలియఁబఱిచినారు.

పృ—అట్లయిన దూరదర్శీ ! నీస్వప్నము నిజమే కాని ఫలము విపరీతమైనది.

దూ—అయ్యో ! యీకమనీయాకారుల కాకఠినాత్మునేవయే కావలసివచ్చెనా ?

పృ—రేపు రాఁబోవుకసాయివాండ్రదర్శనము కష్టతరము చేయుటకా యిప్పుడీస్త్రీ సుందరులు మాకంటఁ బడుట ?

భా—రాజేంద్రా ! మంత్రివరా ! మీరింకను నేఁడు భుజింపలేదు.

పృ—భోజనపదార్థములు తీసికొనివచ్చినా రింకను దీసికొనిరాలేదు. ఈశ్రమవారి కింక నొకటిరెండుసారులు.

భా—అయ్యో ! మీమనోహరాకృతులు చూచిన మీకు మేము స్వయముగా వడ్డించి పెట్ట బుద్ధి యగుచున్నది. ఆయానందము మాకిచ్చెదరా ?

పృ—మీకాశ్రమ యేల యీయవలెను ?

సో—ఆనంద మిచ్చునది శ్రమకాదు.

దూ—నేఁడు భుజించి రేపు వధింపఁబడుట కెవరు పెట్టిన నేమి? మారసుకుమారు లాపని యెట్లు చేయఁగలరు?

సో—రేపటిపని చేయుటకు సిద్ధులైయున్న సుకుమారులు మహారాజునకు మంత్రిమౌళికి భోజన మిడుట కఠినకృత్యముగా నెంచరు.

పృ—కసాయివాండ్రచేఁ గండలు గోయించెద నన్నాఁడే మీప్రభువు.

భా—స్వభావసిద్ధమైనధర్మములు వదలుకొని సేవావృత్తికి దిగి యాపని కియ్యకొనిన మేము కసాయివాండ్రకుఁ దీసిపోము. అయినను మీరెవరినో వదలుకొనుదుమని చెప్పిన మేమాపని చేయనక్కఱలేదన్నాఁడు.

పృ—ప్రాణాధికను వదలుకొనుటకంటెఁ బ్రాణములు వదలుకొనుట సులభము. హా ! రూపలతా !

భా—మీరిట నింత పరితపించుచుండఁగా నింటిలో మూఁడుపూఁటలు హాయిగా మెక్కి మురియుచుండునది మీకుఁ బ్రాణాధిక యెట్లగును ?

పృ—నాయవస్థ యామె కెట్లు తెలియును ?

దూ—తెలిసినను నేమిచేయఁగలదు ?

సో—మీరు ప్రాణములు గోల్పోయి చేయునదేమి ?

పృ—నిలఁబెట్టుకొనిమాత్ర మేమిచేయఁగలము ?

భా—కారావిముక్తియైనపిదపఁ గార్యములు చక్కఁబెట్టుకొనరాదా ?

సూ—(ఆహ) ఈతఁడు నేను జెప్పినట్లే చెప్పుచున్నాఁడు చూచినారా?

వృ—అయ్యా! సత్యభంగమునకు వెఱచి యట్లు చేయలేకున్నాను.

సో—వీరును వీరికాంతను వదలుకొనరాదా?

భూ—వదలుకొన్నను ప్రయోజనము లేదు. రూపలతను వదలినచో మమ్ముఁ బ్రాణములతోఁ బోనిచ్చునఁట.

సో—ప్రయోజనమున్న వదలుకొందురా? ఆయనకువలె మీకు మీప్రియురాలు ప్రాణాధిక గాదన్నమాట.

దూ—అట్లుగాకున్న నిట్టిస్థితి కేల వత్తును?

భూ—ఆయన ధర్మభంగమున కంతగా వెఱవరన్నమాట. పోనిమ్ము. సోమవర్మా నాస్తికులచిత్తుల మఱింత యేల యాకులపెట్టెదవు?

దూ—గీ. ధర్మనిరతులయెడల నే ధర్మచింత,
కారణముఁ జొన్పుట యధర్మ కార్యమయ్యెఁ,
గనుక నాయాపద యధర్మ కలనతోనె
పాపుకొనవలె, నద్దిపా పంబు గాదు.

సత్యభంగభీతిచే సతీభంగమును ప్రాణభంగమును గానున్నవి. ప్రాణప్రియారక్షణమునకై యీస్థితిలో నసత్య మాడవచ్చుననియే నాయభిప్రాయము కాని మాప్రభున కది యిష్టముగాదు. నేనేమిచేయుదును?

భూ—వీరెప్పుడైన మీప్రియురాండ్రమొగములు చూచినారా?

సో—చూడకున్న నింత కామపీడితులైయుందురా!

వృ—ఆయదృష్టము మాకింకనుగలుగలేదు. హా! జీవేశ్వరీ! జీవితఫలమైననీముఖారవిందదర్శన మొకసారియైన, రేపురానున్న దుర్మరణము నంతలక్ష్యముచేయనుగదా!

సో—ఈకామబాధ యంతయు గగనకుసుమములకోసమేనా?

దూ—గగనకుసుమములుగావయ్యా!

క. మీరున్నయట్లె వారును
సారసలోచనలు గలరు తమ్మోతలమందున్
వారిమనోహరచిత్రా
కారము లరవడిమె మాకుఁ గనుపండువుగన్.

అవిచూచి వారిదర్శించి మాజన్మసాఫల్యమొనర్చుకొనుటకు వచ్చుచుండఁగనే,
దారిలో మీప్రభువుగారిచే మా కీకారాగారమహాభాగ్యము తటస్థించినది.

భా—కేళీగృహముగా నున్నది గాని యిది కారాగృహముగాఁ గన్పట్టుటలేదు.

పృ—వారుకూడ నిట నున్న నట్లే. భోగోపకరణముల కేమియుఁ గొదవలేదు.

భా—మహారాజా! నీవు ధర్మశీలుఁడువలెఁ గాన్పించుచున్నావుగదా! సకలాపే
క్షుఁడై యున్నమాప్రభువున కాకాంత నేల విడిచిపెట్టఁగూడదు?

పృ—సఫలాపేక్ష యొక్కటే చాలదు.

స్రో—మఱి యేమికావలెను?

దూ—పౌండరీకునియందామె మనసు లగ్నమై యున్నట్లు నిదర్శన ముండవలెను.

భా—లేనట్లు మీ రెట్లూహించుచున్నారు?

స్రో—ఈయన నామె వలచినట్లు మీ కెట్లు తెలియును?

పృ—రామానందుఁడనునొకసాధు వామె నన్నువరించునట్లు చేసెదనని చెప్పినాఁడు.

భా—ఓయివెఱ్ఱిమహారాజా! మధ్యవర్తులరాయబారములవలన మదనవికారము లా
ప్పతిల్లునయ్యా!

స్రో—(అప) మనకెట్లుకలిగినవో?

పృ— ఆ. వెనుక హరిపదాబ్జ • విహరణశాలియౌ
చిత్తబంభరంబు • చెలువమోముఁ
దమ్మిమీఁద వ్రాలి తద్దృష్టి నిపుడున్న,
దేమిజరుగనున్న • దో మహాత్మ!

భా—(స్వ) పోయినభక్తిని బ్రబలము జేసికొని భ్రమరితో గలిసి మరల నీచిత్తభ్రమరము హరిపాదారవిందములకడకే పోవునులే. భయపడకుము.

పృ— గీ. చిత్రకన్యకకన్నులీ • క్షించినాఁడ,
సుస్మితసమేతమై కృపఁ • జూపునట్టి
కలికిచూపులు నామీఁద • నొలికెఁ గాని,
కొఱకొఱలు గ్రుక్కుచూడ్కులు • వఱుపలేదు.

స్రో—రాజచంద్రమా! అట్లు చిత్రకుఁడు లిఖియించినకన్ను లింకొకరీతిగా నుండఁ
జాలవు. నీకొక్కనికే యట్లగపడుచున్నవని యుబలాటపడెదవేల? ఆచిత్ర
మెదుటనున్న యందఱ కట్లే చూపట్టును, యువతీసక్తులచిత్తములు నన్మత్తు
లచిత్తములను భ్రమాయత్తములై యుండునుగదా!

భా—మీరింత మెచ్చుకొనుచున్న కాంతపటము మాకుంగూడ నొకసారిచూపెదరా? యనూయపడెదరా ?

దూ—చిత్తశాంతికరములైనచిత్తరువులను మాకత్తులతో మీప్రభువుగారు దొంగిలించినారు. చిత్తస్థములైనచిత్రములే యిప్పుడు మాకాధారములు. అవి మీకుం జూపుట కెట్లు వీలగును?

సో—మహారాజా ! మీరు మంచిగడుసుమంత్రిని సంపాదించినారు.

భా—(అప)చెలీ! ఎంతసేపు వీరినిట్లువేధించుట! స్వరూపప్రకటనముచేసికొందమా?

సో—(అప) సఖీ! భగవత్కృపచే నిప్పటికిం జరితార్థులమైతిమి. నలువురమొకచోటం గలిసికొంటిమి. జతజతగా విడిపోవుమహోత్సవమే యింకంగావలసినది! సేవకులెవ్వరు మనసెలవులేకుండ రాకుండు నేర్పాటులు చేసితిమి. చుట్టుగోడలు బ్రహ్మభేద్యములు. ఇంకం గొంతసేపు వినోదము సాగింతము.

భా—(అప) దేనితో ? ఎట్లు?

సో—(అప) గురువుగారు తీసికొనివెళ్లినపటములు గాక మనయొద్ద రెండున్నవికదా ? వానిని జూపి కథను సాగింపుము.

భా—మహారాజా ! మీకాపటములు లభించిన సంతృప్తులై యుందురా?

సో—కాంతాభావమందు వానితోం గాలక్షేపము చేసికొనరా ?

భా—ఈపటము మీదేకాదా ? (చూపును.)

పృ—ఇది దూరదర్శిది. దూరదర్శీ! నీవదృష్టవంతుండవు. నీకాంత నీకు దొరకినది నష్టధనప్రాప్తి శుభసూచకము. (పుచ్చుకొనియిచ్చును.)

సో—ఇది మీదైయుండవచ్చును, మంత్రి యదృష్టవంతుండై మహీపతి దురదృష్టవంతుం డగునా? (ఇచ్చును.)

పృ—మహాభాగ్యము, మిత్రమా! నీస్వప్నము ఫలమీయం బ్రారంభించినట్లున్నది.

భా—వచ్చినస్వప్నమేది ?

పృ—మీరిరువు రతనికి స్వప్నమునం గానిపించిరంట.

సో—మాటలు తడంబడుచున్నట్లున్నవి. కామాతురులకుం గలలలో వారికాంతలు వత్తురు గాని పురుషులువచ్చుట యెన్నండు వినలేదు.

దూ—కాదయ్యా! పురుషులే! మీవంటివారే, మీరే కాన్పించినారు.

సో—ఆయన మేమనిరి. మీరు మావంటివారని మొదటం జెప్పి పిమ్మట మేమని నవరించుకొనిరి. ఏది నమ్ముదుము?

పృ—మీకీపటము లెట్లువచ్చినవి?

భా—చూచితివా సోమవర్మా! యసూయ యప్పుడే యంకురించుచున్నట్లున్నది.

సో—మహారాజా! మంచిమిఠాయి చేతికి దొరకినప్పుడు దాని ననుభవింపవలెను గాని, యది యెవరుచేసిరో, యెక్కడఁ జేసిరో యెట్లుచేసిరో, యనిపృచ్ఛించి కాలమువృథా పుచ్చుటవలన లాభ మేమి?

భూ—పౌండ్రికుఁడు పుచ్చుకొన్నపటములు వీరి కిచ్చెనని గాఁబోలును.

పృ-ఇతరుల కిచ్చుటకుఁ బుచ్చుకొనలే దాదురాత్ముఁడు.మనయొద్ద నేయుంచనీయని వాఁడు మనకంటెవేయిరెట్లులందమగులయీనలకూబరులచేతులలోఁ బెట్టునా?

భూ—ఆస్వప్నముమాట కేమి గాని యిదియొక పెద్దస్వప్నముగాఁ దోఁచుచున్నది.

భా—మీరు పరమాద్వైతులవలె నున్నారు.

సో—నిజమో, కాదో పరీక్షించి చూతును. మంత్రికుమారా! మేము మేమేనా యన్యులమా?

భూ—మా కేమియుఁ దోఁచుటలేదు.

సో—పోనిండు మీరు మీరేనా, మావారా?

భూ—మేము మేమే కాని, మీరు మమ్ము రక్షించుటకు వచ్చినవారు గాని శిక్షించుట వచ్చినవారుగాఁ గనఁబడరు.

పృ—ఓశోభనదేవతలారా! నేను నన్నే యనుకొనుచున్నాను.

గీ. వెన్నెలల వెదచల్లుమీ • వెడఁద లైన
బెళుకుబేడిసకన్గవ, • లీఁకరాస్త్ర
దంగదారణదుష్టకృ • త్యములు రేపు,
క్షోభపడి మూఁతవడ, • కెట్లు చూడఁగలవు?

—మేము శోభనదేవతలమైనయెడల, మీకు శుభములు చేయవలెను గదా! ఏ పాట్లో పడి మీకుఁ గారావిముక్తి గావింతుమనుకొందుము. మాకుఁ బ్రత్యుపకార మేమి చేసెదరు?

పృ—ఇదియే ప్రత్యుపకారము. (మొక్కఁబోవును.)

—(చేతులు పట్టుకొని యాఁపి) మీకంటెఁ జిన్నవారమగు మా కది యపకారము గాని యుపకారము కాదు. మేము మీయాశీర్వచనపాత్రులము.

పృ— గీ. తమ్మిమేకులకంటె మె • త్తనయి, కొంచె
మున్నమయి, వీణతంతుల • నోజఁగంపు

మొంచు, చానంద మిప్పుడు నా ♦ కొసంగు, మృదుల
పాణులు కృపాణ మేరీతిఁ ♦ బట్టఁగలవు ?

భా—ఎట్లు పట్టునో యచిరకాలములో మీరే చూడఁగలరు.
సో—మాకుఁ గావలసినయుపకారము లేవో, సెలవైన, మనవిచేసికొందుము.
రూ—ఇట్టిపురుషు లర్థించుటయు మేమిచ్చుటయుఁ దటస్థించుట యెంతభాగ్యము!
సో—అడుగుమనెదరా? భానువర్మా! నీవాంఛ మొట్టమొదటఁ దెల్పుము.
భా—తమరు నాయొద్దనుండి పుచ్చుకొని వారి కిచ్చినపటము—పటము గాదు. పట
మూలము, నా కనుగ్రహింపవలెను.
దూ—అయ్యో! ఈప్రాణమును గాపాడి, యాప్రాణమును బుచ్చుకొందువా?
సో—వదాన్యతాపరిభావమంతయు వర్థ లర్థించుటకు మునుపేనా?
భా—సోమవర్మా! ఆయన సత్యమం దంతయభినివేశము గలవారు గారని యీ
కే తెలిసె, నామహారాజట్టివాఁడు గాఁడు. ఆయన నడిగి చూదుము.
సో—మహారాజా! అడిగి లేదనిపించుకొనుటకంటె ముందు మీయభిప్రాయము
తెలిసికొనుట మంచిది.
భా—ఇతరుల నడిగి లబ్ధకాము లౌటకంటె గుణాధికుల నడిగి విఫలమనోరథు
యే మంచిదనికాదా కవికులతిలక మగుకాళిదాసుఁడు చెప్పినాఁడు. సం
హింపక యాచింపుము. నీవు రూపలత నపేక్షించినను దప్పక యిచ్చు
వృ—అట్టికోరిక యాయన కుండునా ?
భా—నవనవయౌవనాంకురుఁ డగుసోమవర్మకు నారీరత్నమగు రూపలతపై వల
గలుగుట యేమివింత?
వృ—ఒకఁడు వలచినకాంత నాయన వరించునా ?
భా—పాండురాజుఁడు వరించినకాంత నింకొకప్రభువు వరింపలేదా?
దూ—అయ్యో! అర్థనాచిత్యానౌచిత్యము లర్థించునామహానుభావుని మనసుగ్ర
మునుబట్టి యుండును గాని యుక్తులఁబట్టి యుండవు.
భాను—పోనిమ్ము సోమవర్మా! ఫలాపేక్షలేకుండఁ బరమార్థచింతతోఁ బాలే
రపీతికొఱకుఁ బరసాహాయ్యము చేయుదము.
సో—ఈయనపరోపకారబుద్ధి బాగుగానున్నది. తానీయఁడు. ఇతరుల నీయనీయఁడు
వృ— క. కొందలపడె నీవఱకే
డెందములు, మఱింత వాని ♦ డిల్లపఱుప, గొ

యిందుముఖులార ! శాంతిం
బొందింపుఁడు, మీకుఁ జాలఁ ♦ బుణ్యం బొదవున్.

సో—మమ్మిందుముఖులారా! యని సంబోధించుచున్నారు. మతి చలించుచున్నదా యేమి మహారాజా!

భా—ఇందుముఖుల మైన మాయిందుముఖుల నేల కాంక్షింతుము ?

సో—పురుషులుమాత్రి మిందుముఖులు గాఁగూడదా! (అప) రాణీ! నీ...ను, ఆయనపదనకమలమును సంప్రీతించి నిదానముగాఁ బరీక్షింపుము నా పటము నా కనుమానముఁ గలిగించుచున్నది.

పృ—ఒక్కసారి శిరోవేష్టములఁ దీయుదురా ?

సో—(అప) ఇది నాపతిగారికుతంత్రము. చేతిబొమ్మను నామోమును ... సారులోఁ బరీక్షించినారు. ఇఁక మనయాటలు సాగవు.

భా—మాశిరస్కములు మీ కేమి బాధ కలిగించుచున్నవి ?

పృ— గీ. చంద్రబింబంబొ కాదొ య ♦ న్నందియంబు
గలుగు నెట్టులు నీలమే ♦ ఘమున, నట్లె
నానెలఁతముద్దుమోము మది ♦ యోనొ కాదొ
యనెడుశంక శిరోవేష్ట ♦ మునను గలుగు.

భా-సో—(శిరోవేష్టములు దీసి వారిని గౌఁగిలించుకొందురు.)

పృ— సీ. కొలుకులనుండి దొ ♦ రలుగఁ గాఱెడుచల్ల
చల్లయానంద బా ♦ ష్పములవానఁ,
గమ్మతావులఁ గోడఁ ♦ గలసినవడగాడ్పు
పగిది న న్నాఁకుని ♦ శ్వాసనమితిఁ,
గించిదార్ద్రంబును ♦ గించిదుష్ణంబునై
యింపగుకెమ్మోవి ♦ కంపములను,
గవచంబుమాటున ♦ గాఢాను రాగసం
చటుల మౌగుండియ ♦ తటతటలను,

గీ. వెలఁదికౌఁగిటఁ గురవక ♦ వృక్షమువలెఁ
జెలఁగి నామేను దాల్చిన ♦ పులకమాప

మోదపుష్పంబులను, నాదు ముద్దుగుమ్మ
వచ్చి యిట నున్నదని యిప్డు స్పష్టమయ్యె.

దూ—నాకల యిప్పుడు సంపూర్ణఫలము నిచ్చినది.

రూ—ప్రాణనాథా! ఇంతవఱకుఁ బ్రికాశితలము గాకుండ మిమ్ముఁ జిక్కులు పె
ట్టినందులకు క్షమియింపుఁడు.

దూ—కష్టపూర్వములైనసుఖములే కడునాహ్లాదమిచ్చునవి. కాంతలారా! మే మి
ప్పుడు ధన్యుల మైనాము.

కా—(లేఖచూపి) మాకు వలపున్నదో లేదో యని మీరుభయులు గలసి జాబు వ్రా
సితిరి. ఇప్పు డాసందేహము పోయినదా? లేదా?

వృ—నేఁ డన్నియు వింతలు పుట్టుచున్నవి. పాపము! పౌండ్రికమహారాజు కూడ
మమ్ము సౌఖ్యపెట్టుటకే యింతపనియుఁ జేసినాఁడు కాఁడుగద!

రూ—అదిమాత్ర మబద్ధము. పురుషవేషములు ధరించి వానిని మోసపుచ్చి మే
మింతవఱకుఁ గార్య మనుకూలముగాఁ జేసికొంటిమి.

[illegible]—వ్యాఘ్రగుహనుండి కురంగశాబములు ప్రాణములతో నె ట్లీవలికి వచ్చెనో?

[illegible]—ఇట్లే మా గురువుగారు నన్నారు.

వృ—మమ్ము క్షమింపుఁడంటిరి కాని, మీరు మమ్ము క్షమింపవలసియున్నది. స్త్రీ
లవలె మే మిటఁ జెఱలోఁ బడియుండ, మాభార్యలు వీరపురుషులవలె నన్ని
కష్టములు పడి మాబాధ తొలఁగించినారు.

దూ—ఇంకను బూర్ణముగాఁ దొలఁగింపలేదు. మోస మింకను గొన్నిగంటలు సా
గవలెను. ఆదుష్టునికిఁ దెలియకుండ రేపు తెల్లవాఱకముందు మనము నలు
గురము పోయి మనసేనలఁ గూడవలెను.

వృ—సేన లేమి?

కా—అన్నియు నావల మాటాడుకొందము. రూపలతా! బ్రాహ్మణులు భోజనప్రి
యులుగదా! నీవింతకుముందుకదల్చినభోజనము మాటయేమైనది? మఱచితివా?

రూ—ఆర్యపుత్రా! మేము మాభర్తలకు స్వహస్తములతో భోజనము పెట్టుచు మేము
భుజింపవలెననుకుతూహలముతో నున్నాము. మాముచ్చట దీర్పరా?

కా—మేము వెనుకఁ గోరినప్రత్యుపకారము కాకపోయినను, ఈప్రత్యుపకారమైన
నుఁ జేయవలెను.

రూ—నీ పెనిమిటి దీనికిఁగూడ నడ్డమువచ్చునా ?

దూ—దేవీ! మీయాజ్ఞానుసారముగా వర్తింపవలసినవాఁ డెన్నఁటికిని నడ్డురాఁడు,

పృ—నారీమణులారా! అట్లే కావింపుఁడు. ఇఁక మనకును బొందవ్రికునకును నున్నది. బైటఁబడుదుము గనుక భయము లేదు. శూరులకారానిర్బంధము వీరకాంతలవలనఁ గదా విడిపోయినది!

(అందఱు నిష్క్రమింతురు.)

---

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# రూపలత.

## అష్టమాంకము.

### విష్కంభము.

ప్రదేశము—పత్రిపురబాహ్యప్రదేశము.

ప్రవేశము—శూరసేనుఁడు, వీరసేనుఁడు.

శూ— గీ. కడుపుగోఁ జల్లకదల, కఖండశాంతి
నిన్నినాళ్లున్న మనపుర మిపుడు కలఁగఁ
ద్రొక్కినహ్రదంబురీతి శత్రువులచాక,
నల్లకల్లోలమై యున్న దకట! చూడు.

వీ— ఔను! నిన్న తెల్లవాఱుజామున నేను గాఢనిద్రలో నుండఁగా,

గీ. ప్రళయకాలపర్జన్యగర్జాసదృశ
పణవనిస్సాణదుందుభిప్రముఖయుద్ధ
వాద్యనివహాఘణంఘణధ్వనులు, కర్ణ
వివరములఁ జొచ్చి గర్భనిర్భేదముగను.

అంతట నులికిపడి లేవఁగాఁ బ్రభువునొద్దనుండి "తత్క్షణమే సేనల నడిపిం శత్రువులపైకిఁ బోవలయును. మేము నిప్పుడే వచ్చుచున్నా" మని రా యాజ్ఞాలేఖ వచ్చినది.

శూ— నాకును నట్టియాజ్ఞయే యైనది. రెండుదేశములసేనలు పైఁబడినవఁట. : మెట్లు నిలఁబడఁగలమో తెలియదు.

వ. అనిమొన, భూనభస్థలము ◆ లంటుచుఁ, బౌండ్రకభూవిభుండు, చేతను సమరాయుధంబులను ◆ దాల్చి కనంబడి, సింహనాదముం
బొనరిచెనే, గసుర్పు వాడ◆ము న్మనసేన, కరాతిసైన్యముల్
మనము గలంగిపాఱు, ననుమానము లే, దవి యెన్నియుండినన్.

శూ—సరేకాని వీరసేనా! చిరకాలమునుండి జీతములు బత్తెములు దిని కూరుచున్నారు గాని మనయోధులు, కఠినమైన కదనశిక్షలో లేరు. అందుచే నాకు సందేహము కలుగుచున్నది.

వీ—లేకపోయిన నేమిలే, మనరథగజాశ్వపదాతిచతురంగబలములన్నియు శతఘ్నులతో నొకచోట సిద్ధముగా నున్నవి. భయము లేదు.

శూ—ఈసమరకారకు లాకారాబద్ధులైనయిద్దఱునా?

వీ—ఇంకను గారాబద్ధు లనుచున్నావేమి? నిన్నరాత్రియే వారు తప్పించుకొని పాఱిపోయినారు.

శూ—పాఱిపోయి యుండరు. పరసైన్యముఁ గలిసి పోరాడుదురు. దైవబలముగలవారి కన్నియు ననుకూలముగా నేయుండును. కాని యంతసురక్షితమైయున్న చెఱసాలలోనుండి వారు తప్పించుకొనిపోవుట కడు నాశ్చర్యముగానున్నది.

వీ—మనమహారాజు శూరాగ్రేసరుఁడే కాని సట్టింపచూయకుఁడు. క్రొత్తగాఁ గారాధిపతులుగా నేర్పఱచినయా రాజకుమారులవలననే యింతముప్పు వచ్చినదని నాయనుమానము.

శూ—వారిప్పు డిట లేరా?

వీ—ఇట నున్న నట్టియనుమాన మెట్లు పుట్టును? పంపినవైరులు పౌరులతోఁ గలిసి పాఱిపోయినట్లు, కనుపెట్టుకొనియుండవలసినకారోద్యోగులు కారాబద్ధులను దీసికొనిపోయినారు. ఇది నాదృఢనిశ్చయము.

రూ—వారి దేమియుండ! మేమియుండ! మని, యున్నది రెండుగ్రోజులైన, నూరంతయు మాఱుమ్రోఁగినది.

వీ—అందము చూచినయెడల, పురుషులైనను సరే, స్త్రీలైనను సరే, మనరాజున కొడలు తెలియనియట్లేయు. అదియే యింతముప్పునకుఁ దెచ్చినది.

శూ—నీవన్నమాటవలన జ్ఞప్తికి వచ్చుచున్నది. రెండుమూఁడునెలలకుఁ బూర్వము నన్నుఁ జూడవలెనని మామేనల్లుఁడు వచ్చినాఁడు. వాఁడు పదునాలుగు పదునేనేండ్లరూపసి. గ్రహచారము చాలక వానిని రాజసందర్శనము నకుఁగొనిపోయితిని.

వీ—అప్పు డేమి జరిగెను ?

శూ—మగవాండ్రై మైనను, జెప్పసిగ్గగుచున్నది. వాని నెత్తుకొని శూరసేనా! నీకీ తండ్రు మేనగోడలుగాక మేనల్లుండై యేలపుట్టెనని యడిగినాండు. ఇంతకా మాంధునకు రూపలతపై నంతవ్యామోహ ముండుట క్షేమివింత ?

వీ—వింతయేలేదు. ఈయుద్ధమున కామెయే కారణము.

శూ—కాంతామూలము లైనయుద్ధములేకదా ప్రపంచములోం బెద్దపెద్ద రామాయణములును భారతములు నైనవి.

వీ—అదిగోం జూడు! పౌండ్రకమహారాజును ధర్మాచార్యుండును గలిసి యుద్ధరంగమునకుం బోవుచున్నారు. మనము వారికి ముందుపోయి యట నుందము.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

---

ప్రదేశము—రణరంగము.

ప్రవేశము—పౌండ్రకుండు, ధర్మాచార్యుండు.

పౌండ్ర—ఎంతవఱకు వచ్చినదో చూచితిఖా ?

ధ—ఇంతవఱకు వచ్చునుభీతిచేతనే నీకు నే నంతవఱకుం జిలుకకుబోధించినట్లు బోధించితిని. కార్యము లేకపోయెను. యుద్ధము సిద్ధమయ్యెను.

పౌం—యుద్ధముమాట కాదు నేం జెప్పునది.

క. పరరాజులంద ఱొకలై
యరుదెంచిన లెక్కసేయ ♦ నట్టిమగండి
ద్దఱు పురము ముట్టడించిన
నుఱుమాడును గాని వెఱచి ♦ నొవ్వండనిలోన్.

ఆకపటరాజకుమారులు! ఔరా! శత్రుసంహారముచేసి సంతోషానందమిచ్చెద

రని చూచుచుండఁగా నెంతపని చేసినారు? శత్రువిదారణమునకు మాఱు మిత్రపరితారణము జరిగినది కదా?

(సేవకుఁడు ప్రవేశించి) మహారాజా! మొన్ననువచ్చిన ముద్దురాచబిడ్డ లిది తమ కిమ్మని నాచేతి కిచ్చినారు. (ఇచ్చును.)

పౌం—ఎప్పు డిచ్చినారు?

సే—మహాప్రభూ! నిన్నరాత్రి రెండుజాములకు—

పౌం—ఇంతయాలస్య మేల చేసితివి?

సే—సావకాశముగ తే ప్రుదయమున నీయవచ్చును, రాజుగారి కిప్పుడు నిద్రాభంగము చేయనక్కఱలే దని వారు సెల విచ్చినారు.

పౌం—సరే పొమ్ము. (పోవును)

ధ—ఉద్యోగము లక్కఱలే దన్నవారు కారాధిపత్యోద్యోగము లేలగ్రహించినారని యైన ననుమానపడకపోయితివి గదా! ఏమి వ్రాసితిరో లేఖవిప్పి చదువుము.

పౌం—(చదువును.)

"స్వస్తిశ్రీ
పౌండ్రకమహారాజు
గారికి—"

ధ—అమంగళవాక్యము. నీకు భూలోకమే స్వర్గము కాదా! పోనీ! చదువు.

పౌం—"భానువర్మ సోమవర్మలు వ్రాసికొనుశుభలేఖార్థములు."

మోసముచేయుట శుభ మెట్లగును? ఒకవేళ వారిని జంపినారేమో?

ధ—ఇంతవిపరీతము జరిగినప్పటికి నీ కావెఱ్ఱియాశ పోలేదు.

పౌం—"విషము విషముచే విఱుగునట్లు, స్వప్నతిమిరము స్వప్నదీపముచే సమయునట్లు, లోకములో మోసము మోసముచేఁ బొలియునని మాచర్యలవలన నెఱుఁగవలెను."

ధ—ఇపుడు నిరాశుఁడ వైతివా?

పౌం—ఆ! ఆ!

"మాలో భానువర్మ రూపలత, సోమవర్మ కాత్యాయని"

"మీరు దొంగపోటుగాఁ బైఁబడి బంధించినమహారాజును మంత్రిశేఖరుఁడును మేము వివాహ మాడఁదలఁచుకొన్న మాప్రాణప్రియులు"

అయ్యో! యెంతమూఢుఁడ నైతిని?

గీ. గృహాముననం దంతసేపు వ ♦ ర్తించి, యెగిరి,
పోయె బంగారుపిచ్చుక ♦ ల్మోసపుచ్చి,
తళుకుమని తోఁచి మిఱుమిట్లు ♦ గొలిపి కనుల,
మాయమౌ తటిల్లతికతె ♦ మాడ్కి నకట !

ధ—చంపుశంపాలతలనుసంపాదించుకొనఁబ్రయత్నించువాఁడునిజముగామూఢుఁడే.

పాం—"మాయత్తవారిసేనయుఁ బుట్టినింటిసేనయు వచ్చి మీకై యెదురుచూచుచున్నవి. మాకును మీకును బునర్దర్శన మటఁ గాఁగలదు. మేమును మా ప్రియులును మీ కీయుత్తరము చేరకముందే సమరభూమిని జేరి మా సేనలతో మీదర్శనమునకై ప్రతీక్షించుచుందుము."

మంచిది రూపలతా ! ప్రతీక్షించుచుండుము. ఇదిగో వచ్చుచున్నాను.

గీ. శోభనపుగదిలోనికిఁ ♦ జొచ్చుప్రియుని
వలెనె కదనంబునకు వచ్చి ♦ పరుని నొక్క
చేత ఖండించి రెండవ ♦ చేత ముద్దు
లాఁడి, నిన్గొనివత్తుఁ బెం ♦ డ్లాడుకొనఁగ.

ధ—ఇంతచేసినప్పటికి నామహామాయాదేవిపై నీ కనుగ్రహమే కాని, యాగ్రహము లేదేమి ?

పాం—అదేమో ! మిత్రమా !

గీ. ఎంత యొడలుదెలియకుండ ♦ సేఁచు మదిర,
యంత మద్యపాయికిఁ బ్రియ ♦ మైనయట్లు,
కలికి నను బాధవెట్టిన ♦ కొలఁది, నాకుఁ
బెరుఁగుచున్నది యామెపైఁ ♦ బ్రేమ, సఖుఁడ!

ధ—పారిరక్షము !

పాం—"ఇది శుభలేఖ యెట్లగునని విస్మయపడకుఁడు.

ఉ. లంబశరీర ! రేపు వదయ ♦ లగ్నమునందు, భవత్పురోపకం
ఠంబున, మాకఠోరపుఁగ ♦ తారము లుంకువపెట్టి, రాజర

ష్ణం బగుమామహీధవుఁడు • తాజయలక్ష్మిని బెండ్లియాడు, రా
జ్యం బరణంబుగా నిడన్వ • యంబుగరమ్ము! సబాంధవంబుగన్."

అబ్బా! కాంతునికంటెఁ గాంతయే, మాటలలోనైన, శూరురాలుగాఁ గా న్పించుచున్నది. అట్లేకానిమ్ము. జయలక్ష్మిని నీముద్దుమగనికిఁ గట్టిపెట్టి యిఁక నీయావశ్యకత యాయనకుండదు గనుక, నిన్ను నావెంటఁ దీసికొని వచ్చి పుష్పలతానికుంజములలో యథేచ్ఛముగా విహరింతును.

ధ—నిన్ను 'లంబశరీర' యని సంబోధించి వేళాకోళము చేసిన, దది కనిపట్టినావా?

పౌం—ఇష్టముగా నున్నయింతి లభింపకముం దెన్నోతిట్లుఁ దన్నులుఁ దినవలెను గాదా?

ధ—ఇదా, కామశాస్త్రసంప్రదాయము!—తరువాత.

పౌం—గీ. "మిత్త్రపరివారసేనాస • మేతుఁడవయి
వచ్చి సుముహూర్తమునుజూచి, • బవరమందు
నే మొసంగెడు సకలస • త్కృతుల నంది,
చనుము వారిని దీవించి • చావకున్న."

చావకున్నఁగద! దీవనలు. చచ్చుటయే సిద్ధము.

ధ—అవిగో భేరీభాంకృతులు. త్వరగాఁ జదువుము.

పౌం—గీ. "వచ్చి పిలువంగవలసిన • వాఁడ వీవు,
కాని దగ్గఱె సుముహూర్త • కాల; మాఁడుఁ
బనులు సల్పఁగ నచట నె • వ్వరును లేరు;
లేకయేకద! యని యను • కోకు మదిని."

ధ—అబ్బా! యేమికళ్యాణాహ్వానమర్యాదలు!

పౌం—మంచిది. రూపలతా! ఇక్కడ మగపనులు చేసి యక్కడ నాఁడుఁబను లకుఁ బోయితివా?

"ఇట్లు భవత్పునర్దర్శనాభిలాషులు
భానువర్మ
సోమవర్మ."

వయయుంచుము. రూపలతా ! వీఁడు భవన్నిరంతరదర్శనస్పర్శనసంశ్లేష చుంబనాభిలాషి. ధర్మాచార్యా ! నీవప్పుడు కనుసైగయైనఁ జేసియుంటివేని పంజరములోఁబడినచిలుక యిట్లు పాఱిపోవునా ?

ధ—నీవు కాంతలకనుసైగలకుఁ గనుపెట్టుకొనియుందువు గాని మిత్రవాక్యములఁబాటింతువా ? శీఘ్రముగా వారిని బంపివేయుమని సూచనగాఁ గాక స్పష్టముగా వాగ్రూపమునఁ జెప్పితిని. నీకు మనసొప్పదయ్యెను. మీఁదుమిక్కిలి నాకర్మము బాగుగనేయున్నది పొమ్మంటివి. నే నేమిచేయఁగలను?

పాం—శత్రువులకు సాయము చేయలేవా ?

ధ—చేయఁగలను గాని చేయను.

పాం—ఎందుచేత ?

ధ—వచ్చినయమదూతల సాగనంపి సుఖముగా నుండుటకు నీకు బుద్ధిపుట్టనట్లే, నాకును బుద్ధిపుట్టుటలేదు. నీశత్రువులఁగూడి నీతోఁ బోరాడుటకంటెఁ గత్తి పట్టుకొని నీపక్షమున యుద్ధముచేసి నీతోఁ జచ్చుట మంచిదని నాకుఁ దోఁచుచున్నది.

పాం—చచ్చుటేల? గెలిచి జీవింపరాదా ?

ధ—బ్రదుకుఁదెరువు చూచుకొనువారిలక్షణములు వేఱుగా నుండును.

పాం—నీబ్రదుకుఁదెరువునకు నే నేమియు నడ్డమురాలేదే? రానే!

ధ—అడ్డమువచ్చినది నీవుగాదు. ప్రారబ్ధవశమున నాకు నీతోఁగలిగినమైత్రి. ప్రతికూలవాక్యములాడినను పైకి వెడలఁగొట్టనినీవెట్టివిశ్వాసము ! ఇటు చూడు ! ఈకండలను రాజభోగయోగ్యము లగుపదార్థములతోఁ బెంచిననీయనురాగము. (కన్నీళ్లు రాల్చును.)

పాం—ఎప్పుడును గంటఁ దడిపెట్టనివాఁడ విట్లు దిగులుపడుచున్నావేమి ? ప్రాణభీతిచేతనా ?

ధ—ప్రాణభీతి చేతఁగాదు ప్రాణప్రియవియోగదుఃఖము చేత ?

పాం—నాఁతోఁగూడ నే మరణింతునంటివిగాదా !

ధ—తరువాతఁగూడ నాది యొకదారియు నీదియొకదారియు నగునని మఱింతమనోవేదన. ఇట్టి సుగుణములపాలవెల్లిలో దైవాభీతి, స్త్రీలోలత, యనుహాలాహలము లుండుటచేతఁగదా నింతయవస్థ వచ్చినది !

పాం—నన్నింకఁ గదలింపకుము. ఎన్నోసారు లిట్టిప్రసంగములైనవి. దృశ్యశత్రు

వులకు వెఱవనివాఁ డదృశ్యనిర్గుణనిరాకారుఁ డగునొకయసంభావ్యునకు వెఱ వఁడు. క్షుత్పిపాసానిద్రలు నికృష్టములైన, స్త్రీలోలతయు నికృష్టమే.

ధ—(రాజు చేతులుపట్టుకొని) ఇవి చేతులుగావు కాళ్లనుమా! నాకడపటిప్రార్థన యాలింపుము. పౌండ్రకవంశవహ్నిశిఖయగురూపలతను విసర్జించి బ్రతుకుము. విడిచితిననునీయభయవాక్యమువిని తక్కినకార్యములు నేనుజక్కఁబెట్టెదను.

పౌం—ఈబాఁకుతో నన్నుఁ బొడువుము. దీనికైన సమ్మతింతును గాని, దానికి సమ్మతింపలేను. క్షమింపుము. అది భయవాక్యముగాని యభయవాక్యము గాదు. యశోనష్టముకంటె వంశనష్టము వేయిరెట్లు మేలు. అదిగాక, రూప లత—హారూపలతా! పరిగ్రహయోగ్యమైనపదార్థముగాని పరిహారయోగ్య మైనది కాదు. నేను జచ్చియు నామె కుపకారమే చేయుదును. అపకా రి కుపకారముచేయుట యుత్తమధర్మమనికాదా! మీనీతిశాస్త్రము చెప్పు చున్నది. ఈమరణశాసనము చూచి మఱల నాకిమ్ము. కొన్నిమార్పులు చేసి యిచ్చెదను. (చేసి యిచ్చును.)

ధ—(చూచి చదువుకొని బాష్పములతోఁ దిరుగనిచ్చి) సరే! కానున్నది కాకమాన దు. నాకొకఖడ్గమిమ్ము. (పుచ్చుకొని) సేనాకోలాహల మెక్కువయగుచు న్నది. పోదము రమ్ము.

పౌం—నీకంటెముందుగ నేనేపోయి నాదోర్దర్పసార మరివీరులకుఁజవిచూపింతును.

(నిష్క్రమించును.)

ధ— గీ. ధర్మపరులకుఁ గష్టము • లెప్పు వనుట
కేనె తార్కాణ; మాజన్మ • మెన్నికష్ట
ములకు లోనైతి; నేఁటితో • ముగియు సకల
బాధ లేఁ జేరఁబోయెదు • భండనమున.

గీ. న్యాయమని శివశర్మకు • సాయమైతి,
నయభయంబుల బోధకెు • నర్చినాఁడ
నవనిపతి, కంతయును వృథా • యయ్యెఁ గాని,
యిప్పు డసువులుగూడ స • మర్పింపనుంటి.

గీ. ధర్మపథమును దప్పినఁ, దప్పు నాది
కాదనెను ధైర్య మున్నది కర్మఫలద!
మంచి దనుకొన్న దే నొనరించినాఁడ,
నెట్టిగతి నాకొసంగెదో యెఱుఁగ నీశ !

ఆహా !

ఉ. చండబలాతిరేకమున శత్రుపతి పౌండ్రికుఁ డల్ల దే ! మృగీ
మండలిఁ జూచిదూఁకుపులి మాడ్కి నరాతిబలంబు సొచ్చి, కో
దండవిముక్తసాయకవి తానముచే నిట, నక్కడ న్గదా
దండపరిభ్రమంబులు హ తంబొనరించెను వీరవారమున్ !

ఔరా ! యరాతిచమూసమూహంబు లతనిడాక కాఁగలేక వికావికలై యెట్లుపాఱిపోవుచున్నవి ! నేనుఁబోయెదను. రూపధరమహారాజు జిటకు వచ్చుచున్నాఁడు. ఒకచోట ధర్మమున్నది. ఒకచోట శౌర్యమున్నది. ఏమికా నున్నదోకదా ! (నిష్క్రమించును.)

(రూపధరుఁడు, మతిమంతుఁడు, కాత్యాయనీరూపలతలు ప్రవేశింతురు.)

మ—మహారాజా ! సంగ్రామము మహాఘోరముగా నున్నది ? ఇటఁ గొంతసేపు విశ్రమింపుఁడు.

రూ-ల—నాయనగారూ ! దేహబలధర్మబలములకుఁ బోరు జరుగుచున్నది. తుదకు ధర్మమే నెగ్గును. మేము పోయి పౌండ్రకుని మదమడఁతుము. మీరు మంత్రిగారితో నిక్కడఁ గొంతసే పలసటదీర్చుకొనుఁడు.

కా—పెద్దపర్వతమువలెఁ బ్రవేశించిన పౌండ్రికరాక్షసుని ప్రతాపముచేఁ బాయలై పాఱుచున్న మనసేనావాహిని యాదక్షిణాపథశూరద్వయముయొక్క యసమాన యుద్ధకలనవలనఁ బునరుత్సాహప్రేరితమై మరలఁగలిసి యెట్లుమాఱ్కొనుచున్నదో చూడుఁడు. రూపలతా ! మనముకూడఁ బోదమురమ్మ.

రూ—బిడ్డలారా ! కూఁతులరణమధ్యమునకుఁ బంపి బడుగులవలె మమ్మిటఁ బడియుండుఁ డందురా ? మతిమంతా ! నీవు మతిహీనుఁడవై నన్నిక్కడ కేల తీసికొని వచ్చితివి !

మ—రాజచంద్రమా ! పౌండ్రకబాణప్రసారముచే రథముపై మీరు సోలిపడినారు. ఇంచుక విశ్రాంతికై యిటకుఁ దీసికొనివచ్చితిని. గాయములు విశేషముగాఁ

దగిలినవేమో యనుభీతిచే వీరు నాతో వచ్చినారు.

(పౌండ్రకుఁడు ప్రవేశించును.)

పౌం—ఒక్కతూరి దెబ్బకే సేనలు గగ్గోలుపడినవి. కాని పృథ్వీరూపుఁడును, దూరదర్శియుఁ బెసరపప్పుగాండ్రనుకొంటిని గాని శూరాగ్రేసరులుగాఁ గనిపించుచున్నారు. శూరసేనుప్రాణము లప్పుడే చూఱకొన్నారు. వగ్గలమఁ బోయిపట్టుకొందమన్న రణమధ్యమందు మధ్యందినమార్తండులవలెఁ దిగ్మశరమయూఖపరంపరలు గురియుచు దుర్నిరీక్ష్యులై యున్నారు. ఈమాటువారి పనిపట్టెదను. వీ రెవరో ? ఓహో ! మామగారును నాభవనపంజరమునుండి పాఱిపోయిన కీరములునా ?

రూ—ఓరీ ! దురాత్మా ! మామను గానురా ! నీయనుతరంగిణుల హరింపఁదలఁచుకొన్న రమారమణుమామను.

పౌం—అబ్బా ! నాలుగుచొప్పపుల్లలకేకాదా యట్లు కన్నులు తేలవేసి రథముపైఁబడిపోయితివి. పోనీ! నీవు సముద్రుఁడవు. నీపుత్రీరత్నమగురూపలతే—అదిగో—శ్రీమహాలక్ష్మి. ఆమెను నాకిచ్చి నాప్రాణపుత్రికలను చేతనైన నీవు పుచ్చుకొనుము. అప్పుడు నాకు నీవు మామవు నేను నీకు మామనునగుదుము.

రూ-ల—ఓరోరివ్యర్థప్రలాపా ! ఆమహాలక్ష్మి యీావఱకే పృథ్వీరూపపరమపురుషుని పాలైనది. ఇఁక నందలికరాళజ్వాళమే నీకాంతయగుటకు మిగిలినది.

పౌం—అంతకష్టమైనమాట పలికినఁ బల్లవమృదులమైన నీమోవి బడలిపాడగును. హాలాహల మనుము, హాయిగావిందును. నీకేభర్తగావలెను ! శూరాగ్రేసరుఁడా, సుకుమారశరీరుఁడా ?

కా—వివాహమునకు సుకుమారశరీరుఁడు కావలెను. ఆమె యోగమున కిప్పుడు శూరాగ్రేసరుఁడుకావలెను.

మ—పౌండ్రకా ! మాతో మాటలాడుము. స్త్రీలతోఁ బ్రసంగించుట శూరధర్మముగాదు.

పౌం—అబ్బా ! శ్రీరంగనీతులు !

సీ. ఇంటిపట్టులనుండక ♦ కిటుకుఁ ద్రిమ్మరులయి
వచ్చుట స్త్రీలకుఁ ♦ బాడియయ్యె !
గాగర ల్పదలించి ♦ లాఁగులుఁ గానెలు
ధరియించు టతివల ♦ ధర్మమయ్యె !

ఱొమ్ముపొంగులు గవ • చమ్ముల నడఁగించి
మట్టాడు టెంతుల • మార్గమయ్యెఁ !
దములపాకులుచుట్టఁ • దగునంగుళులఁ గత్తిఁ
దాల్చుట సతులకుఁ • దగినదయ్యెఁ !
ఆ. పెండ్లికాకమున్న • ప్రియులపక్కను జేరి
యుండు టలరుఁబోండ్ల • కుచితమయ్యె !
నింక బట్టబయట • నిట యుద్ధభూమిపై
నిలిచి పలుక నాకు • నీతిగాదు !

ఇదా ! నీయుచితానుచితజ్ఞానము !

రూ—మతిమంతా ! ఆప్రేలరితో మాటలాడుటవలన నేమియుఁ బ్రయోజనము లేదు. క్రియలతో మనయభీష్టము నెఱవేర్చుకొనవలెను.

పౌం— "వనచరున కబ్ధికన్యకఁ
జన దెప్పుడు పెండ్లిసేత్తు; • చాలుదువేనిన్
గొనిపొమ్ము రూపలత నీ
ఘనశౌర్యముఁ జూపి పౌండ్రి • కా ! భిల్లపతీ !"

అనికాదా ప్రత్యుత్తరమంపితివి. నాశౌర్యప్రకటనమునకంతయవకాశమీయకపం డనామోహనాంగి నన్నువరించి యిచ్చటికేవచ్చి కార్యము సుకరము చేసినది.

కా—ఓరీ ! మూర్ఖా ! అది ప్రభువుగారిపేరఁ బంపినను మేము వ్రాసినదేరా !

పౌం—ఆత్మోత్కర్షసూచకముగానా "మే" మనుచుంటివి ?

రూ-ల—రాజా ! కాదు. ఆమెయు నేనును గలిసి వ్రాసినాము.

పౌం—ఆహా ! అమృతతుల్యము లగుమాటలు—మతిమంతా ! యీశ్రవణానందమ పేక్షించియే, కాంతలతోఁ బ్రసంగించుచున్నాను. అందుకోసమే మోహనకాం తాతిలకమా ! ఆలేఖ యిప్పటికిని నాహృదయపద్మముచెంత నున్నది. (తీసి చూపును.)

రూ-ల—(చేతిబాణముతోఁ గొట్టి) క్షత్రియాధమా ! మాట లమృతతుల్యము లను చున్నావా ? తీయనివిషబిందువులురా ! దురాత్మా ! అవి త్రాగి హాయిగాఁ బ్రాణము విడువుము. విడువవేని, ఆవిషము చాలదేని,

గీ. రమ్ము కదనమ్మునకు, గురు ♦ ప్రవరచరణ
విమల సేవాధిగతధను ♦ ర్విద్యయందు
నాకుఁ గలకౌశలంబును ♦ నీకుఁ జూపి
యమపురికిఁ బంపుదును నిన్ను ♦ నతిథిగాను.

పౌం——ఖండితానాయికను గాంచినకాంతునికివలె నాకు నీకోపమును బ్రసాదము గానే కాన్పించుచున్నది.

గీ. విల్లువంచుట బాణము ♦ ల్వేయుటట్లు
పెట్టు, మవినీకసాధ్యము; ♦ లివ్విటివంపు
బొమలుఁ గొర్విన్వాఁడిచూపుఁదూ ♦ పులును నన్నుఁ
బరవశునిఁజేయుచున్న వో ♦ తరుణి యిపుడు!

ఆ. మూఁడులోకములను ♦ మూఁడుకాలంబుల
యందు నున్నస్త్రీల ♦ యందము లిటఁ
గలిసియున్న; వతను ♦ కదనంబునకుఁ గాని
చాల వబల! ఘోర ♦ సమరమునకు.

రూపలతా! యేదో వివాహమహోత్సవమునకు నన్ను విందుగాఁ బిలిచితివే! యముని కతిథునిగా నెట్లు చేయుదువు?

రూ-ల——ఇవిగో! మేము నీకుఁ జేయుసత్కారములుఁ, బెట్టువిందులును.

మ. విరిదండ ల్పటుకార్ముకోజ్ఝితశరా ♦ విర్భూత మాంగాయముల్;
ఖరఖడ్గపరివిదారితాహితశిరః ♦ కాండోద్గతస్ఫారమే
దురమేదఃపలఖండము లుర్విచిరస ♦ ద్భోజ్యభూతభక్ష్యంబు; ల
క్షురమై యుర్వరఁ బాఱురక్తనదు ల ♦ చ్ఛంబైనపానీయముల్.

ఆ. సహజభీతి వీడి ♦ చనుదెంచి శవనికా
యంబుచుట్టు మూఁగి ♦ జంబుకములుఁ
గంకగృధ్రములును ♦ గావించుపాటయే
పౌండ్రకుండ! పెండ్లి ♦ పాట నీకు.

పాం—అటుగాదు ! ఇటు.

గీ. వ్రేళ్ళు వ్రేళ్ళను గీలించి • విరులకంటె
మెత్తనౌనీకరంబు లీ • మెడను మండి
లాకృతిగఁ జేసి వ్రేల్చిన • యపుడు సుమ్మ
పుష్పదామంబు నాకంఠ • మునను వైతు !

గీ. అట్టులున్నెతఱి వై యుండ • నక్షిపర్వ
ముగను గ్రిందికిఁ జూచి నీ • మోము సోయ
గంబు నే భుజియించినఁ • గాదె ! నాకుఁ
గలికి ! విందిడుపున్నెంబుఁ • గట్టుకొందు.

గీ. తేనెసోనలు చిప్పిల్లు • దివ్యమైన
నీదు కెమ్మోవి, దగదీఱ • నేను గ్రోలి
నప్పుడేకద ! నాయట్టి • యతిథి కర్హ
మైనపానీయ మొసఁగిన • దాన వగుదు.

గీ. కాళ్ళఁ జేతుల మెడను జ • క్కఁగను నీవు
వెట్టుకొన్నట్టిభూషలు • వెట్టురవళు,
లల్ల మాటలు, గునుపువా•క్యములె నాకు
బోటి ! కర్ణపేయపువీణ • పాటలౌను.

నాభావముల నోముద్దులాఁడీ ! నీచే నభినయింపఁజేసి స్పష్టీకరింతునా ?
(ముందఱికిఁ బోఁబోవును.)

రూ-ల—అభినయము లభిసూతములౌగా మాఱును జాగ్రత్త ! ఇటు చూడుము !

పాం-(స్వ) గీ. సోయగంబులకుప్ప రూ • సుదతి నోయి,
రొట్టెచింతనిప్పులుగ్రుక్క • నీక్షణములు
వఱపు చయ్యయ్యొ ! కలలఁ గ • న్నట్టునట్టి
పాఁపచేడియ నాకు సం • ప్రాప్తమయ్యె !

రూ-ల—రావేమిరా ! చండాలా ! పూజ్యులగు మాతండ్రిగారి సమక్షమునను మం

త్రిగారియెదుటను నిట్టికాఱు లఱచితినిగదా! యుద్ధములో నీప్రాణములు నీనే యూడఁబెతికెదను. ఇదే నాశపథము.

పౌం—సమక్షమునందుఁ గూడదన్నఁ బరోక్షమునందనుట కియ్యకొంటి వన్నమాట యేకదా! మొక్కఁబెఱుకునప్పుడు దాని నంటవలయును. నిజాస్త్రస్పర్శసుఖము నాకు లభించిన నంతే చాలును. ఎప్పుడో యొకప్పుడు గిట్టకుండ భూమిమీఁద నుట్టిగట్టుకొని యూఁగాడువా రెవ్వరును లేరు.

(తెరలో)

సీ. పౌండ్రకభూపాల! పడిపోవుచున్నారు
నీసేనలోన నె న్నికను గన్న
వారెల్లరును; జన మారణం బగుచున్న;
దెటనున్నవాఁడవో యిప్పుడీవు!
శూరసేనుఁడు మ్రగ్గె, వీరసేనుఁడు చచ్చె,
మహితసేనానులు మడిసినారు,
పటువిక్రమము కనఁ బఱచి పెక్కురఁ జంపి
యిపుడె ధర్మాచార్యుఁ డీల్గినాఁడు,

గీ. పడుచురాజు విశృంఖల వహ్నిపగిదిఁ
గాల్చుచున్నాఁడు మనచమూ కాననంబు,
నగ్నికిని వాయువట్లు స హాయుఁ డగుచు
నున్నవాఁ డల్ల రెండవ చిన్నవాఁడు.

క. అందఱుభూవర! చిందఱ
వందఱలై యిటునటుఁ బరువిడుచున్నా,
రిందులకు వచ్చి మఱలన్
డెందంబుల ధైర్యలక్ష్మి నెలకొల్పవలెన్.

పౌం—భిల్లదేశవరూథినీవీరపురుషులారా! పాఱిపోకుఁ, డిదిగోఁ బౌండ్రకకాలమేఘముపచ్చి యావహ్నిని జల్లార్చుచున్నది. హా! మిత్త్రరత్నమా! ధర్మాచార్యా! శత్రువుల మృత్యుముఖముసఁ, బడవేసి మిత్త్రఋణము నిప్పుడే తీర్చుకొందును.

గీ. తెరలు తెరలుగఁ గన్నీళ్ళు • వఱదతోడ
వచ్చుశోకంబ! యిపుడు రా • వలదు నీవు;
శత్రుమారణకృత్యంబు • సలిపివచ్చి
పడుతుఁ గన్నీళ్లు తెఱపిగా • వానికొఱకు.

(నిష్క్రమించును.)

రూ—అమ్మా! రూపలతా! నీమీఁదికి వచ్చుపౌండ్రకునిఁ జూచునప్పుడు నీవు త్రిపుర సంహారసమయరుద్రమూర్తివలెఁ గాన్పించినావు సుమా!

మ—మహారాజా! నేనును మహాభయగ్రస్తుఁడనై మాటాడలేక ప్రతిమవలె నిలఁబడినాను.

కా—నాయనగారూ! గురుకటాక్షమున లభింపని దేమియు లేదు.

మ—ఆతీక్ష్ణదృష్టిమాత్రము కాత్యాయనీ? గురుకృపాలబ్ధమైనదిగాదు. ఆత్మమానావనార్థము పరమేశ్వరుఁడు పతివ్రతల కనుగ్రహించునది.

గీ. త్రిజగతీమాత జానకీ • దేవి లంక,
సతివ్రతలమానికము దమ • యంతి యడవి,
నేచి నిజమానరక్షణ • మెట్టు, లెక్క
టిగను, గావించుకొనిరొ ప • రింపలేదె?

కా—చెలీ! ఇపు డచ్చటనుండి వచ్చినయార్తారావములు విన్నావా?

రూ-ల—ఔను! శ్రోత్రపేయముగా విన్నాను. వారుభయులు సవ్యసాచిద్వయమువలెఁ బరబల మల్లకల్లోలము గావించుచున్నారఁట.

కా— గీ. కష్టసమయంబులను సుఖ • కాలమందు
నండగా నుండవలెఁ గాదె • యతివ పతికిఁ;
గనుక నోరూపలత! యిప్డు • మనము వోయి
సాయమాదము వారికి • సమరమందు.

రూ-ల—తప్పకట్లే చేయుదము. గురుకటాక్షలబ్ధసంగ్రామకళానైపుణ మంతయుఁ గనఁబఱతము.

రూ—బిడ్డలారా! మేము పోయి యాపని నిర్వహింతుము. మీకు శ్రమయాక్కఱ

లేదు. ఇక్కడనుండి చూచుచుండుఁడు.

(రూపధరుఁడు, మతిమంతుఁడు నిష్క్రమింతురు.)

కా — రూపలతా ! పౌండ్రకుఁడు పరమదుష్టుఁడేకాని మహారణకౌశలము గలవాఁడునుమా ! అదిగో చూడు !

గీ. కత్తి యొఱఁబెట్టి చేతను ♦ గదను బట్టి
బాహుయుగ్మమ్ము బొమ్ము వి ♦ స్ఫారముగను
బెంచి గదఁ ద్రిప్పి పీనుఁగుఁ ♦ బెంటలట్లు
చేయుచున్నాఁడు శాత్రవ ♦ సేన నయ్యొ !

రూ-ల-గీ. గుఱ్ఱముల మోరలును గజ ♦ కుంభములును
రథములును బంట్లతలలుఁ జూ ♦ ర్ణమగుచున్న;
పురుభయంకర మౌగదా ♦ యుద్ధమందుఁ,
బవనతనయునిబోలిన ♦ వాఁడు వీఁడు.

కా — అవిగో ! వెనుకకుఁ బాఱినభిల్లసైన్యములు చంద్రదర్శనోల్బణము లగుసముద్రతరంగములవలెఁ బౌండ్రకునిపరాక్రమము చూచి మఱలఁ గూడివచ్చి మనసైన్యముమీఁదఁ బడుచున్నవి.

రూ-ల — తనగదాఘాతములతో నీప్రక్కవారిని నాప్రక్కవారిని నేలఁ గూల్చి పౌండ్రకుఁ డెట్లు మనసేనలో దారిచేసికొనిపోవుచున్నాఁడో చూడు.

కా — అయ్యో ! మనపతులు వానిని జూచి మండిపడుచు వానిసేనమీాపించుచున్నారు. ఆహా !

ఆ. తొడుగువిశిఖమేదొ ♦ విడిచెడిసాయకం
బేదొ తెలియనట్టు ♦ లెట్లు శత్రు
సమితిపైని నిశిత ♦ శరపరంపరల నీ
భర్త గురియుచున్న ♦ వాఁడొ చూడు.

రూ-ల-ఆ. అతనిప్రక్కనుండి ♦ యతఁడు మిఱుమిట్లు
గొనెడుచంద్రహాస ♦ మునను బగఱ

బుఱ్ఱ తెగురఁగొట్టెఁ • బొడకట్టనీక నీ
మగఁడు బళిర ! పోటు • మగఁడు మామ.

కా — అదిగో మనజనకుల ముట్టడించి పౌండ్రకసేనవారు వారిని గదలమెదలనీయకున్నారు. సెబాసు! ప్రతిష్ఠానపురవీరులారా! శ్వశురభక్తి యన్న నట్లుండవలెను.

గీ. రూపధర మహారాజును • రూపుమాప
నుద్ధృతంబైన సాసిబా • హున్నయట్లె
దూరమునుండి ఖండించె • నీరమణుఁడు
కలికి! నిశితార్ధచంద్రాశు • గంబుచేత.

రూ-ల_గీ. అల్లదిగోఁ జూడునీవిభుం • డతనిమామ
పైకి మారణబాణముం • బంపఁజూచు
మేటివిలుకాని నొకకత్తి • వేటుతోడ
నెట్లు పడఁగూల్చెనో చాఁప • కట్టుగాను.

కా — సరేగాని! మనము పరస్పరపతిశ్లాఘాపరాయణులమై కాలయాపనము చేయుటకంటె వెళ్ళి కాంతులకుఁ గైయూఁతలమగుట శ్రేయస్కరము గాదా!

రూ_ల — ఔను. ఇఁక జాలము సేయుట తగదు.

(తెరలో)

అమాత్యశేఖరా! ఇటు! ఇటు! పౌండ్రకమహారాజుగా రిప్పుడు ఘోర
సంగరములో మునిఁగియున్నారు. ఆపని ముగించి యిటకు వత్తురు.

రూ_ల — పౌండ్రకుని మంత్రి కాఁబోలు నిటకువచ్చుచున్నాఁడు. మనము పోవుదము

శా. ఘోరాయోధనమందు నింతవఱకు • న్గోదండకౌక్షేయకో
దారప్రజ్ఞలు చూపి మిక్కిలి శరీ • రాయాసముం జెందినా
రో రాజేంద్ర! యమాత్యపుత్ర! యిదిగో • యుద్ధంబులోఁ జొత్తు
మీరొక్కింత శ్రమంబువాపుకొనుఁ డీ! • యింతుల్విజృంభింపఁగ

(నిష్క్రమింతురు.)

(చంద్రహాసియు సేవకుఁడును బ్రవేశింతురు.)

చం — సేవకా! యుద్ధమధ్యమందు మహారాజుగారు నన్నురమ్మని నిన్నేలపంపినారో

పరాగకృతకృతకాబ్దసంఘాతముచేఁబట్టపగట రోదోంతరాళమంతయు నిబి డాంధకారమయమగుచున్నది. గిరితరుగుల్మములచే నీవఱకు విషమమైయు న్న [illegible]తయు నిప్పుడు సమప్రదేశ మాచున్నది. మంత్రివరా! మదీ[illegible]యువాఁడుగాని యిప్పు డటకేగఁడు. ప్రభువుగా రిచటికే వత్తు నన్నారు గదా. వారిరాకకై ప్రతీక్షించుచుండుము.

(తెరలో)

ఉ. ఈవిపరీతసంగరము • నెక్కడఁ జూడము ; వ్యాఘ్రిసంహతిన్
గోవులు సొచ్చి ప్రాణములు • గ్రోలుచునున్నవి; లేఁతలేఁతకై
దీవలనుండి పూల్వడకి • తీక్ష్ణశరార్చులు వచ్చి క్రమ్మెదుర్ ;
గావఁగ రారె! సిగ్గునను • గాంతలు వీరులఁ జంపు టయ్యయో!

(మఱలఁ దెరలో.)

ఉ. ఓరిమదాంధ! యిప్డు మొగ • మోరగఁ బెట్టుకయుందువేల ? రా
రా రణశూర ! కౌఁగిటికి • రమ్మని యప్పుడు కాఱులాడి ; తీ
క్రూరశరంబులంబఱపి • క్రొవ్వడఁగించి బలద్వయంబులో
వైరులు మిత్రులుం గని నె • బా ! నన, నిద్దెగటూర్పుఁ బొండ్రికా.

(మఱలఁ దెరలో)

గీ. ఏమి యాశ్చర్య మిది ! శౌర్య • ధామమైన
పౌండ్రకనృపాలమౌళి రూ • పలతవోప్రిలఁ,
బక్షిరాజును వీక్షించి • పడగ వ్రాల్చి
నేలఁ బడియుండుఫణిరాజు • లీల నుండె.

చం—అయ్యయ్యో ! మనమహారాజు రాజమారకురాలినారాచములచేఁ గ్రిందఁ బడినాఁడు.

సే—కటకటా ! సేనలో నుండి హాహాకారములు వచ్చుచున్నవి. మనసేనయంతయు ఒరిసి పాఱిపోవుచున్నది.

(మఱలఁ దెరలో)

గీ. ఆఁపుఁ డాఁపుఁడు కదన మిం • కనవసరము,
కూలె శిఖోష్ఠ్ఁ డైనభూ • పాలుఁ డదిగో !

నాజి నపరాధులను గూల్ప ♦ నగును గాని
నిరపరాధులఁ జంపుట ♦ నీతి గాదు.

చం—అదిగో! భటులు కన్నీళ్ళతోఁ బ్రభువును లేవఁదీసి చేతులలోఁ బెట్టుకొని యిటకుఁ గొనివచ్చుచున్నారు. హా! సర్వజగద్విదితశౌర్యసముద్రా! హా! భిల్లదేశాధీశా! అప్పుడట్లు చూచి యిప్పుడిట్లు చూడనున్న నాకన్నులు గాల్పవలదా? రాజచంద్రమా! అయ్యయ్యో! ఆవలివారును నిటు వచ్చుచున్నారు. వారిలో నొకరినైనఁ జంపి నేను జత్తును.

(పృథ్వీరూపుఁడు రూపలత యొకవైపునుండియు, భటులు పాండ్రికునితో నొకవైపునుండియుఁ, బ్రవేశింతురు.)

చం—రాజకులావతంసమా! నాతో మాటలాడవా?

పాం—నీతో మాటాడుటకే యిటకుఁ దీసికొని రాఁబడితిని.

చం—అయ్యో! కాయమునందలిగాయము మిక్కిలి యపాయకరమైనదిగా నున్నది. హా! మాలదైవమా!

పాం—కాయ మెప్పుడు సాపాయముగాని నిరపాయముగాదు. దైవమనియొకఁడున్నగదా మాల యనుటకు మహీసురుఁ డనుటకును. మాటలాడుశక్తి యుండగకముందే నేఁజేయఁదలఁచుకొన్నకార్యములు చేయవలెను. నీవట్లు కన్నీళ్లు రాల్చిన ప్రయోజనము లేదు. ఇటఁ గూరుచుండుము. వా రేరీ?

చం—వా రెవరు?

పాం—ఇదిగో వచ్చినారు. శత్రుసంహారమయినది గనుక నిట నొకసారి యాసీనులగుదురా యుదాసీనులగుదురా?

పృ—ఆసన్నమరణుఁడై యున్నతోడిప్రభువుమీఁద మా కాగ్రహము లేదు. అజ్ఞ చేయుదుము.

రూ-ల—రాజా! విధికృతమయినపనికి నే నేమియుఁ జేయఁజాలను. భిషఙ్మణి నెవనినైనఁ బిలిపింపుమందువా?

పాం—నీవు చేసినపని, లేనివిధిమీఁద నేల పెట్టెదవు? నేను జీవింపఁగలకాల మింకఁ గొన్నిగంటలుమాత్రమే యున్నది. పోవునాప్రాణమును బట్టుకొనఁ జాలువైద్యుఁ డీప్రపంచమున లేఁడు.

పృ—ఇంతశౌర్యధైర్యశాలి యీల్గుట ప్రపంచమున కొక పెద్దనష్టము.

పౌం—నీకు లాభమే కాదా !

పృ—రూపలత నాకు లభించుట గావలసినది కాని నీవు జీవించియున్న నాకు నష్టమేమి ?

రూ-ల—నీకుఁ జాలబాధగా నున్నదా ? పాపము !

పౌ—బాధగాఁ గాక యన్యథా యెట్లుండును ? అయినను నరదులోఁ గొంచెము సుఖము.

రూ-ల—ఎందువలన ?

పౌ—రూపలతాకృతమగు మరణము గలుగుటవలన.

రూ-ల—నాథా ! రాజహత్యాపాతకురాలనని నామీఁద నీ కేవ జనింపదుగద ?

పృ—ఏవ యేలపుట్టవలెను ? నీ వడ్డువచ్చితివిగాని నేనైన నాపని చేసియుండవలసినవాఁడనే కదా ?

పౌం—వీరాగ్రేసరుఁడవైనను నీవట్లు చేయలేవు. పార్థునకు శిఖండివలె నీకీపె సహాయురాలైనది.

రూ-ల—ఆర్యపుత్రా ! ఏమోకాని యొకబాణమయిన వేసినాఁడు కాఁడు.

పృ—కన్నెత్తియైనఁ జూడలేకపోయినాఁడు.

రూ-ల—అందుచేతనే నాకుఁ బశ్చాత్తాపము మతింత హెచ్చుచున్నది.

పౌం—రూపలతా ! నీకోపము పిచారముగానో దయగానో మాటిన, నేధన్యుఁడనే. రాజేంద్రా ! కాంతామణీ ! శక్తితగ్గుచున్నది. చావు చేరువచేరువగా వచ్చుచున్నది. మీరు శత్రుభావముతోఁ బ్రసంగింతురా! మిత్రభావముతో మాటలాడుదురా !

పృ—(కన్నీటితో) రాజా ! ఇంకను మాకు శతృత్వమేమున్నది? యీపన్నమనుష్యులలోను నేదోయొక లోపముండును. అట్లే నీలోఁ గొన్నిదుర్గుణము లుండవచ్చును. మాలోమాత్రము లేవా ? కాంతావాంఛ దేహధర్మము. పాంచిరబ్ధవశమున నీవు నేను నొకకాంతనే కామించుటతటస్థించినది. నన్ను వంచించి నీవును నిన్ను నిర్జించి నేను నాకాంతకొఱకుఁ బ్రయత్నించితిమి. నాయత్నముసఫలమైనది. నీది పాపము ! విఫలమైనది.

పౌం—న్యాయముగా మాటలాడినావు. సౌమ్యమూర్తివి. సుగుణరాశివి. సుందరరూపుఁడవు. అట్టిరూపలత నీకుఁ గాక నాకుఁ బ్రాప్తించునా ? మిమ్ము నేనొకటి యడుగవలెనని యున్నది, యడుగవచ్చునా ?

పృ-రూ-ల—యథేచ్ఛముగా నడుగవచ్చును.

పౌం—నన్ను జయించినారుగనుక నారాజ్య మిఁక మీదేకాదా ?

రూ-ల—నాకు రాజ్యమక్కఱలేదని భానువర్మ యిదివఱకే చెప్పినాఁడు.

పృ—నాకంతకంటె నక్కఱలేదని యిప్పుడు చెప్పుచున్నాను. రూపలతాప్రాప్తి యేకావలసినది. అదియైనది చాలును. నీరాజ్యము నీయిష్టానుసారము చేసికొనవచ్చును.

పౌం—నే నవివాహితుఁడను. తరువాత రాజ్యముచేయుట కెవరును లేరు.

రూ-ల—నాథా ! మరణోన్ముఖుఁడైయున్న మహీపతికి మన మేయుపకారమైనఁ జేయఁగలమేని చేయుదము.

పృ—రాజా ! నీకేమైన మేము దీర్పఁగలిగినవాంఛ లున్నవా !

పౌం—మీరంతకరుణాంతరంగులై యడుగుచున్నారు గనుక నేనొకవరముగోరెదను,

రూ-ల—(అప) ముందు, మాట యిచ్చినారే ?

పౌం—భీతహరిణివలె నట్లుచూడకుము. రణమునందుఁ జూపినశౌర్యమంతయు నే మయిపోయినది ? నీభయకారణము నాకుఁ దెలిసినది. కొంతసేపటిలోఁ గాలముచేయనున్న నేను నిన్నుఁ గోరను.

పృ—అట్లయిన నాప్రాణము నడిగినను నిచ్చెదను.

రూ—నాథా ! మాప్రాణముల నునుఁడు. ఒకటి విడిచి యొకటి యుండదు.

పౌం—ఆహా ! అట్టిజాయానురాగము భూలోకస్వర్గముగదా !

రూ-ల—అడుగవేమి రాజా ?

పౌం—అడిగినతరువాత మాట దిరుగరుగద ?

పృ—మా నైజము నెఱిఁగియుండియు నట్లనుట యాశ్చర్యముగా నున్నది.

పౌం—క్షమింపుము. మీరు నాకీయవలసిన దేదియు లేదు. అనురాగసూచకముగా నేను రూపలత కొకటి యీయ నెంచినాను. అది యామెవలదనఁగూడదు.

రూ-ల—నీపాణిములే పుచ్చుకొంటిని. ఇఁక నాకంతకంటె నేమి యిచ్చెదవు ?

పౌం—అవి నేనీయకుండఁ బుచ్చుకొనినవి.

పృ—రూపలతా ! మరణింపఁబోవువానికి శ్రమ యేల యిచ్చెదవు! పుచ్చుకొనుము.

రూ-ల—మంచిది.

పౌం—చంద్రిమాళీ ! ఇదిగో నామరణశాసనమువ్రాసి జేబులోఁ బెట్టుకొంటిని. దృగ్బలమును జిహ్వాశక్తియుఁ గూడ సముద్రము పాటువాఱినట్లు క్షీణించుచున్నవి. నాకు బదులుగా నది నీవు చదువుము.

చం—(కన్నులు తుడుచుకొనుచు) మహారాజా! ఆసముద్రగర్భమున హాయిగా జీవించుచుండు ప్రాణుల మిక్కిలి బయలుపడి బాధపడవలసినవారమైయున్నాము.

(చదువును)

"రూపలతాపరిణయాపేక్షతో నిద్రాహారములు సరిగాలేక, దాదాపుగా నొకసంవత్సరమునుండి యనన్యగోచర మగుబాధ ననుభవించుచున్నాను. ఆ కాంతామణికి నేను బరమాసహ్యపదార్థమ నైనాను. ఆమెకు నాపై నేవ హెచ్చినకొలఁది నాకామెపై ననురాగము హెచ్చుచున్నది. రూపలతాసంగ్రహార్థమే సంగ్రామమునకుఁ బోవుచున్నాను. వారు రాజ్యముకోసము దండెత్తి వచ్చినవారు గారని నాకుఁ దెలియును. జయాపజయము లనుకొనునట్లుకాకపోవచ్చును. జయముపొంది వచ్చినయెడల నీశాసనమునకుఁ బ్రయోజనములేదు. అన్యథా జరిగినయెడల, నీక్రింద వ్రాసినప్రకారము నాయాపద్రాజ్యమును జంద్రమౌళి విభజించి వారివారి కప్పగింపవలెను.

నాయిష్టానుసారము చేయకపోయినయెడల, నీవతఁ కెంతవిశ్వాసపాత్రుఁడుగాఁ బ్రవర్తించినాఁడో యప్పు డంతకృతఘ్నుఁడౌను.

ఈవఱకే ప్రతిగ్రామమునకుఁ బశుభూములుగా వదలిపెట్టిన విశాలప్రదేశములీభాగములలోఁ జేరనీయఁ గూడదు.

పరిపూర్ణరాజభక్తితోఁ బరిపాలనకృత్యములు నెఱవేర్చినచంద్రమౌళి నాల్గవవంతు రాజ్యమనుభవింపవలెను.

చం—అయ్యో! మహారాజా! మీరు స్మరణీయులైనతరువాత నాకు దుఃఖానుభవమేకాని, రాజ్యభోగముండదు.

పాం—చదువు! చదువు! నీవు నామాట కెప్పుడు నెదురుచెప్పినవాఁడవు గావు. "అనుభవింపవలెను" అని వ్రాసితిని. అర్థింపలేదు. ఆజ్ఞాపించినాను.

చం—చిత్తము.

"ఇచ్చకములాడక తనకు ధర్మమని తోఁచినయట్లే ప్రభువు మొగముముందఱఁ జెప్పి, వినకున్నను విడనాడక, (నవరించి వ్రాసినమాటలు చూచుకొనువలెను.) తుద కతనికై కదనమందుఁ బ్రాణములుగూడ నర్పింపసాహసించిన నాప్రియమిత్రుఁడగు ధర్మాచార్యునకు—ఆతఁడు యుద్ధహతుఁడైన—నతని తరువాతి కుటుంబమువారికి, నాల్గవపాలు రాజ్య మేగవలెను."

పాం—హా! మిత్రరత్నమా! సార్థకనామధేయా! తెఱపిగా నేడ్చెదనని చెప్పి యు

ప్పడనిలోఁ జొచ్చితిని. అయ్యో! యిప్పుడు శరీగబాధ కావలసిన తెలిపి యీయకున్నది. మనయభేదప్రాణమిత్రత్వసూచకముగా నిదిగో! నాకునునీ కునుగూడఁగలిపి కన్నీళ్లువిడుచుచున్నాను—చదువుము, రూపలతా! మిగిలిన మరణశాసనము నీవుసావధానచిత్తవై విని, చేసినవాగ్దానమునిలుపుకొనవలెను.

చం—"మిగిలినసగము రాజ్యములో, భానువర్మయొకవంతును రూపలత యొకవంతు నుదీసికొనవలెను. (అడ్డుగా సవరించివ్రాసినపఙ్క్తులు చూచుకొనవలెను.) ఇద్దఱును నాప్రాణప్రియయగురూపలతయే యని తరువాతఁ దెలిసినది గను కను, రూపయొక్కటే యయినను రెండవనామము మధురతరముగా నుండు టవలనను, శేషించినయర్ధరాజ్యము రూపలతకే వెళ్ళవలెను,"

పౌండ్రికుఁడు.

పౌం—రూపలతా! నాయర్ధాంగలక్ష్మివి కాకపోయినను, దయయుంచి నీవు నాయ నంతరము నాయర్ధరాజ్యలక్ష్మితోఁ గలిసి సుఖపడుము.

రూ-ల—ఏమి యీతనివెఱ్ఱిమనోవికారము! రాజా! నీప్రాణములు తీసినదాని కీ బహుమానము తగదు.

పృ—స్వవచనోల్లంఘనము నీవంటిదానికిఁ దగ, దూరకుండుము.

పౌం—ప్రాణరక్షణము చేసినవారిని సత్కరించుట జనసామాన్యమైన కృత్యమే. ఓరూపలతా! ఇటొకసారి చూడుము. అప్పుడట్లు ప్రాణములు దీసి యిప్పు డిట్లు ప్రాణములు దీసినత్రిలోకసుందరిని బహూకరించిననే, కంధికంటెను గాఢతరమై గభీరతరమైన నాయనురాగము నీచిత్తమునకుఁ జరితార్థుఁడై మ హాభాగుఁడైన యామదనసుందరునకును వెల్లడియగును.

రూ-ల—రాజా! ప్రాణములుపోనున్నవి. మాటలుతిన్నగావచ్చుటలేదు. అంతమందు, మతియెట్లుండునో భావిగతి యట్లుండు ననికదా గ్రంథములు చెప్పుచున్నవి. ఈపాటిశరీరపామరత్వమువదలిభగవన్నామస్మరణ మొకసారిచేసికొనరాదా?

పౌం—స్మరణము జ్ఞానపూర్వకము గదా! అజ్ఞేయుఁడు స్మరణీయుఁడుకాఁజాలఁడు.

పృ—రాజసోదరుఁడా! ఇప్పుడైన నీపూర్వపువాలకము వదలి చేతులు జోడించి నారాయణనామోచ్చారణము చేసికొనుము. అజామిళుఁడంతవాని కది య ఘనివారకమైనది.

రూ-ల—నీ వనఁజాల వేమో! రాజా! నీచెవిలో నే నాభవతారకనామ మందు నా? అప్పుడవశముగా నైన నది నీమనస్సులోఁ బ్రవేశించును.

పౌం—కారణాంతరముచే నాకది మహాప్రసాదము. పృథ్వీరూపుఁడు నీ పట్ల చే యుట కొప్పుకొననా?

వృ—అయ్యయ్యో ! అట్లనుచున్నావేమి ? ఇట్టిస్థితిలో భావిసౌఖ్యముకై యొకరి కొకరు సాహాయ్యము చేసికొనఁగూడదా !

రూ.ల—నారాయణ ! నారాయణ! శ్రీమన్నారాయణ! (అని చెవిలోనూఁదును.)

పౌం—నాజన్మసాఫల్యమైనది ? నారాయణనామ మితరఫల మీయలేకపోయిన ను రూపలతావదనపద్మపరిమళానుభవఫలము నిచ్చినది.

రూ.ల—అయ్యో ! పాపఘటమా ! నీయుత్తరగతి యాలోచించి చూచిననాకుఁ గన్నీళ్లు వచ్చుచున్నవి ! ఆర్యపుత్రా ! యేమి చేయుదము ?

వృ—ఇంకొకసారి నీవేయనుమని చెప్పుము. బలాత్కారముగా నౌషధము మ్రింగి నను బని చేయక తప్పదు.

రూ.ల—పౌండ్రకరాజా ! పట్టుదల వదలి యొకసారి పరమేశ్వరధ్యానము చేయు మని, యిదిగోఁ జూడు, నేను జేతులుమోడ్చి నిన్నుఁ బ్రార్థించుచున్నాను.

పౌం—నీవు చేయుమన్న నేను జేయకుందునా ? మరణ మాసన్నమై యున్నను నా కుఁ గొండంతశక్తి వచ్చుచున్నది. (చేతులు జోడించి) రూపలత యాజ్ఞాపిం చుచున్నది గనుక, నిష్టము లేకున్నను సంసయాస్పదమనై ననిన్ను వేఁడుకొను చున్నాను. విను. లోకమునకు నిరంతరరుజాదుఃఖజరామరణబాధలఁ బ్రసా దించుచు, సదాచిదానందుఁడనై యుండునోపరమాత్మా ! నన్నీవిధముగాఁ గాక యితరమార్గములఁ గాపాడుము.

వృ—పౌండ్రికా ! నీవు పరమబౌద్ధుఁడువలె నున్నావు.

పౌం—ప్రజలకన్నులలో దుమ్ముపోయు ప్రాచీననవీనమతములలో, వందనీయుండైన బుద్ధాచార్యునిమతమే మంచిది గాని, "ప్రమాదోధీమతామపి" యని య తఁడు రెండుతప్పులు చేసినాఁడు.

వృ—అవి యేవి ?

పౌం—పంచభూతములు పంచభూతములలోఁ గలసి చచ్చిపోవువానికి జన్మపరంప రఁదెచ్చిపెట్టుట యొకటియు, దుఃఖభూయిష్ఠమైన ప్రపంచములో నక్కడ క్కడనుండుసుఖలేశములను విసర్జింపుఁడని బోధించుట యొకటియు.

రూ.ల—అయ్యయ్యో ! ఆర్యపుత్రా ! ఇఁకఁ గార్యము లేదు. పోదమురండు ; మాగురువుగారిట నున్న, మతిఁ ద్రిప్పఁ గలుగుదురేమో !

(అందఱు నిష్క్రమింతురు.)

---

శ్రీరామచంద్రపరబ్రహ్మణేనమః.

# రూ ప ల త.

## నవమాంకము.

ప్రదేశము—ముక్తిపురరాజభవనము.

ప్రవేశము—రామానందుఁడు, శివశర్మ, రూపధరుఁడు, హేమలత, రూపలత, కాత్యాయని, మతిమంతుఁడు, పృథ్వీరూపుఁడు, దూరదర్శి.

రూ-ల—నాథా! గురువుగారు వలదనుచుండఁగా మేముభయులము పత్రిపురమునకుఁ బోయి వారియెడల మహాపరాధము చేసినాము.

పృ—ఆయపరాధమునకు నిష్కృతి లేదా ?

రూ-ల—నిష్కృతి లేనినేర ముండదు.

పృ—అదియేదో చెప్పిన మీకు బదులు నేను జేసెదను.

రూ-ల—కాత్యాయని యిదివఱకే యది విధించినది. కాత్యాయనీ చెప్పవేమి?

కా-జాయాదోషమును బంచుకొనుటకు నీపతియొప్పుకొన్నట్లందఱునొప్పుకొందురా?

దూ—నన్ను చెప్పనక్కఱలేదు. నేను నందులకు సంసిద్ధుఁడనై యున్నాను.

రా—వధూవరులారా ! లేనిదోషమునకో స్వల్పదోషమునకో పెద్దధర్మశాస్త్రచర్చ కావించుచున్నారే !

కా—నాలుగుచేతుల నొనరించినపాపమున కెనిమిదిచేతులతోఁ జేయువందనములు ప్రాయశ్చిత్తమని నాకుఁ దోఁచినరీతిగా నప్పుడు రూపలతతోఁ జెప్పినాను.

రూ-ల—చెప్పిన ట్లిప్పుడు చేయుట కాలస్య మేల?

(నలుగురు రామానందునకు నమస్కరింతురు.)

రా—అష్టైశ్వర్యములతో నానంద మనుభవించుచుండుదురుగాక ! మంత్రికుమారా ! నీభార్య మిక్కిలి గడుసుది. ఎట్లు సంసారకృత్యముల నిర్వహించుకొం వోసుమా !

దూ—సంసారతారకుఁ డగుభగవంతునికృపచేతను,సంసారమును దెచ్చిపెట్టినమహా

భావునియాశీర్వచనముచేతను, సంసారమూల మైనభార్యసాహాయ్యముచేతను, బనులు చక్కఁగా నెఱవేఱునను ధైర్య మున్నది.

కా—పదములవ్యుత్పత్తినిబట్టిచూచిన, భారము భార్యకంటె భర్తకే యెక్కువగాఁ గాన్పించుచున్నది.

రూ-ల—మాపట్టున భరింపఁబడుటకు రాజ్యలక్ష్మియొకటి యెక్కువగా నున్నది.

పృ—పితృదత్తమైనదానిని భరించుబాధ్యత నాది గాని, కొత్తగా వచ్చినదాని నెవరు సంపాదించుకొన్నారో వారె భరింపవలెను.

రూ-ధ—ఆహా! పౌండ్రకునిస్వభావ మతిచిత్రముగా నున్నది మంచివాఁడందమా? చెడ్డవాఁ డందమా ?

మ—చెడ్డవాఁడనియే చెప్పవలెను.

పృ—ఉన్నచెడ్డతనము నాస్తికత. తక్కినవిషయములయందుఁ జెడ్డవాఁడని చెప్పుటకు వీలులేదు.

హే-ల—పరమశత్రువట్లు చెప్పుటకుఁ దగిన హేతువేదో యుండవలెను.

పృ— సీ. రాజచంద్రుఁడు మహా • రణశూరుఁ డని వాని
మార్కొని పోరిన • మాకుఁ దెలియు,
ననురాగనిశ్చలుఁ • డవనీశుఁ డని రాజ్య
లక్ష్మినొందిన రూప • లతకుఁ దెలియు,
స్నేహంబునో నట్టి • క్షితిపతి లేఁడని
మాతుఁడు ధర్మాచార్య • హితుఁ డెఱుంగుఁ,
బ్రభుఁ డందఱకుఁ బ్రాణ • పదమైన ప్రభుఁడని
వలవల యేడ్చిన • ప్రజ యెఱుంగు,

గీ. నొకటి రెండుదుర్గుణములు • ప్రకటితంబు
లైనమాత్రాన నెవని దు • రాత్ముఁడంచు
దూఱరా ; దీవఱకు నట్లె • దూఱితినాఁడ
నేను ; నిలుకడచే నిప్డు • నిజము దెలిసె.

రూ—ఇప్పుడు మృతుఁడై యున్నందున రాజుయొక్కయాయొకటిరెండుదోషములు గూడ మఱచిపోవలెను. ధర్మాచార్యుమరణమున కాతఁ డెంతధైర్యము చెడి దుఃఖించినాఁడు. పాపము !

శి—పౌండ్రికుఁ డెంతవిలపించినాఁడో నే నంతవిలపించుచున్నాను. అతఁడు నా కంతసాహాయ్యము చేసినాఁడు. అతనిఋణము నేను—నే నవనేల?—మీ, రెన్నఁటికిఁ దీర్చుకొనలేరు.

మ—పౌండ్రకుఁడు నాల్గవవంతురాజ్య మీయవలెనని వ్రాసినవాఁడు మన కెట్లు కృతజ్ఞతాపాత్రుఁడగును ?

రా—మతిమంతా ! మరణకారకులైన రూపలతకే యర్ధరాజ్యము నిచ్చినవాఁడే తనికందులో సగమిచ్చుట యేమియాశ్చర్యము ?

రూ-ల—ఎంతోసాహాయ్యము చేయకపోయిన, మా సోదరుఁ డగుశివశర్మ యంత గాఁ నతని శ్లాఘింపఁడు.

శి—సోదరీమణీ ! అతఁడక్కడ లేకున్న నీవిజయము మనకు సంభవింపకపోవునని నేను త్రికరణశుద్ధిగాఁ జెప్పఁగలను.

రూ-ధ—నీవు లేకపోయిన సంభవించునా ?

శి—మహారాజా ! నాతోఁగూడ నతఁ డుండుటవలననే సంభవించినది.

రూ-ధ—కనుక నీఋణ మెట్లుతీర్చుకొనఁగలము ?

శి—నే నంతయుపకారినని సదయహృదయులై యనుకొనుటే చాలును.

రూ-ల—నాథా ! గురువుగారు నాకెక్కువగా నర్ధరాజ్యము పౌండ్రికుఁ డిచ్చి నాఁడని చెప్పినారు. అది నిజము—అందులో శివశర్మకు సగమిచ్చుటకుమీ రంగీకరింపవలెను.

పృ—దాతయతఁడు—ప్రతిగ్రహీత్రివినీవు—నడుమనాయంగీకార మేలకోరెదవు?

రూ-ల—నేనే మీసొత్తునై నప్పుడు, నాసొత్తు మీసొత్తు గాదా ?

పృ—అయిన నీవు జాగ్రత్తగా మాటయీయవలెను. అవసానమరణకాలమున నొసఁ గినవాగ్దానము భంగము కాఁగూడదు.

రూ-ల—ఇచ్చుట యనఁగా దానవిక్రయాద్యధికారములతో నిచ్చుట యన్నమాట యేకదా ! మీకభ్యంతరము లేనియెడల, నాసొత్తు నాయిష్టమువచ్చినట్లు దానముచేసికొనుట కేమి యభ్యంతరము ?

శి—ప్రతిగ్రహీత యనంగీకారము. గురుచర్య లగు రామానందుఁడుగారి పాదకమలములకడఁ గూరుచుండి, వేదాంతశాస్త్రాధ్యయనము చేసి, వైరాగ్యము సంపాదించుకొనవలెననుకుతూహలముతో నున్నయొక బ్రాహ్మణునకు రాజ్యమంటఁగట్టఁజూచుట, యుపకారకృత్యము గాని యపకారకృత్యము గాదు. గురువుగారి కేల యూర్పింపఁగూడదు ?

రూ-ల—సోదరా! గురుశిఖామణిమాట విస్మృతిలోఁ బడలేదు. ఆయన త్రిలోకరాజ్యమైనను స్వీకరింపరని జగద్విదితమైనది.

రా—గురుదక్షిణ యిచ్చుట యొకసారియే కాని రెండుసార్లు కాదు.

రూ-ల—అట్లయిన నాప్రాణసఖి యగుకాత్యాయనికిఁ బెండ్లిసమయమందుఁ బసుపుగుంకుమలకై యది నేనిచ్చిన, నన్నగారివలెనే వలదనునా?

కా—వలదనదు కాని, పతికిఁ బస్తును బత్నికి ఫలాహార ముండుట యంతప్రశస్తముగాదు.

రూ-ల—పసుపుగుంకుమ లాఁడువారికిఁ గాని మగవారికిఁ గావు.

కా—రాజ్యమునుండి వచ్చుధనమంతయు నాపసుపునకుఁ గుంకుమమునకే యుపయోగించిన నీప్రాణసఖి పైఁడితల్లియై భయంకరముగ నగపడునేమో?

హే-ల—కాత్యాయని యెప్పుడు నవ్వుటాలమాటలే?

శి—పోనీ! చెల్లెలా! యీయాయఁదలఁచుకొన్న కట్నము, దూరదర్శిగారికే కట్టఁబెట్టరాదా?

రూ-ల—నోటినుండి మాటజాఱినతరువాత, మఱియొకలాగునఁ జేయుటకు మనసొప్పకున్నది.

కా—శివశర్మవలెనే వలదనకపోవుట నాపొరపాటు. అట్లన్న నీకు సందేహ ముండకపోవును.

దూ—వదాన్యయగురాణిగారి నిట్లుతికమకలుపెట్టుటనీకుచితముగాదు, కాత్యాయనీ!

కా—చేపటినుండి కదా, రాణిగారు! నేఁటిసల్లాపము లనుచితములుగావు. ఆర్యపుత్రా! అదిగాక—పురుషు లతిగంభీరహృదయులు. రూపవతి యైనభార్య శత్రువని యొకదిక్కుమాలినశ్లోకమున్నది. దానికిఁ దోడు రాజ్యపతికూడ నైనయెడలఁ, బతి యేమనుకొనునో యెవ రెఱుఁగుదురు?

రూ-ల—(నవ్వుచు) చెలీ! నీవు వలదనకుము! నే నీచిక్కు విడఁగొట్టెదను నాథా! తమసెలవైనయెడల, నాయర్ధరాజ్యములో సగము కాత్యాయనికిని సగము దూరదర్శికిని నిచ్చెదను.

రా—సెబాసు! తల్లీ! రూపలతా! పృథ్వీరూపునకుఁ దగినరాణి వౌదువు.

పృ—నీయౌదార్యము ప్రశంసనీయమేకాని, పౌండ్రకుఁ డింక నీకిచ్చినదేమున్నది?

రూ-ల—సకలసద్గుణసముద్రులగు మిమ్ముఁ బెండ్లాడనిచ్చినాఁ డదిచాలును.

రూ-ధ—పృథ్వీరూపా! నాకును నీకును నాబిడ్డకును సంబంధము గలుగునని పెద్దలుపెట్టిన పేరులే సూచించుచున్నవి.

కా — రేపగుసంబంధము సంబంధముగాని నామమాత్రసంబంధ మేమిసంబంధము. రేపాకరికొక్కరు వేసికొను పేర్లు చూడవలసినపేర్లు.

మ — కాత్యాయనీ ! ప్రభువుగారు మాటలాడునప్పుడు పరిహాసవాక్యములు గట్టిపెట్టుము. దూరదర్శీ ! వంచుటకుఁ దల్లిలేనికన్యయైనది. నీవు భయభక్తులు చెప్పి వంచుకొనవలెను.

హే-ల — పోనిమ్ము ! మతిమంతా ! మాయందుండుచనవుచేత నిట్లు మాటలాడుచున్నది. పోయినతల్లి తిరుగరాదుకదా ! రూపలతకుఁ గాత్యాయనికిఁగూడ నేనే తల్లిని. ప్రభువుగారికిఁ గాత్యాయనిపరిహాసములు క్రొత్తలు గావు.

కా — రూపలతా ! నేనిఁక మూకీభావమును వహించెదను.

రూ-ధ —

శా. ఈరాజ్యం బొకముప్పదేండ్లపయి య♦య్యె న్నాతలందాల్చి, పృ
థ్వీరూపా ! భరియింపఁజాల నిఁక ధా♦త్రీభారము, న్గానఁ, గ
ర్వ్యారద్వీపముఁ గూఁతులోఁ గొని యశః♦పూర్ణుండవై వైభవో
దారప్రక్రియఁ బాలనన్సలుపుమా ! ♦ ధర్మానుసారంబుగన్.

రా — తథాస్తు.

హే.ల — గీ. మాకుసుతుఁడవు నీవె, జా♦మాత వీవె,
ద్విగుణముగఁ జూపవలెనయ్య ♦ ప్రేమ మిచట,
నిల నితరరాజు నెవ్వని ♦ వల దటంచు
వలచి నీచెట్టఁబట్టు రూ♦పలతపైని.

పృ — ఈవిషయములలో నాకుపదేశ మనావశ్యకము.

ఆ. అరణమిచ్చి రాజ్య, ♦ మంగనామణియైన
ప్రియతనూజ నాకుఁ ♦ బెండ్లిసేయఁ
దలఁచువారిఁ దల్లి ♦ దండ్రులమాడ్కిని
జూడ కొండురీతిఁ ♦ జూడఁగలనె ?

గీ. అందమపురూప ; మద్భుతం♦బయ్యె విద్య ;
గుణగణ మమూల్యమంజుల ♦ మణిగణంబు ;

కలికి యరుదెంచి నా ప్రాణ • ములనె నిల్పె;
నట్టిసతి నొందు తెఱఁగున • నెట్టుచూతు ?

రూ-ధ—రాజా ! నీ వన్యథా ప్రవర్తింతువని కాదు. స్త్రీసహజమగునపారానురాగమున హేమలత యట్లు చెప్పినది.

హే—దూరదర్శీ ! సకలకళాకుశలుఁడవును, సర్వధర్మజ్ఞుఁడవును నగునీకు నేఁ జెప్ప వలసినది లేదు. నాబిడ్డకుఁ దల్లి కఱవైనది. దేవిగారు రూపలతనుగూర్చి మీరాజుగారితోఁ జెప్పినమాటలు మా కాత్యాయనినిగూర్చి నీతోఁ జెప్పినట్లే భావింపవలెను. నీకుఁ దగినయరణ మిచ్చుటకు నేనసమర్థుఁడనైనను, నుదారశీలయగురూపలత యాలోటు దీర్చినది.

రూ—మీయాజ్ఞను శిరసావహించుచున్నాను.

రూ-ధ—మతిమంతా ! మనచింతలనెల్లఁ బోఁగొట్టి, మనలఁ జరితార్థులఁ జేసి మహానందసముద్రములో నోలలాడించుచున్న రామానందమహాపురుషునకు మన మెట్లుకృతజ్ఞత చూపఁగలము ;

హే—మహారాజా ! రేపటివివాహవైభవములు శీఘ్రముగా జరిపించి పసుపుబట్టలతో లక్ష్మీనారాయణద్వయమును నాకన్నులఁ బెట్టుటకంటె నెక్కువకృతజ్ఞత యేమికావలెను ?

గీ. నలుగురకు నగుసౌఖ్యమే • నాకు సుఖము,
నలుగురకు నగువంతయే • నాకు వంత,
వలయువారికి నాకు ల•బ్ధమయినట్టి
విద్యకఱవుటయే నాకు • వేడ్క రాజ !

రూ-ధ—అది చాలదు ! దేవీ ! యిటు రమ్ము, మతిమంతా యిటు రమ్ము ! మహానుభావా ! రామానందా ! నీపదపద్మము లొకసారి యిటు ముందఱికిఁ జాఁపుము. నీమహాత్మ్యము గనుఁగొనఁజాలక వెనుక నిన్నుఁ దూలుమాటలాడి మహాపచారము చేసితిని.

గీ. స్వాంతమోదంబుచే నొడ • ల్జల్లుమనఁగ,
గనుల నానందబాష్పము • ల్గ్రమ్ముకొనఁగ,

భక్తిభరమునఁ బునరభి ♦ వందనములు
మేము ముగురము చేయుచు♦న్నాము గొనుము.
(నమస్కరింతురు.)

రా—మనోభీష్టసిద్ధిరస్తు!

రూ-ధ—మనమిఁకఁ జని వివాహమహోత్సవకార్యము లెట్లుసాగుచున్నవో చూతము.

కా—(అప-రూ-ల) ఆయన యేమోకాని మొగముచిన్నవుచ్చుకొని యున్నారు.

రూ-ల—(అప-కా) ఎందుచేతనో నీవే యడుగరాదా?

కా—(అప-రూ-ల) తండ్రిగారియెదుట నోరెత్తుటకు వీలులేదుగదా!

రూ-ల—దూరదర్శిగారూ! మీరేమో దూరాలోచన చేయుచున్నట్లున్నారు.

దూ—ఏమియు లేదమ్మా! మానాయనగారు రాకుండ నావివాహ మగునని కొంచె
ము విచారముగా నున్నది.

మ—వియ్యంకుఁడు రాకుండ వివాహ మగునా? ప్రభువుగారింతకుముందే వర్త
మానమంపినారు. ప్రత్యుత్తరముగూడ వచ్చినది. నేఁటిరాత్రికో రేపుద
యమునకో యాయన సకుటుంబముగ నిటకు వత్తురు.

రా—నేఁటిరాత్రికే వత్తురని యిప్పుడే వార్త వచ్చినది. ఇఁక మనకుఁ గావలసిన
దేమున్నది?

శి— సీ. పరపీడ పాపంబు ♦ పరులకు మేల్సేఁత
పుణ్యం బనెడునీతి ♦ పొసఁగుఁగాక!

దూ— దేవుని, భూపతి, ♦ దేశంబు, గురువుల,
నెల్లరు భక్తి సే♦వింతురుగాక!

రూ-ల— ప్రతికుటుంబం బను♦ రాగబద్ధంబయి
యుర్విపై స్వర్గమై♦ యుండుఁ గాక!

కా— యత్తగోడం(డ్రచా♦యను గాక పొత్తున
శ్రీవాక్సతులు ప్రవ♦ర్తింతురి గాక!

నృ— గీ. న్యాయపరిపాలనము రాజు ♦ సేయుఁగాక!

హే— వసుధ సస్యసమృద్ధయై ♦ వఱలుఁ గాక!

రూ-ధ— దేశమంతట శాంతి వ♦ర్ధిల్లుఁ గాక!

మ— యుర్వి నందఱు సుఖులయి ♦ యుంద్రు గాక!

రా—తథాస్తు.

క. వందనము సుందరాంగా!
వందన మపవర్గసౌఖ్య • వరదాయి! ప్రభూ!
వందనము దేవదేవా!
వందన మోజానకీధ•వా! శ్రీరామా!

('అందఱు నిష్క్రమింతురు.)



## తప్పొప్పుల పట్టిక.

| పొరట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
| --- | --- | --- | --- |
| 20 | 2 | వమ్మయు | వమ్మయి |
| 20 | 16 | గలిగిలించి | గలిగించి |
| 31 | 6 | అన్యధా | అన్యథా |
| 43 | 22 | రా—విశ్రాంతి | విశ్రాంతి |
| 43 | 25 | తల్లులారా | రా—తల్లులారా |
| 47 | 14 | వృత్రికి | పుత్రికి |
| 74 | 10 | నిర్ధారణ | నిర్ధారణ |
| 99 | 6 | చూవులు | చూపులు |
| 99 | 12 | దేశము | దేశము. |
| 101 | 16 | చెతసే | చేతసే |
| 107 | 5 | పృధ్వీ | పృథ్వీ |
| 126 | 9 | పరిభ్రమంబులు | పరిభ్రమంబుల |
| 135 | 6 | నన్ను జూచి | నన్నుఁ జూచి |

# Works of Kuchi Narasimham,

## Pithapuram, Godavari Dt.

* *Approved for use in Libraries*—Fort St. George Gazette of 21—3—1921 page 637.

### TELUGU

| No. | Title | Rs. | As. | Ps. |
|---|---|---|---|---|
| *1 | **Life and Teachings of Sri Rama Krishna Parama Hamsa** (Poetry) 2nd Edition ... ... | 0 | 10 | 0 |
| *2 | **Lord Gauranga** (Life of Chaithanya Swami) Poetry Vol. I ... | 1 | 4 | 0 |
| *3 | Do. ,, II ... | 1 | 4 | 0 |
| *4 | **Rupalata** :—An original Drama (Prescribed for the Elementary Higher Grade Training S. L. C. Examination of 1920) 3rd Edition ... ... | 0 | 14 | 0 |
| 5 | **Arrows of Fire** (Paul Richard's Sayings) ... | 0 | 1 | 0 |
| 6 | **Swami Vivekananda's 'East and West'** ... | 0 | 14 | 0 |
| 7 | **Vanavasi**:—The story of Parnell's Hermit amplified and dramatized—3rd Edition (approved for use in Schools, *Fort Saint* George Gazette of 14-6-1921 Page 619—prescribed for the Elementary Higher Grade Training S. L. C. Examination of 1925, and for the B. A. Examination of 1923) ... ... | 0 | 12 | 0 |
| 8 | **Selections in Telugu poetry and prose**:—from the author's own works (approved for use in Schools, *Fort Saint* George Gazette of 6-3-1923 Page 171--prose portion prescribed for the Secondary Grade Training Course of 1924—25) ... ... | 0 | 12 | 0 |
| 9 | **Telugu in Schools** ... ... ... | 0 | 3 | 0 |
| 10 | **Comic writings & Contributions to journals** ... | 0 | 12 | 0 |
| 11 | **An appeal to Andhra Ladies** ... ... | 0 | 2 | 0 |
| 12 | **Swami Vivekananda's Lectures on Bhakthi Yoga** | 0 | 10 | 0 |
| 13 | **Twelve Lectures of Vivekananda** ... ... | 1 | 8 | 0 |
| 14 | **Atmanivedanamu**—Poetry—(In Press) | | | |
| 15 | **Four Lectures of Vivekananda on the Hindu Epics** (In Press) | | | |

### ENGLISH (Pocket size)

| No. | Title | Rs. | As. | Ps. |
|---|---|---|---|---|
| 16 | Character ... ... ... ... | 0 | 2 | [illegible] |
| 17 | Student Life Now & Then ... ... | 0 | 3 | |

శ్రీరామ.

కూచి నరసింహము గారిచే రచింపబడిన



1. రామకృష్ణ పరమహంసచరిత్రము, ఉపదేశములు.
(పద్యకావ్యము.) రెండవకూర్పు. రు. 0-10-0
2. గాంధిచరిత్రము (పద్యకావ్యము.) ప్రథమభాగము. 1- 4-0
3. ఔ. ద్వితీయభాగము. 1- 4-0
4. రూపలత. (నాటకము.) 0-14-0
5. ఆగ్నేయాశుగములు. (పాలిప్రచుర్గారి యుపదేశములు)
ద్విపద- ఇంగ్లీషుమూలముతో. 0- 1-0
6. వివేకానందస్వామి ప్రశ్నోత్తరములు. 0-14-0
7. వనవాసి. (నాటకము.) 0-12-0
8. ఆంధ్రపద్యగద్యసంగ్రహము. (గ్రంథకర్త గ్రంథములనుండి.) 0-12-0
9. పాఠశాలలలోని తెలుగు. 0- 3-0
10. ప్రహసనములు-పత్రికావిలేఖనములు. 0-12-0
11. ఆంధ్రమహిళామణుల కొకమనవి. 0- 2-0
12. వివేకానందస్వామి భక్తియోగోపన్యాసములు. 0-10-0
13. వివేకానందస్వామి ద్వాదశోపన్యాసములు. 1- 8-0
14. ఆత్మనివేదనము- పద్యకావ్యము. (అచ్చులో నున్నది.)
15. వివేకానందస్వామి పౌరాణికోపన్యాసచతుష్టము. (డిటో.)

ఆంగ్లేయోపన్యాసములు.

———:o:———

16. యోగ్యత. 0- 2-0
17. ఇప్పటివిద్యార్థి—అప్పటివిద్యార్థి. 0- 3-0

అడ్రెస్ :—కూచి నరసింహము,

పిఠాపురము, గోదావరిజిల్లా.